# రాయప్రోలు
# రచనల పరిశీలన - తత్త్వవివేచన

(సిద్ధాంతవ్యాసము)


ఎం. లావణ్యా సరస్వతి
M.A; Ph.D.
లెక్చరర్, హైదరాబాద్ విశ్వవిద్యాలయం





ఆంధ్ర సారస్వత పరిషత్
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

RAYAPROLU RACHANALA PARISEELANA - THATHVA VIVECHANA ('A Critical study of Rayaprolu's works and his Philosophical outlook') A Doctoral Thesis by M. LAVANYA SARASWATHI.

ప్రథమ ముద్రణ : Feb 1988

ప్రతులు : 1000

మూల్యం : రూ. 60-00

ప్రతులకు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు–500 029.

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయముతో ముద్రించబడినది.

# ము ం దు మా ట

భాషాభిమానం, భాషాభినివేశం చెట్టపట్టాలు పట్టుకుని నడువగలిగినప్పుడే సాహిత్యవికాసం సాధ్యమవుతుంది. సాహిత్యప్రయోజనం నెరవేరుతుంది. కేవలాభిమానం సంకుచిత ధోరణులకూ, అజ్ఞానానికీ దారితీస్తుంది.

కడచిన నలువదియైదేండ్లుగా ఆంధ్ర సారస్వత పరిషత్తు భాషా ప్రచారానికే గాక పాండితీ విలసనానికీ, ప్రాచీనాంధ్ర సాహిత్య ప్రసరణానికీ, బాల సాహితికీ, జానపద వాఙ్మయ పరిచయానికీ ఇతోధికమైన అవకాశాలు కల్పించి తోడ్పడుతున్నది.

ఇంతవరకు పరిషత్తు ప్రచురించిన పండిత సారస్వతం, ప్రామాణికమై, పరిశోధకులకు పాథేయమై, విద్యార్థులకు కరదీపికై భాషాభిమానులందరి మన్ననలను అందుకొనగలిగినది.

విశ్వవిద్యాలయాల్లో జరుగుతున్న పరిశోధనకు సంబంధించిన అంశాలను కూడా ప్రచురించాలని పరిషత్తు భావించింది.

డా॥ శ్రీమతి లావణ్య సరస్వతి గారు హైదరాబాదు కేంద్ర విశ్వ విద్యాలయంలో "రాయప్రోలు రచనల పరిశీలన-తత్త్వవివేచన" అన్న అంశాన్ని గూర్చి పరిశోధన చేసి పిహెచ్. డి. పట్టాను సంపాదించినారు. ఆమె సిద్ధాంత వ్యాసాన్ని పరిషత్తు ప్రచురిస్తున్నది.

"కాలధర్మానుగతమై జగత్ప్రవృత్తి
మాఱునపుడు వాఙ్మయము మాఱు నిజము"

అన్న యుగోచితాగ్రగామి, నవయుగ వైతాళికుడు రాయప్రోలు. అసహజాలంకారాల ఉచ్చుల్లో చిక్కువడి, పాండితీప్రకర్ష మాత్రమే కవిత్వమన్న మాయలోపడి, ఛందోబంధమే ప్రబంధమన్న భ్రాంతిలోబడి, అతివేలశృంగార వర్ణనమే కావ్య పరమావధి అన్న లౌల్యానికి ఊడిగంచేస్తూ అస్తిత్వాన్నే కోల్పోయిన తెలుగు కవితను సులలితపదాలతో శ్రుతిపేయములైన ఛందస్సులతో, సమకాలీనమైన సహజమైన ఇతివృత్తాంతో అమలిన శృంగారస్పర్శతో, [illegible],



**23 మే 1983** నాడు జరిగిన ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారి షష్టిపూర్తి ఉత్సవ సభలో ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారు, శ్రీమతి కొత్తపల్లి లలితగారు, శ్రీమతి రాయప్రోలు వరలక్ష్మమ్మ గారు, ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, డా॥ (శ్రీమతి) ఎం. లావణ్య సరస్వతి గారు.

దేశభక్తి సందేశాలతో ధ్వనిమంతంచేసి, అలనాటి వ్యాసాది ఆర్షకవుల తత్త్వ చింతనతో స్పృశించి పథ నిర్దేశకుడైన రాయప్రోలు ధన్యజీవి.

రాయప్రోలు రచనలన్నింటిని పలుకోణాలతో పరిశీలించి ఆయన సాహిత్య తత్త్వాన్నీ, విశిష్ట వ్యక్తిత్వాన్నీ, కట్టెదుట నిలిపినారు శ్రీమతి లావణ్యా సరస్వతి గారు. ఆయన రచనల్లోని కవిత్వతత్త్వాన్నీ, భగవత్తత్త్వాన్ని, ఉక్తి వైచిత్రినీ, తెలుగుదనాన్నీ, సాంఘిక దృక్పథాన్నీ, స్త్రీ రూపాన్నీ, అమలినశృంగార తత్త్వాన్నీ సోదాహరణంగా నిరూపించగలిగినారు. విశేషించి అమలిన శృంగార తత్త్వాన్ని అనుశీలించి ఆవిష్కరించిన తీరుహృద్యం. తర్కక్షమం.

శ్రీమతి లావణ్యా సరస్వతిగారి సిద్ధాంత వ్యాసరచనలోని భాషా సారళ్యం రాయప్రోలు రచనాసారాళ్యాన్ని గుర్తుకు తెస్తున్నది.

రాయప్రోలు కవితామూర్తికి సువర్ణనీరాజనం ఈ సిద్ధాంత గ్రంథం. ఈ నీరాజనపు వెలుగుల్లో ఆయన కవితా ప్రతిభను సందర్శించవచ్చు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ఈ గ్రంథం వెలువడుతున్నందుకు మాకెంతో సంతోషంగా ఉన్నది. మా ప్రచురణగా ఈ గ్రంథాన్ని వెలువరించాలని శ్రీమతి లావణ్యా సరస్వతిగారు అభ్యర్థించినారు. అందుకు పరిషత్తు అంగీకరించి ప్రచురణను చేపట్టింది. ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ఆమెకు కృతజ్ఞతలు ప్రకటించుకుంటున్నాను.

తేదీ. 27-2-88

ఇరివెంటి కృష్ణమూర్తి

ఈ కృషి వెనుక...

# ఎందరో మహానుభావులు

నన్ను కుమార్తెగా ఆదరించి, వారి వార్ధక్యాన్ని లెక్కచేయక గంటల తరబడి నాకు విషయ వివరణ చేసిన ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారికి, ఆప్యాయతాను రాగాలను పంచిన శ్రీమతి వరలక్ష్మమ్మగారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ అక్షర రూపంగా వారికి పాదాభివందనాలర్పిస్తున్నాను. వారిద్దరి ఆదరాభిమానాలను, ఆశీర్వాదాలను ప్రత్యక్షంగా పొందగలగడం నా అదృష్టం. ఈనాడు వారిద్దరు లేరు. అయినా నా మనసునిండా నిండిన వారి స్మృతి పుష్పాలు పరిమళాలు వెదజల్లుతునే ఉన్నాయి.

తన వృద్ధాప్యంలో కూడా నా సందేహాలను శ్రద్ధతో తీర్చిన మా నాన్నగారు కీ.శే. గోపరాజు వైకుంఠరావుగారికి—

నాకు ఈ పరిశోధనకు అవకాశాన్నిచ్చిన అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు, నా పరిశోధనా పర్యవేక్షకులు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు ప్రాతః స్మరణీయులు. ఈ వ్యాసంలోని మెరుపువంటి ప్రతి భావం వెనుక వారి భావస్పర్శ అదృశ్యంగా ఉంది. తమ అమూల్యమైన కాలాన్ని వెచ్చించి నాకెన్నో సలహాలనిచ్చి, నా సందేహాలను తీర్చి, నాతో సహకరించిన ప్రేమమూర్తులయిన మా గురువర్యులు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారికి—

ఏవేళలో నేను వెళ్ళినా నాతో సహకరించి ప్రోత్సహించిన శ్రీమతి కొత్తపల్లి లలితగారికి-

సమావేశానికి అవకాశాన్నిచ్చి 'ప్రశ్నావళి'కి ఓపికతో సమాధానాలిచ్చిన పెద్దలకు, వృద్ధులకు -

ఆనాడు నా పరిశోధనా కాలంలో చిన్న చిన్న ప్రశ్నలతో సునిశితమైన చర్చలతో తమ అపూర్వ మేధాసంపత్తితో, విమర్శనా దృష్టితో నా భావాలు స్పష్టపడేందుకు సహకరించినవారు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు. ఈనాడు

# అంకితం



ఆనాడు

గాలికి రెపరెపలాడి
కొడిగట్టి కొండెక్కి పోతున్న
నా విజ్ఞాన జ్యోతికి
తన అరచేతులను ఆపుగా ఉంచి
సెగతగులుతున్నా వెనుదీయక నిలిచి

ఈనాడు

నిశ్చలంగా తేజోమయంగా వెలుగుతూ
మరిన్ని చిరుదివ్వెలను
వెలిగించగల సామర్థ్యాన్ని కలిగించిన
సహృదయుడు, స్నేహశీలి, నా జీవితభాగస్వామి

**శ్రీ మూల్పూరు హనుమంతరావు గారికి**

ఈ విజ్ఞాన కిరణాన్ని
మాటలకందని మైత్రీ భావనతో సమర్పిస్తున్నాను.

బహువిధ సాహితీ వ్యాపకాల మధ్య అంతులేని పనుల వత్తిడిలో ఉండికూడా నేను అడిగిన వెంటనే తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందించడం నాపై వారికున్న అవ్యాజమైన ఆదరాభిమానాలకు నిదర్శనం. నా గ్రంథానికే వన్నెతెచ్చే 'తత్త్వ చింతామణి' ప్రదానం చేసిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారికి—

ఈ సిద్ధాంత గ్రంథానికి పరీక్షకులైన ఆచార్య సి. నారాయణరెడ్డి, ఆచార్య గంధం అప్పారావు గార్లకు—

నా విద్యావ్యాసంగానికి చేయూతనిచ్చి నన్ను అనుక్షణం ప్రోత్సహించి, నాతో సంపూర్ణంగా సహకరించి, నేను పరిశోధనా ఫలాన్ని పొందడానికి కృషి చేసిన వారు మావారు శ్రీ. ఎమ్. హనుమంతరావుగారు. అత్యంత శ్రద్ధాసక్తులతో ఈ వ్యాసానికి మేలు ప్రతిని వ్రాసి ఇచ్చి, ఈ నా కృషిలోని సాధక బాధకాలను తానూ భరించిన మా వారికి—

నావల్ల కలిగిన ఇబ్బందులను లెక్కచేయక నాకు సహకరించిన మా చిరంజీవులు అనిల్, అరుణ్, అజేయ్‌లకు—

ఈ గ్రంథం వెలువడటానికి కారణభూతులు, ప్రచురణకు ప్రోత్సహించిన వారు అయిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి—

ఆర్థిక సహకారాన్ని అందించిన తెలుగు విశ్వవిద్యాలయం అధికారులకు—

ప్రచురణ భారాన్ని తమ పై వేసుకుని సహకరించిన ఆంధ్ర సారస్వత పరిషత్ కార్యవర్గానికి— విశేషించి కార్యదర్శి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి-

ప్రచురణలో సహకరించిన శ్రీ హరికిషన్ రావు, శ్రీ తిరుమల రావు గార్లకు—

అతి తొందరలో శ్రద్ధతో ముద్రించి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేతలకు—

ప్రచురణకు అనుమతించిన హైదరాబాదు విశ్వవిద్యాలయాధికారులకు—

**అందరికీ -**

నా కృతజ్ఞతా పూర్వక

**వందనాలు.**

ఫిబ్రవరి 18, 1988

**లావణ్య సరస్వతి**

లెక్చరర్, హైదరాబాదు విశ్వవిద్యాలయం

# తత్త్వ చింతామణి

**ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం**
తెలుగు శాఖాధ్యక్షులు,
'తెలుగు సాహితి' (తెలుగు శాఖ),
హైదరాబాదు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

ఈ సిద్ధాంత వ్యాసంలో మూడు "మొదళ్ళు" ముడిపడి ఉండట ముచ్చటైన అంశం. ఆధునికాంధ్ర సాహిత్యంలో తనదైన సాహిత్య దృక్పథాన్ని ఒక సాహిత్య సిద్ధాంతంగా రూపొందించి లక్ష్యలక్షణ సమన్వయం చేసినట్లు కావ్య రచన చేసిన మొదటి కవి రాయప్రోలు సుబ్బారావు. దక్షిణ భారతంలో మొదటి కేంద్ర విశ్వవిద్యాలయంలో మొదటి ఆచార్యులైన డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారు పర్యవేక్షించిన మొదటి సిద్ధాంత వ్యాసం ఇది. హైదరాబాదు విశ్వ విద్యాలయంలో తెలుగు శాఖలో పిహెచ్. డి. పట్టాని సాధించిన వారిలో మొదటి వారు డా॥ లావణ్య సరస్వతిగారు. ఇలా కలిసిరావడం సామాన్యంగా అరుదు. అది చెప్పుకోదగ్గ మొదటి విశేషం.

ఆధునిక సాహిత్యాన్ని అనుశీలించడంలో ఈనాడు ముఖ్యంగా కనబడే దృక్పథాలు రెండు. సామాజిక దృక్పథంతో సాహిత్యాన్ని సమీక్షించే పద్ధతి, తాత్త్విక దృక్పథంతో సాహిత్యాన్ని అనుశీలించే పద్ధతి. వీటిలో రెండో మార్గానికి చెందిన సాహిత్య సమాలోచనకు ఈ సిద్ధాంత వ్యాసం ఉత్తమోదాహరణం. ఒక శైవ కవినో, ఒక వైష్ణవ కవినో లేదా ఒక మార్క్సిస్టు కవినో గ్రహించి అతని సాహిత్యాన్ని తాత్త్విక భిత్తికతో అనుశీలించడం కొంతవరకు తేలికేమోగాని రాయప్రోలు వంటి సంశ్లిష్ట తాత్త్విక దర్శకుల యొక్క దృక్పథాన్ని విశ్లేషించి సమన్వయించటం అంత తేలికైన పని కాదు. తేలికైన అంశాన్ని తీసుకుని తేలిగ్గా వ్రాయడం డా॥ లావణ్య సరస్వతిగారి తత్త్వానికి విరుద్ధం. అందువల్లనే

కాని రాయప్రోలువారి కవిత్వతత్త్వం, రాయప్రోలువారి తత్త్వచింతనం ఈ రెండింటిని సమన్వయాత్మకంగా సమర్పించాలంటే ఇటు సామాజిక దృక్పథం, అటు సాహిత్య దృక్పథమేకాకుండా ప్రాచీనార్వాచీన తత్త్వసిద్ధాంతాల సమవగాహన ముఖ్యంగా తోడ్పడుతుంది. ఈ గ్రంథంలో దాదాపు తొమ్మిది అధ్యాయాలు ఈ రకమైన పరిశీలనకు వినియోగించ బడ్డాయి. అంటే నాలుగింట మూడు పాళ్ళలో రాయప్రోలువారి కవితాశక్తికి వెనుకనున్న తాత్త్విక దృష్టిని విస్తృతంగా వివేచించడం జరిగిందన్నమాట.

ఆధునిక సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్న విద్యార్థులకు రాయప్రోలు కృతులను అవగాహనం చేసుకోవాలంటే ముఖ్యంగా నాలుగైదంశాలను గురించిన తులనాత్మక వివేచనం అవసరం. అవి, ఒకటి శృంగార రసస్థాయి అయిన రతి, రెండు ప్రణయభావం, మూడు అమలిన శృంగార రసస్థాయి అయిన స్నేహం, నాలుగు మధురభక్తి రసస్థాయి అయిన భగవద్రతి. తనూసంగ పర్యంతమై చింతనలో చిగురించి సువాసించేది శృంగార రసస్థాయి అయిన రతి. తనూ సంగాన్ని కాంక్షామాత్రంగా రమిస్తూ ఆసక్తిగా, ఆరాధనగా, ఆక్రందనగా, ప్రసరించే చిత్తస్పందన ప్రణయభావం. తనూ సంగరహితమై స్నేహ సూత్రంగా సర్వ జీవ ప్రేమభావంగా ప్రసరించే మానవజీవ ప్రవృత్తి అమలిన శృంగార స్థాయి అయిన స్నేహం, తనూ స్పృహలేని జీవచైతన్య ప్రవాహం ఆధ్యాత్మికానుభవం కోసం ఆర్తిగా అభివ్యక్తమై సాహిత్యాన్ని ఆశ్రయించి భగవంతునివైపు ప్రసరిస్తే భక్తిరస స్థాయిఅయిన భగవద్రతి అవుతుంది. ఈ అనుభవాలు జీవితంలోవే. ఇవి ఉమ్మడిగా అనుభవంలోకి వస్తాయి. విశ్లేషించుకుంటే ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రవృత్తిగా కనపడతాయి. ప్రాచీన సాహిత్యంలో శృంగారం, భక్తి పోషింప బడ్డాయి. ఆధునిక సాహిత్యంలో ప్రణయం, అమలిన శృంగారం వ్యక్తీకరింపబడ్డాయి. కాల్పనిక యుగ చైతన్యంలో ప్రణయశాఖను పండించిన కవులు ఎందరో ఉన్నారు.కాని అమలిన శృంగార ప్రవృత్తిని సాహిత్యంలో తన రచనల ద్వారా ప్రసరించిన ప్రత్యేకత రాయప్రోలు వారికే దక్కింది. రాయప్రోలు దర్శనంలో ప్రతిఫలించిన తాత్త్విక చింతనకు చింతామణి ఈ పరిశోధన గ్రంథం. తాత్త్విక భిత్తికతో ఒక కవి రచించిన కావ్యాలను అనుశీలించే పద్ధతికి ఒక ప్రమాణిక మార్గాన్ని ప్రతిపాదిస్తున్న రచన ఈ పరిశోధన గ్రంథం.

ఈ పరిశ్రమతో కూడుకున్న పరిశోధనాంశాన్ని ఎన్నుకున్నారనుకుంటాను. చిత్తశుద్ధి, పరిశోధన నిష్ఠ, తత్త్వచింతన, ప్రతిపాద్యాంశ వ్యగ్రతకల పరిశోధకురాలు కావడంచేత డా॥ లావణ్యా సరస్వతిగారు ఈ పరిశోధనాంశాన్ని సామర్థ్యంతో నిర్వహింపగలిగారు.

పరిశోధన పరిమాణాన్ని నిర్ణయించేది అభినవంగా సేకరించిన సామగ్రి. పరిశోధన ప్రమాణాన్ని నిర్ణయించేది పరిశోధన విధానంలో వెలార్చే వివేకం. పరిశోధన ప్రవృత్తిని వ్యక్తీకరించేది పరిశోధకుడు / రాలు సమస్యలకిచ్చే సమన్వయం. పరిశోధన స్వభావాన్ని వ్యక్తీకరించేవి ప్రామాణికమైన విశ్లేషణ, సమన్వయాత్మకమైన దృక్పథం. ఇదంతా లక్షణ సూక్తమైతే ఈ సిద్ధాంత వ్యాసం లక్ష్యభూమిక.

కవి ప్రయోగించే అభినవోక్తి గాని, నవ్య ప్రయోగం గాని అతనిలో జాలువారిన వివిధ వివేచనలకు, అన్వేషణలకు, అభివ్యక్తి ప్రయత్నాలకు అపూర్వ సృష్టి యత్నాలకు సంగమ తీర్థంగా ఉంటుంది. కవికి దర్శనం ప్రాతిపదిక. దాని కొక రూపాన్ని కల్పించేది ప్రయోగం. దానికొక చైతన్యాన్నిచ్చేది సిద్ధాంతం. దానినొక అనుభవంగా మార్చేది ఆ కావ్యంలో చిత్రించిన జీవితం. రాయప్రోలు వారిది మాధురీ దర్శనం. అమలిన శృంగారం వారి సిద్ధాంతం. ఆ సిద్ధాంతంలో ఆశించిన స్త్రీ యొక్క సప్తవిధ ధాతువులకు ఉదాహరణ ప్రాయాలుగా వెలువడినవే రాయప్రోలువారి కావ్యాలు. రాయప్రోలువారి ప్రయోగాల్లోని చైతన్యం అమలిన శృంగార రస సిద్ధాంతం. ఆ చైతన్యం ఒక్కొక్క కావ్యంలో ఒక్కొక్క భంగిమతో ప్రవర్తిల్లి పఠితలకు ఆ సిద్ధాంతంలోని ఒక పార్శ్వాన్ని అనుభవానికి అందిస్తుంది. ఈ సిద్ధాంత రూపకల్పన వెనుకనున్న మాధురీ దర్శనంలో ప్రతి ఫలించిన తాత్త్వికాంశాలను వివేచించడం ఈ సిద్ధాంత గ్రంథ ప్రధాన తాత్పర్యం. విషయసూచికను స్థూలంగా చూస్తేనే ఈ పరిశోధన స్వభావం స్పష్టంగా తెలుస్తుంది. విశ్లేషణలో తెలియవచ్చే స్పష్టత పరిశోధకురాలి అవగాహనలోనున్న విస్పష్టతను వ్యక్తం చేస్తుంది. మొదటి రెండు అధ్యాయాలు రాయప్రోలువారు ప్రయోగం చేసిన కాల్పనిక కవిత్వ యుగానికి పూర్వరంగంగా పని చేశాయి. భావ కవిత్వాన్ని గురించి వ్రాసిన మూడో అధ్యాయం ఆ యుగ ప్రయోగాల్లో రాయప్రోలువారి స్థానాన్ని నిర్ణయించింది.ఇంతవరకు ఎవరైనా కొంత ప్రయత్నంచేస్తే వ్రాయవచ్చు.

# ముందో మనవి

ఈ సిద్ధాంత వ్యాసంలో రాయప్రోలు వారి కావ్య పరిశీలనతోపాటుగా వారి తాత్త్విక దర్శనాన్ని వివేచించే ప్రయత్నం చేశాను. పరిశోధనా ప్రణాళికలో అనువాద రచనలను చేర్చలేదు. కాని ఇంగ్లీషు మూలాన్ని అనుసరించిన 'లలిత', 'అనుమతి' కావ్యాలకు ప్రణాళికాబద్ధమైన వీరి రచనలలో ప్రత్యేకస్థానం ఉండడం వల్ల వాటిని గ్రహించాను. వారి తత్త్వ ప్రతిపాదన దృష్ట్యా రూప నవనీత నాటకానికి విశిష్ట స్థానం ఉంది. ఇదీకాక కావ్య పరిశీలన అన్నప్పుడు దృశ్య, శ్రవ్య కావ్యాలు రెండూ చేరే అవకాశం ఉంది కనుక రూప నవనీతాన్ని కూడా ఇతర కావ్యాలతో సమంగా పరిశీలించడం జరిగింది.

సుబ్బారావుగారి కావ్యాలను పరిశీలించినపుడు కొత్తదనం, తెలుగుదనం ప్రస్ఫుటంగా కనిపించే లక్షణాలు. అందువల్ల 'కావ్య పరిశీలన' విభాగంలో ఆ రెండు లక్షణాలకు ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది.

ఉక్తి వైచిత్ర్యాన్ని గూర్చి చెప్పిన సందర్భంలో వ్యాస పఠనానికి అంతరాయం అన్న అనుమానం వల్ల విశిష్ట ప్రయోగాల ఉదాహరణలను కొన్నింటిని మాత్రమే చూపాను. లెక్కకు మిక్కిలిగాఉన్న ఆ ప్రయోగాలను ఒకటవ అనుబంధంలో చేర్చాను. ఈ విధంగా ఇది కావ్యపరిశీలనకు సంబంధించిన అనుబంధం కాగా రెండవ అనుబంధం వీరి తత్త్వ వివేచనకు సంబంధించింది.

రాయప్రోలు వారి తత్త్వ చింతనను గూర్చి కొందరు పెద్దలను కలుసుకుని ప్రశ్నించడం జరిగింది. వారి రచనా విధానాన్నిగూర్చి చాలా సాహిత్య వ్యాసాలు వెలువడ్డాయి కనుక పరిచితులను ప్రశ్నించేటప్పుడు ఎక్కువభాగం తాత్త్విక విషయాలకు ప్రాధాన్యం ఇవ్వబడ్డది. విషయం సమగ్రంగా ఉండడం కోసం వివిధ రంగాల వారిని ముఖాముఖి కలిసి అభిప్రాయాలు సేకరించాను. వీరిలో సన్నిహితంగా మెలగిన స్నేహితులు, సమీప బంధువులు, పరిచితులు, పండితులు, విమర్శకులు, తరువాత కాలపు కవులు, వీరి సాహిత్యంతో మాత్రమే పరిచయం ఉన్న వ్యక్తులు - ఇలా అన్ని రకాలవారిని ఈ పరిధిలో చేర్చడం జరిగింది. వీరి

ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు పర్యవేక్షకులుగా ఉండటం, వారు మా తెలుగు సాహితి ప్రథమాధ్యక్షులు కావడం సంతోషింప దగిన విషయం, రాయప్రోలువారి రచనలపై ఆసక్తికరమైన పరిశోధనను నిర్వహించిన డా॥ ఎం. లావణ్య సరస్వతిగారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. ఈ రచన భవిషత్తులో వారికి సాహిత్యరంగంలో మంచి గుర్తింపు ఇవ్వాలని ఇక ముందుకూడా పరిశోధన వ్యాసంగాన్ని వారు అభ్యుదయ పరంపరాభివృద్ధిగా కొనసాగించాలని ఆకాంక్షిస్తున్నాను. నిజానికి గ్రంథానికి ముందు మాటలు, అభిప్రాయాలు అవసరంలేదు. ఇవి అభిమానానికి అక్షరమైన గుర్తులు.

18-2-1988

జి. వి. సుబ్రహ్మణ్యం

# విషయ సంగ్రహం

## పూర్వ రంగం

1. **తెలుగు కవిత తత్త్వచింతన :**

**A. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో తత్త్వచింతన.**

ప్రాచీనాంధ్రకవిత్వంలో మతపరమైన తత్త్వచింతన ప్రతిబింబించిన విధానం - నన్నయ భారతాంధ్రీకరణ, వైదికమత పునరుద్ధరణ - వీర శైవ తత్త్వం - లింగధారణ - షట్‌స్థలజ్ఞానం - వీరశైవ సాహిత్యం - మతకల్లోలాలు - తిక్కన హరిహరనాథ తత్త్వప్రతిపాదన - వైష్ణవ సాహిత్యం - రాయల యుగంలో వైష్ణవ సాహిత్యపోషణ - తాళ్ళపాక కవుల సాహిత్యం-వేమన, పోతులూరి సాహిత్యాలలో తాత్త్విక దర్శనం- ముస్లిం ప్రభువుల తెలుగు సాహిత్య పోషణ - ఆంధ్ర సాహిత్యంలో క్రైస్తవమత తాత్త్విక దర్శనం - ప్రాచీనాంధ్ర కవిత్వంలో వైదిక సంస్కృతి సంప్రదాయాలు.

**B. ఆధునికాంధ్ర సాహిత్యంలో తత్త్వచింతన :**

తెలుగులో వెలువడిన బౌద్ధ సాహిత్యం - ఆంధ్ర సాహిత్యం, ఇస్లాం తత్త్వం - తెలుగు సాహిత్యంలో నాస్తిక భావాలు - సర్వమానవ సమానత్వం, ఆధునికుల దృష్టి - కుల, మత, వర్ణవ్యవస్థలు, ఆధునికుల దృక్పథం.

2. **ఆధునికాంధ్ర కవుల తత్త్వచింతనపై ప్రభావాలు :**

**A. 19వ శతాబ్దిలోని సామాజిక, సాంస్కృతిక పరిస్థితులు :**

ఇంగ్లీషు విద్యావిధానం ప్రవేశపెట్టడం - ఇంగ్లీషు ఉద్యోగులతో సాన్నిహిత్యం - అవ్యవహిత పూర్వకాలంలో తెలుగు సాహిత్యం - సాంఘిక, రాజకీయ, మత పరిస్థితుల వల్ల కలిగిన మార్పులు.

అభిప్రాయాలలో ఉపకరించిన భాగాలను ఉల్లేఖనాల రూపంలో వ్యాసంలో ఉపయోగించాను. వారి భావాల సారాంశాన్ని సంక్షిప్తంగా రెండవ అనుబంధంలో ఇచ్చాను

వ్యాస రచనలో వ్యావహారిక భాష ఉపయోగించాను. ఒకసారి ఉల్లేఖించిన పద్యం, లేక విషయం వాటి ప్రాధాన్యాన్నిబట్టి, పరిశీలించే దృష్టి వైవిధ్యాన్నిబట్టి కొన్నిచోట్ల తిరిగి, తిరిగి ఉల్లేఖింపక తప్పలేదు 'తరువాత కవులపై రాయప్రోలు వారి ప్రభావం' విస్తృతంగా చెప్ప దగ్గ విషయం - అయితే పరిశోధనా పరిధిని దృష్టిలో పెట్టుకుని సందర్భానికి తగిన విధంగా దానిని చాలా క్లుప్తంగా ముగించ వలసివచ్చింది.

అథస్సూచికలలో గ్రంథం లేక వ్యాసం పేరు, గ్రంథకర్త లేక వ్యాస రచయిత పేరు మాత్రమే ఇవ్వబడ్డాయి. రచయితల పేర్లకు ముందు వెనుకల డిగ్రీలు, బిరుదులు, గౌరవ వాచక పదాలు చేర్చలేదు.

సిద్ధాంత వ్యాసంలో ఉల్లేఖించిన ఆధునిక కవుల కావ్యాల పేర్లు మాత్రమే 'ఉపకరించిన గ్రంథాల' సూచికలో ఇవ్వడం జరిగింది. ఇతర కావ్యాల పేర్లు ఇవ్వలేదు. పరిశీలించిన సంస్కృత గ్రంథాలు అవి ప్రసిద్ధాలు కావటం వల్లా, అవి ఎన్నో వ్యాఖ్యానాలతో చాలామార్లు అనేకులచే ప్రచురింపబడడంవల్ల, కేవలం గ్రంథ నామం, గ్రంథకర్త పేరు మాత్రమే సూచికలో ఇచ్చాను.

దీనిలో పునఃపరిశీలనాయోగ్యాలైన విషయాలేమైనా నాదృష్టికి తెస్తే వాటిని మలి ముద్రణలో సవరించుకోగలనని సవినయంగా మనవి చేస్తున్నాను.

ఎంత పరిహరించాలని చూసినా, ఎంత శ్రద్ధగా పరిశీలించినా తప్పొప్పుల పట్టిక తప్పలేదు. 'అచ్చు తప్పులు అందగత్తె శరీరం మీది పుట్టుమచ్చలు' అని సరిపెట్టుకోవాల్సి వచ్చింది.

దీనిలో లోపాలను సహృదయంతో గ్రహించమని నా మనవి.

హైదరాబాదు
18-2-1988.

లావణ్య సరస్వతి

6. రచనా వైశిష్ట్యం-ఉక్తి వైచిత్ర్యం :

వస్తువు - కావ్యనామాలు- పాత్రల పేర్లు - విషాదారంభం - ధ్వన్యాత్మక పూర్వ కవి స్తుతి - పద్యపాద పునరుక్తి - భావాభివ్యక్తి - ప్రాచీన భావాలకు నవ్యతా స్ఫూర్తి - ఒక భావ వ్యక్తీకరణ పదబంధాలకు ఇతర భావాభి వ్యక్తితో ప్రయోగం - లింగసూచక శబ్ద ప్రయోగం - నవ్య భావనా రీతి - వాత్సల్యస్ఫోరక ప్రయోగాలు - ఉపమాన వైశిష్ట్యం - ఉపమాన ప్రాధాన్యం, ఉపమేయ లోపం - కావ్యభాష - విశిష్ట పద బంధాలు - వైదిక పదాలు - ఆనంద, అమృత శబ్ద వైశిష్ట్యం - ఛందో వైశిష్ట్యం - భజగోవింద శ్లోకపు ఒరవడి- వియోగినీ వృత్త ప్రయోగం- సంప్రదాయ ఛందోరీతులలో రాయప్రోలు వారు చూపిన ప్రత్యేకత - మాత్రాఛందస్సు.

7. తెలుగుదనం :

తెలుగు భాషాభిమానం - తెలుగుదేశ ప్రకృతి వర్ణన - గృహపరిసరాలు- గ్రామవాసుల ఆలోచనా విధానం- జీవనవిధానం - కట్టు, బొట్టు - ఆభర ణాలు - ఆటపాటలు - పండుగలు- సంక్రాంతి - తద్దెపండుగ వేడుకలు- వరలక్ష్మి, గౌరీ పూజలు - నోములు - ఆహారపు అలవాట్లు - తెలుగు రాష్ట్రాభిమానం - ఆంధ్రుల గతవైభవం - యశోగానం.

## తత్త్వవివేచన

. రాయప్రోలువారి తత్త్వచింతనపై ప్రభావాలు :

A. వైదిక వాఙ్మయ ప్రభావం :

వేదోపనిషత్ అభిమానం - పరబ్రహ్మతత్త్వం - ఆనందస్వరూపం - ఆనందప్రాధాన్యం - అగ్నిప్రాముఖ్యం - ఓంకారపావిత్ర్యం-జన్మకర్మ సంప్రదాయం - ధేనుదైవత్వం- శివశక్తుల సమ్మేళనం-స్త్రీపుంసయోగం.

B. ప్రాచీన కవుల ప్రభావం :

వాల్మీకి రామాయణాభిమానం - భవభూతి ఉత్తరరామచరిత - సుమానుష ప్రేమ - స్నేహప్రాముఖ్యం-సౌందర్యవర్ణన - కాళిదాసుపై అభిమానం - రఘువంశంలోని అజవిలాపఘట్ట ప్రభావం - అనుభూతి ప్రాధాన్యం - వర్ణనావిధానం-పద్యపు ఎత్తుగడ - వాగర్థప్రణయం - నన్నయ స్త్రీపుంస యోగదృష్టి - అక్షరరమ్యత.

C. వ్యక్తుల ప్రభావం :

I. పినతల్లి : ఆలోచనా విధానానికి ప్రేరణ - వస్తు నిర్ణయం - రచనల్లో పినతల్లి స్ఫూర్తి.

II. మేనమామ : పాండిత్య గురువు - ఆశుకవితాధారణకు ప్రోత్సాహం.

III. రవీంద్రుడు : రవీంద్రుని పట్ల ఆకర్షణ - భావసామ్యం - దేశభక్తి గేయాలకు ప్రోత్సాహం - రవీంద్ర గీతాల అనువాదం - గీతాంజలి ప్రభావం - రవీంద్రునిపై గౌరవాభిమానాలు.

IV. శ్రీ అరవిందులు : శ్రీ అరవిందుల సందర్శనం - మహాయోగిగా అరవిందులపై గౌరవం - భావసామ్యం - మాతృవాత్సల్య ప్రాధాన్యానికి ఆధ్యాత్మిక ఆధారం - మహాశక్తి స్వరూపం - దివ్యమాత ప్రాశస్త్యం - భరతమాతలో జగన్మాత.

V. ఇతర పరిచితులు : తిరుపతి వేంకటకవులు - అవధాన పద్యాలు - చెళ్ళపిళ్ళవారిపై గౌరవం - వారి ఆశీర్వాదం - చిలుకూరి వీరభద్రరావు - అత్తిలి సూర్యనారాయణ - గంటి లక్ష్మన్న పంతులు - కొమ్మరాజు లక్ష్మణరావు - శాంతినికేతనంలో మేధావుల సాన్నిహిత్యం - దుగ్గిరాల గోపాలకృష్ణయ్య - కట్టమంచి రామలింగారెడ్డి.

9. కర్మ-జన్మ సిద్ధాంతాలు

జన్మ భగవదనుగ్రహం - మానవ సంస్కృతి బహుజన పుణ్య ఫలం - పాప, పుణ్య విశ్వాసం - విధిబలీయం,- ఆత్మశాశ్వతం - పునర్జన్మ సమ్మతం- 'భావ స్థిరాణి జననాంతర సౌహృదాని'- వైదిక కర్మల ప్రస్తావన-అర్ఘ్యం- సంధ్యావందనం - ఆచమనం - నివాపోదకం-మంగళ స్నానం - దేవపూజ-ప్రాతః స్తోత్రం - పాద్యం - స్త్రీల వ్రతాలు-పేరంటాలు.

10. భగవత్తత్త్వం :

A. రాయప్రోలువారి దృష్టిలో అద్వైతం :

పరతత్త్వం అందనిది - ప్రకృతి సన్నిహిత లక్ష్యం- భవబంధ విముక్తి కంటె ప్రేమబంధం ప్రధానం-కవికి తాత్త్వికునికి కయ్యం - కళాసృష్టిలో ద్వైతం - పరతత్త్వ మీమాంస అప్రధానం - ప్రేమయోగదర్శనం ప్రధానం.

# ఏ విషయం ఏ పేజీలో

12. అమలిన శృంగార తత్త్వం :

A. వైష్ణవ సంప్రదాయంలో భక్తి :
భక్తిరస విభాగాలు - ముఖ్య భక్తి రసాలు - గౌణభక్తి రసాలు - ముఖ్య భక్తి రసాల అంతర్భాగాలు - మధుర భక్తి వైశిష్ట్యం - ఆండాళ్ - మీరాబాయి - అక్కమహాదేవిలోని మధుర భక్తి - వైష్ణవ భక్తి, అమలిన శృంగారాల సామ్యం.

B. ప్లేటో (Plato) ప్రతిపాదించిన ప్రేమతత్త్వం :
సిద్ధాంత ప్రతిపాదన - రాయప్రోలు, ప్లేటోల ఆలోచనా విధానంలో వైరుధ్యం-సిద్ధాంత ప్రయోజనాలలో భేదం-వివాహ వ్యవస్థ-పిల్లల పెంపకం-స్త్రీ గౌరవం-స్త్రీపురుషుల స్నేహం-సౌందర్యారాధన - ప్రేమభావనలలో భిన్నత్వం.

C. అమలిన శృంగార సిద్ధాంతం :

I. శృంగారశబ్ద విస్తృతి - శృంగారం, ప్రేమ సమానార్థకాలు - ప్రేమ యోగ దర్శనం - రతి స్వరూపం-స్నేహస్వభావం-వాత్సల్య మాధుర్యం-'అమలిన' విశేషణ సార్థక్యం.

II. రచనలలో వాత్సల్య చిత్రణ

III. స్నేహ చిత్రణ

VI. దాంపత్య చిత్రణ

V. స్వీకరించిన ఇతివృత్తాలలో ప్రేమ సమస్యలు

13. సింహావలోకనం :

# ప్రాచీనాంధ్ర సాహిత్యంలో తత్త్వచింతన

రమణీయమైన శైలి సౌందర్యాలతో పాటు తాత్త్విక పర్యవసానాన్ని కూడా కలిగివున్న కవిత్వం ఉన్నతస్థాయిని పొందే అవకాశం ఉంది. సమర్థవంతుడయిన కవి తన తాత్త్విక దృక్పథాన్ని కళాత్మకంగా తీర్చిదిద్దుతూ దానికి ప్రచారాన్ని తెస్తాడు. ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని పరిశీలిస్తే కొందరు కవులు తాము నమ్మిన తాత్త్విక సత్యాలను ఆలంబనం చేసుకుని కావ్యరచన చేసినట్లు తోస్తుంది. అయితే ప్రాచీనాంధ్ర సాహిత్యంలోని తత్త్వచింతన అధికభాగం మతపరంగానే కనిపిస్తుంది.

వివిధ మతాలు విశ్వశ్రేయస్సునే ఆకాంక్షించినా ఆ మతావలంబకులలోని విభిన్న దృక్పథాలు భిన్న మతస్థుల మధ్య అభిప్రాయభేదాలను కల్పించే అవకాశం ఉంది. కాలక్రమంగా మతస్థుల శ్రద్ధాసక్తులవల్ల కొన్ని మతాలు ప్రాభవాన్ని పొందడం, ప్రజల అలసత్వంవల్లకాని, ఇతర మతాల ప్రాబల్యంవల్ల కాని కొన్ని మతాలు కొంత ప్రాముఖ్యాన్ని కోల్పోవడం సహజం. అటువంటి సందర్భంలో క్షీణిస్తున్న మతం పట్ల అభిమానం కల కవులు ఆ మత పునరుద్ధరణను, మత ప్రచారాన్ని దృష్టిలో పెట్టుకుని సాహిత్య సృష్టి చేయడం కనబడుతుంది.

ఆదికవి నన్నయ భారతాంధ్రీకరణకు కూడా ఇటువంటి మత పరిస్థితులు ప్రేరణనిచ్చినట్లు తోస్తుంది. రాజరాజ నరేంద్రుని కాలంలో బౌద్ధ, జైన మతాలు ప్రాభవంలో ఉన్నట్లు తెలుస్తున్నది. అవైదికాలయిన బౌద్ధ జైన మతాలు వైదిక ధర్మాన్ని, కర్మాచరణను క్షీణింపజేసినట్లు కనబడుతుంది. ఈ మతాలు అధికంగా ప్రచారం పొందడంవల్ల ప్రజలలో సనాతన ధర్మం పట్ల ఆసక్తి, అభిమానం సన్నగిల్లి ఉండవచ్చు.

'పార్వతీపతి పదాబ్జ ధ్యాన పూజామహోత్సవ'డైన రాజరాజు వైదికాభిమానంతో విద్యాపీఠాలను నెలకొల్పి వేద విద్యలను పోషించినట్లుగా తెలుస్తున్నది. వైదిక మతానుయాయులయిన విప్రులకు అగ్రహారాదులు దానాలిచ్చి ఆదరించినట్లు

12 వ శతాబ్దిలో ఆంధ్రదేశంలో మతవిప్లవం చెలరేగింది. శైవం కర్మ ప్రధానమయిన వైదికాన్ని వెనుకకు నెట్టింది. శైవం చాలా ప్రాచీనకాలం నుంచీ ఉన్నట్లు భావింపబడుతోంది. దీనిలో పాశుపత సంప్రదాయం చాలా పురాతన మయింది. లాకులశైవం, కాపాలికా శాఖ, గోరక్షనాథ సంప్రదాయం కూడా పాశుపత సంప్రదాయంలోవిగానే చెప్పబడుతున్నాయి. ఇవికాక కాలాముఖ శైవ శాఖ కూడా చాలా కాలం నుంచీ ఉన్నట్లు తెలుస్తున్నది.[1]

ఇన్ని శాఖలు అతి ప్రాచీన కాలం నుంచీ ఉన్నప్పటికీ తీవ్రమైన మత కల్లోలాలకు అవి కారణం అయినట్లు కనబడదు. వీటిలో వీరశైవంలోని తీవ్రత ఉన్నట్లు తోచదు. బసవేశ్వరునిచే కర్ణాటకంలో ప్రచారానికి వచ్చిన వీరశైవం ఆంధ్రదేశంలో కూడా విశిష్ట స్థానాన్ని విశేష ప్రచారాన్ని పొందింది. 'గురు కరోదర జనితులయిన' ఈ వీరశైవుల తత్త్వం కొంత తీవ్రతరమైంది.[2] [illegible]

---

1. శ్రీ పండితారాధ్య చరిత్ర - పాల్కురికి సోమనాథ కవి ప్రణీతము పరిష్కర్త :- చిలుకూరి నారాయణరావు. P 274 to 277.

2. "గురుడు హస్తమస్తక సంయోగమున జిత్కళా న్యాసమొనరించి ఆణవ, కార్మిక, మాయామలములను వేధా మంత్ర క్రియాత్మక త్రివిధ దీక్షలచే దగ్ధ మొనర్చి భౌతిక శరీరమును లింగశరీరముగ జేసి ప్రసాదించిన ఇష్ట లింగమును స్థూల శరీరమున కంఠమునగాని శిరమునగాని భుజమునగాని వక్షమునగాని ధరించుచు సూక్ష్మ కారణ శరీరముల స్థితమగు ప్రాణ భావ లింగములతో దాని కవినాభావముగ సైక్యము సంధానము నొనరించు కొనుచు హస్తాంబుజ పీఠము నందుంచుకొని యనవరతము పూజించు చు ప్రణవ సహిత శైవ పంచాక్షరీ మంత్రమును [illegible] మంత్రములను మననము చేయుచుండుట, ఇష్టలింగార్పితము కాని వస్తువు లయిన కర్మములనెల్ల బరిహరించుట, శరీరము నుండి ఇష్టలింగము ప్రమాద పతితమయినను వెంటనే ప్రాణత్యాగ మొనరించుట, [illegible] మైనపుడు సాధకుని యిష్టలింగము నాతని హస్తాంబుజ పీఠమునందుంచియే [illegible] యచ్చించి యాతనితో ఖనన మొనరించుట వీరశైవ లక్షణము."
బసవ పురాణము - పాల్కురికి సోమనాథ ప్రణీతము :
శ్రీ బండారు తమ్మయ్యగారిచే పరిష్కృతము. P 8 ఉపోద్ఘాతము.

[illegible] అందువల్లనే ఆ మహారాజు వైదికాభిమానం ఇతర మతాల [illegible] కాదేమ. వైదికేతర మతాలు సహితం రాజాదరణ [illegible] చెప్పవచ్చు.

[illegible] ప్రచారంలో ఉన్న బౌద్ధ, జైన మతాలు అహింసా తత్త్వం [illegible] 'అహింసా పరమోధర్మః' అన్నటి వేదోపనిషత్ ప్రోక్తము [illegible] రాజ్యరక్షణకు అత్యంత ప్రధానమయిన పరాక్రమ [illegible] అపర్యం మీద విజయం సాధించి ధర్మప్రతిష్ఠ [illegible] చెప్పవచ్చు. 'క్షుద్రం హృదయ [illegible] ధర్మం. కనుక పౌరుష ప్రధానమూ, వైదిక ధర్మ [illegible] సమాజానికి అవసరం అని రాజరాజు [illegible].

"[illegible] ధర్మశాస్త్రం బని
అధ్యాత్మవిదులు వేదాంతమనియు
[illegible] శాస్త్రంబని...."

[illegible] మహాభారతం. దీనిలో వైదిక ధర్మనీతి తత్త్వాలు సామాన్యులకు [illegible] కథోపాఖ్యానాల ద్వారా చెప్పబడి ఉన్నాయి. అటువంటి గ్రంథం దేవభాష అయిన [illegible] తెలుగులోకి అనువదించడం వైదిక మతోద్ధరణకు సహాయపడగలదని రాజరాజు తలచి ఉండవచ్చు.

[illegible] నన్నయ 'అవిరళ జపహోమ తత్పరుడు, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు.' ఈయన వైదిక మతాభిమానంతో సనాతన ధర్మ పరిరక్షణను దృష్టిలో ఉంచుకొని పంచమవేదంగా ప్రసిద్ధి పొందిన మహాభారతాంధ్రీకరణకు పూనుకొని ఉంటాడు. సనాతన తత్త్వచింతన, వైదిక ధర్మం ప్రజా బాహుళ్యానికి తెలియజేయవలెననే కోరిక నన్నయ భారతాంధ్రీకరణకు దోహదం చేసి ఉండవచ్చు. తెలుగుజాతిలో క్షీణిస్తున్న ధర్మనిరతిని, వైదికాభిమానాన్ని మహాభారతం పునఃప్రతిష్ఠిస్తుందనే ఆశయం భారతాంధ్రీకరణలో కొంతవరకు ఉందని అనుకోవచ్చు.

ధారణ అత్యంత ప్రధానమైనది. వీరశైవులు వేదప్రమాణాన్ని అంగీకరించరు. చాతుర్వర్ణ్య వ్యవస్థను వీరు నిరసించారు. ఈ విధంగా వీరశైవం వైదిక ధర్మాలకు కొంతదూరం అయింది. వీరు మతతీవ్రతవల్ల కులవ్యవస్థను నిరసిస్తూనే వీరశైవులనే ఇంకొక కులాన్ని ఏర్పాటు చేసినవా రయ్యారు. తమ శాస్త్రదృక్పథానికి ప్రచారం ఇస్తూ విశేషంగా సాహిత్య సృష్టి చేశారు వీరశైవులు. సామాన్యులకు సహితం అవగాహన అయ్యేవిధంగా జానుతెనుగుభాషలో శివభక్తి ప్రాధాన్యాన్ని శైవమతప్రాశస్త్యాన్ని బోధించడమే వీరశైవకవుల సంకల్పం. మతప్రచారానికి వీలుగా, గానయోగ్యమయిన దేశి ఛందస్సును వీరు అధికంగా అభిమానించారు. అంతేకాక దేశీయులైన శివభక్తుల గాథలను కావ్యవస్తువులుగా స్వీకరించారు.[1] సాహిత్యాన్ని వీరశైవులు తమ సిద్ధాంత ప్రతిపాదనకు చక్కగా వినియోగించుకున్నారు. వీరి మతతత్త్వచింతనకు ప్రాధాన్యమిస్తూ వీరశైవ వాఙ్మయం విశేషంగా వెలువడింది.[2]

---

రూపిణి. అట్టి రూపముగల లింగమును తెలుసుకున్నవాడు ప్రాణలింగి. ప్రాణలింగ ధర్మము ననుష్ఠించడమే ప్రాణలింగస్థలము. అంగ, లింగ జ్ఞానము కలిగి తాను సతినని భావించి పతి అయిన శివుని ధ్యానించి, ఆ ధ్యాన సౌఖ్యములో ప్రవేశించినవాడు శరణుడు. శరణభావము కలిగి ఉండడము శరణస్థలము.... ప్రాణలింగాది యోగముచేత సుఖాతిశయమును ననుభవిస్తూ శరణుడు శివునితో ఐక్యమును కల్పించుకొనడము ఐక్య స్థలము."
పండితారాధ్య చరిత్ర - పాల్కురికి సోమనాథుడు.

పరిష్కర్త : చిలుకూరి నారాయణరావు. ఉపోద్ఘాతము P. 311, 312.

1. బెజ్జమహాదేవి కథ, కన్నప్ప, నిమ్మవ్వ, ముగ్ధశప్ప, గొడగూచి గాథలు, సూరసానమ్మ కథ, చిరుతొండనంబి కథ మొదలైనవి బసవ పురాణంలో వర్ణింపబడ్డాయి.

2. శివతత్త్వసారము, లింగోద్భవ గద్యము, రుద్రమహిమ, గుణ సహస్ర మాల, అమరేశ్వరాష్టకము, బసవ పురాణము, పండితారాధ్య చరిత్రము, అనుభవసారము, వృషాధిప శతకము, బసవోదాహరణము వంటి రచనలు వీరశైవ తత్త్వాన్ని విస్పష్టంగా ప్రదర్శిస్తాయి.

[illegible] వేద ప్రమాణాన్ని, వర్ణవ్యవస్థను వ్యతిరేకిస్తూ శివభక్తికే అధిక ప్రాధాన్యం ఇచ్చింది వీరశైవం. వీరి దృష్టిలో శివుడే పరదైవం. రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు అనే మువ్వురే జగత్కర్తలు. వీరశైవులకు జ్ఞానం అంటే పశు పాశపతి జ్ఞానం. జీవులు పశువులు, ప్రకృతి వికృతి సంబంధము పాశము, శివుడా రెంటింటికి పతి.

జీవులనేకులు పశువులు
భావింపగఁ బ్రకృతి వికృతి - బంధము పాశం
బా వృతము లయినం బశువుల
నీవారెంటికిని బతివి - నిరుపమ మహేశా![1]

వీరశైవులకు జంగముడు ఉత్తమోత్తముడు. లింగ శరీరమే జంగమ శరీరం. అతడు చర లింగం.

జంగమ లింగంబగు భ
క్తుంగని పూజింపడేని కోటివిధములన్
లింగార్చన చేసిన వృథ
జంగమ ముత్తమముగాగ స్థావరమునకున్.[2]

వీరికి షట్స్థల జ్ఞానం ముఖ్యమయింది.[3] వర్ణభేదం వీరికి లేదు. శివభక్తే ప్రధానం. అంత్యజులయినా శివభక్తులై వీరశైవదీక్షను గ్రహిస్తే వారు పూజార్హులే. లింగ

---

1. 24 శివతత్త్వసారము - మల్లికార్జున పండితుడు.
2. 153 శివతత్త్వసారము - మల్లికార్జున పండితుడు.
3. "భక్తుడు తానసుష్ఠింపవలసిన ధర్మములతో కూడి ఉండడము భక్త స్థలము. కేవల సహజ దాన నిష్ఠాపరుడై శివతత్పరుడై బ్రహ్మాది స్థాన విముఖుడై ఉండేవాడు మహేశ్వరుడనిపించుకుంటాడు. భక్తి వైరాగ్యము లెక్కువ అయి స్థిరవివేకము కలవాడే మహేశ్వరుడు. అట్టి మహేశ్వర ధర్మమును పరిపాలించడమే మాహేశ్వర స్థలము. లింగనిష్ఠాది భావముతో పాపబంధములను ధ్వంసము చేసి మనఃప్రసాదము కలిగిఉండడమే ప్రసాదస్థలము. లింగము చిదాత్మకమైన బ్రహ్మము. దాని శక్తి ప్రాణ

సమాజంలోని మతస్వరూపం ఇంత తీవ్రంగా ఉండి సాహిత్యంలో సహితం ఆ తీవ్రద్వేషాలు ప్రతిఫలిస్తున్న తరుణంలో తిక్కన సాహిత్యసీమలో ప్రవేశించాడు. ధార్మికనిష్ఠను పెంచి మత విషయంలో ఉదారతను తేవడానికి ప్రయత్నించాడు. తిక్కన 'మహేశ్వరాంఘ్రికమల ధ్యానైక శీలుడ' నని స్వయంగా చెప్పుకున్నాడు. కేతన తిక్కనను గూర్చి 'హరిచరణ కమలోపాస్తి కృత స్వస్తి' అన్నాడు. దీనినిబట్టి తిక్కన హరిని హరుని ఆరాధించినట్లు తోస్తుంది. 'పరతత్త్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్' అంటూ పరతత్త్వాన్ని కొలిచే తిక్కనకు హరి అయినా హరుడయినా ఒకటే కావడంలో ఆశ్చర్యంలేదు. దీనిని బట్టి తిక్కన హరి, హర భేదాన్ని పాటించని అద్వైతిగా తోస్తుంది. భారత రచనా కాలానికి హరిహరనాథోపాసన గావించి-

> "కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా పరిష్క్రియాయాం
> బహు మన్యసే త్వమ్
> కిం కాలకూటః కిమువా యశోదాస్తన్యం తవస్వాదు
> వద ప్రభోమే."

అని ప్రశ్నించాడు. హరిహరనాథుడు తిక్కన భావనారాధ్యుడు అనే విషయం మీద భిన్నాభిప్రాయాలున్నాయి. హరిహరనాథ తత్త్వాన్ని నూతనంగా స్థాపించినా లేక పునఃప్రతిష్ఠచేసినా ఆ సమయానికి సమాజంలోని మత కల్లోలాలను దృష్టిలో ఉంచుకుని హరిహరనాథ స్వరూపానికి ప్రాధాన్యాన్నిచ్చి సంకీర్తనం చేసినవాడు తిక్కన. శివకేశవాభేదాన్ని స్పష్టం చేయడానికి తన భారతభాగాన్ని తాను నమ్మిన హరిహరనాథునికి అంకితం చేశాడు. అంతేకాక తరువాత కవులకు ఈ తత్త్వంలో మార్గదర్శకుడయ్యాడు.[1] తరువాత కాలంలో వైష్ణవం కొంతవరకు అధికప్రచారాన్ని పొందింది. శైవమత సాహిత్యం కూడా వెలువడుతున్నప్పటికి వైష్ణవ సాహిత్యం ఎక్కువ కనబడుతుంది. దీనికి ఆనాటి ప్రభువులు సహితం వైష్ణవాభిమానులు కావడం కొంతవరకు దోహదంచేసి ఉండవచ్చు. విజయనగర సాళువ, తుళువ వంశపు రాజులూ, నాదెళ్ళవారు, నంద్యాలవారు, రాయసంవారు,

---

1. నాచన సోముడు, జక్కన, దూబగుంట నారాయణకవి కూడా హరిహర నాథుని స్తుతించారు.

దాదాపు ఇదే కాలంలో రామానుజ స్థాపితమై విశిష్టాద్వైత వైష్ణవం కూడా ఆళ్వారులవల్ల అధిక ప్రచారం పొందింది. ఇది కూడా భక్తిప్రధానమై వర్ణ వ్యవస్థను వ్యతిరేకించేదే. జ్ఞానం కంటె భక్తి ముఖ్యమని, వర్ణవిభేదాలవల్ల ప్రయోజనం లేదనే విషయాలలో వీరశైవ వైష్ణవాలకు భేదం లేదు. కాని ఈ మతాలలోని ఉపాస్యదైవం విషయంలో, వేదప్రామాణ్యం విషయంలో వీరశైవ వైష్ణవ మతాల మధ్య అభిప్రాయ భేదాలు తలెత్తాయి. తాత్త్విక విషయాలలోని భేదం కంటె సాంఘిక విభేదాలు ఆధిక్యం వహించాయి. రెండు మతాలు భారతీయ మైనవే అయినా పై భేదాలు కాలక్రమంగా వీరిమధ్య ద్వేషవైషమ్యాలను పెంచాయి.

'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అన్న సత్యం వీరి స్పర్ధలలో మరుగున పడింది. విశ్వశ్రేయస్సు నాకాంక్షించే సాహిత్యంలో 'శివాయ విష్ణు రూపాయ శివరూపాయ విష్ణవే' అనే మతతత్త్వం ప్రతిఫలించడానికి బదులుగా నాని దూషణ, తిరస్కారాలు చోటు చేసుకున్నాయి.[1]

---

1. "భవి కృతారంభ సంభవ ధ్యాన నిచయ
భవి నిరీక్షణ రసపాక వితాన
భవి హస్తగత ఫల పత్రశాకాది
భవి గృహ క్షేత్రాంఘ్రి పథన వర్జితుడ
భవి జనదర్శన స్పర్శ నాలాప
వివిధ దానాదాన విషయ దూరగుడ"
(పాల్కురికి సోమనాథుడు-పండితారాధ్య చరిత్ర.దీక్షా ప్రకరణము P.15)
"శివభక్తుల యెడ భయమును
శివునెడ నతివీరగుణము శీలంబుల యం
దవి కల్పంబగు చలమును
భవి యెడ రోతయును వలయు భక్తుల కెందున్."
(పాల్కురికి సోమనాథుడు. అనుభవసారము)
ఈ భేదం భార్యాభర్తల్లో కూడా చోటు చేసుకుంది. భార్య శివభక్తురాలై భర్త శివభక్తుడు కానిచో భార్య భర్తను-నిరసించవచ్చునంటాడు పండితా రాధ్యుడు.
"పురుషుడు శివభక్తి విరహితుడేని
బురుషుని వీడుట తరుణికిఁ బథము" (శివతత్త్వసారము. P.231-234)

కొంత భిన్నమయింది. ఏ కులంవారయినా శైవభక్తి కలిగిఉంటే చాలునని శైవులు, విష్ణుభక్తులయితే చాలునని వైష్ణవులు ప్రచారం చేశారు. వారి దష్టి ప్రధానంగా భగవద్భక్తికి సంబంధించినది. కాని వేమన, పోతులూరి భక్తిపరంగా మోక్షసాధన దృష్టితోకాక సామాజిక అసమానతను దృష్టిలో పెట్టుకుని వర్ణ వ్యవస్థను ఖండించారు. కులవ్యవస్థ మానవులలో అంతరాలను కలిగించకూడదని నమ్మారు. కుల ప్రాతిపదికపై సమాజంలోని కొందరు వ్యక్తులు అధికులుగా కొందరు అధములుగా భావింపబడకూడదని వేమన, పోతులూరి వారి తత్త్వం. వేమన అస్పృశ్యతను సహితం ఎదిరించాడు.

కులము చేతబట్టి గుంపించనేటికి
పాదు ఉన్నచోట ప్రజలు విత్తు
ఏటి కులంబింక ఎక్కడి ద్విజుడయా.........
కులములన్ని ఒక్క కులముగా తెలియుడీ.........
మాలవాని నేల మరిమరి నిందింప
ఒడలనున్న మాంసమొకటి గాదె[1]

గుణంవల్ల అగ్రజాతిగాని జన్మవల్ల కాదని వీరు ప్రచారం చేశారు. వేదాది విద్యల అందరూ అర్హులేనని వీరబ్రహ్మం భావించాడు. తన ఆశ్రమంలో శైవవైష్ణవ మతాభేదాలను హిందూ మహమ్మదీయ మతభేదాలను పాటించలేదు.[2] వేమన అన్ని వైదిక కర్మలను, నమ్మకాలను సహితం వ్యతిరేకించాడు. మరణించిన వారికి పిండాలు పెట్టడం, తిథి, వార, నక్షత్ర ముహూర్తాల మీద నమ్మకం వంటి వాటిని నిరసించాడు. వీరిద్దరూ తాము నమ్మిన ఈ సత్యాలను తమ సాహిత్యం ద్వారా ప్రచారానికి తెచ్చారు.[3]

---

1. 'ప్రజాకవి వేమన' N. గోపి. P 186, 254లో ఉల్లేఖింపబడినవి.
2. దూదేకుల సిద్దయ్య వీరబ్రహ్మం ప్రియశిష్యుడు కావడం దీనికి చక్కని నిదర్శనం.
3. "అట్టి సన్నివేశములలో అనగా తురక, క్రైస్తవుల విజృంభణ కాలములో ఆంధ్రదేశమును రక్షించినది రాజులు కారు. తత్త్వబోధకులే రక్షించిన వారు. దేశమంతటా వేదాంతులు బయలుదేరి గేయాలతో మతావేశమును కలిగించుచు సంఘలోపాలను సంస్కరించుచు వచ్చిరి. అట్టివారిలో ముఖ్యులు వేమన యోగి, పోతులూరి వీరబ్రహ్మం గారు."
ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి. P 391.

అరవీటివారు, సిద్ధిరాజువారు మొదలైన సామంత కుటుంబాలవారు వైష్ణవాన్ని అభిమానించినట్లు కనబడుతుంది.

శ్రీకృష్ణదేవరాయలు రచించినదిగా ప్రసిద్ధికెక్కిన ఆముక్తమాల్యద విష్ణు పారమ్యానికి ప్రాధాన్యం ఇచ్చింది. వైష్ణవమత ప్రచారాభిమానంతో ప్రసక్తాను ప్రసక్తంగా వర్ణించిన ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము, యామునాచార్య చరిత్ర, మాలదాసరి కథవంటి వైష్ణవభక్తుల గాథలు విష్ణుమహత్వాన్ని ప్రదర్శిస్తాయి.

వీరశైవకవుల వలెనే సాహిత్యాన్ని మతప్రచారానికి చక్కని సాధనంగా వినియోగించుకున్నవారు తాళ్ళపాక కవులు. అన్నమాచార్యుని రామాయణము, పెదతిరుమలాచార్యుని హరివంశము, చిన్నన్న ఉషాపరిణయము, అష్టమహిషీ కళ్యాణము, పరమయోగి విలాసము మొదలైన రచనలు విష్ణుసంబంధి గాథలను వర్ణిస్తూ వైష్ణవ దివ్య తత్త్వ ప్రచారదృష్టి కనబరుస్తాయి.[1] మతాన్ని భక్తిని దృష్టిలో పెట్టుకుని ప్రచారానికి అనువుగా వివిధసాహితీ ప్రక్రియలను ఆధారం చేసుకుని వైష్ణవ సాహిత్యాన్ని వెలయించారు తాళ్ళపాక కవులు.

ఆ తరువాతి కాలంలోని వేమన, పోతులూరి వీరబ్రహ్మం వర్ణవ్యతిరేక భావాలకు సాహిత్యంలో స్థానం కలిగించారు. వీరశైవ వైష్ణవాలు సహితం వర్ణ వ్యవస్థను వ్యతిరేకించాయి. కాని వేమన, పోతులూరి వారి వర్ణవ్యతిరేకత దీనికి

---

1. "శైవవైష్ణవ కవులిరువురి కవితకు భక్తియే జీవము. ఆవేశ మిరువురకును సమానము. భక్త్యావేశము తరువాత వీరశైవకవుల రచనలలో కవిత్వ కళ యుండియు పాండిత్యగౌరవమే అధికముగా గానసగును. కాని తాళ్ళ పాక కవుల రచనలలో భక్త్యావేశముతోబాటు కవిత్వకళయు, పాండిత్య గౌరవము రెండును సమానస్థాయిలో గోచరించును. వీరశైవకవీశ్వరులు తొల్దొల్త మతప్రచారకులుగను పిదప పండితులుగను ఆ పిదప కవులు గను సాక్షాత్కరింతురు. వైష్ణవ తాళ్ళపాక కవీశ్వరులట్లుగాక ఒక యాకళింపుననే మతప్రచారకులుగాను కవులుగాను పండితులుగాను దర్శనమిత్తురు." తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రకియలు. వేటూరి ఆనందమూర్తి. p. 129-130.

క్రీస్తుకు ప్రాధాన్యం ఇస్తూ తోభ్యచరిత్ర (సర్వేశ్వర మహాత్మ్యం) వేదాంత రసాయనం ప్రబంధ ఫక్కీలో రచించారు.[1] సువార్తలు, బైబిలువంటి రచనల అనువాదాలు, క్రైస్తవ కీర్తనలు తెలుగు సాహిత్యంలో ప్రవేశించాయి. క్రైస్తవ మతంలోని ఉదాత్త ఆశయాలవల్ల ప్రభావితులయిన ఆంధ్రులు క్రైస్తవులయినా కాకున్నా క్రైస్తవ ఇతివృత్తాంతో రచనలు చేశారు.[2] ఈ విధంగా క్రైస్తవమత తత్త్వం తెలుగు సాహిత్యంలో ప్రవేశించింది.

బౌద్ధ, జైన మతాలు అతిప్రాచీనాలు. అవి కొంతకాలం అధిక ప్రాభవంలో కూడా వున్నాయి. అయినా ఆ మతపరమయిన తెలుగు సాహిత్యం ప్రాచీన కాలంలో వెలువడినట్లు కనబడదు. 'కవిజనాశ్రయ' కర్త రేచన జైనుడనే అభిప్రాయం ఒకటి ఉన్నప్పటికీ జైన మత తత్త్వరచన చేసినట్లు తెలియడం లేదు. బౌద్ధ మతం మధ్యకాలంలో క్షీణించినా పూర్తి మరుగున పడిపోలేదు. అంతే కాక బుద్ధుడిని శ్రీమహావిష్ణువు అవతారంగా గ్రహించి పూజించడం కాకతీయుల

---

1. "ఆనంద కవి కృష్ణాజిల్లాకు చెందినవాడు. 1750 నాటికే మధుర నుండీ వచ్చిన జెసూటు మిషనువారు ఇచ్చట ప్రచారము చేయుచు నుండిరనుటకు ఆధారములు గలవు. పింగళి ఎల్లనార్యుడు కూడా కృష్ణాజిల్లాకు చెందిన వాడే. వీరిరువురిపైని వీరి కృతులకు భర్తలయిన వారిపైని క్రైస్తవమత ప్రభావము పడుటకు ముఖ్యావకాశము ఆ కాలములో జెసూటు మిషనరీలు ప్రాంతమున కృషిచేయుటచే కలిగినదనవచ్చును".
"తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావం."
కొత్తపల్లి వీరభద్రరావు P. 97.

2. పురుషోత్తమ చౌదరి, పులిపాక జగన్నాథము, కందుకూరి వీరేశలింగం పంతులు, మంత్రిప్రెగడ భుజంగరావు మొదలైన వారు కొందరు అటు వంటి రచనలు చేశారు.

దాదాపు ఇదే కాలంలో ఆంధ్రులకు సన్నిహితంగా వచ్చిన మతాలు మహమ్మదీయ మతం, క్రైస్తవ మతం. మహమ్మదీయులు అంతకు పూర్వం చాలాకాలం క్రితం నుంచి భారతదేశంలో కొంత భాగాన్ని పరిపాలిస్తూ వచ్చారు. క్రమంగా ఆంధ్రదేశంలో కొంత భాగం సహితం కొంత కాలం మహమ్మదీయుల పాలనలోకి వచ్చింది. కొందరు మహమ్మదీయ పాలకులు కూడా ఆంధ్రభాషాభిమానంతో, సాహిత్యాభిలాషతో తెలుగు కవులను పోషించి, ఆంధ్ర సాహిత్య సేవ చేశారు. గోల్కొండ పాలకుల పోషణలో తెలుగు కవులు కొందరు తమ కావ్యాలను కొన్నింటిని మహమ్మదీయులకు అంకితం కూడా చేశారు. హిందువులకు ఉన్నత పదవులను ఇచ్చి ఆదరించారు గోల్కొండ నవాబులు.[1] అయితే మహమ్మదీయుల పాలనా, వారి భాషతో సాన్నిహిత్యం ఆనాటి తెలుగు సాహిత్యం మీద కొంత భాషాపరమైన ప్రభావాన్ని మాత్రం చూపాయి. కాని మహమ్మదీయ మత తాత్త్వికచింతనకుగాని, వారి మతపరమైన విషయాలకుగాని ప్రాధాన్యం ఇచ్చే తెలుగు సాహిత్యం ఆ కాలంలో వెలువడినట్టు కనబడదు. కనుక మహమ్మదీయ ప్రభువుల ఆదరణలో తెలుగు కవిత్వం వెలువడినా వారి తాత్త్వికచింతనా ప్రభావం సాహిత్యం మీద పడలేదనవచ్చు.

కాని క్రైస్తవ మత ప్రభావం దీనికి కొంత భిన్నంగా ఉంది. క్రైస్తవ మతం తెలుగుదేశంలో అంతగా ప్రచారం పొందక పూర్వమే క్రైస్తవ సాహిత్యం తెలుగులో ప్రారంభం అయింది. క్రైస్తవమత ప్రచార దృష్టి దీనికి కొంత ప్రోత్సాహం ఇచ్చి ఉండవచ్చు. పింగళి ఎల్లనార్యుడు, మంగళగిరి ఆనందకవి,

---

1. భక్తి సాహిత్యంలో ప్రముఖ స్థానాన్ని పొందిన 'రామదాసు కీర్తనల' కర్త కంచర్ల గోపన్న నవాబుల కొలువులోని వానిగా ప్రసిద్ధి. అద్దంకి గంగాధరకవి ఇబ్రహీం కుతుబ్‌షా ఆస్థానంలో ఉండి తన 'తపతీ సంవరణ' కావ్యాన్ని ఆ ప్రభువుకు అంకితం ఇచ్చాడు. కందుకూరి రుద్రకవి కూడా అతని ఆస్థానంలోని వాడేనని తెలుస్తున్నది. పొన్నిగంటి తెలగనార్యుడు ఇబ్రహీం కుతుబ్‌షా సేనాధీశ్వరుడైన అమీన్‌ఖాన్‌కు "యయాతి చరిత్ర"నంకితం చేశాడు. సారంగు తమ్మయ్య కూడా ఆ కాలం నాటి కవే.

# ఆధునికాంధ్ర సాహిత్యంలో తత్త్వచింతన

క్రమపరిణామంగా ఆధునిక సాహిత్య తత్త్వచింతనలో కొంత మార్పు వచ్చింది. కవులు వ్యక్తిగత భావాలకు ప్రాధాన్యం ఇస్తూ ఆత్మాశ్రయ సాహిత్య సృష్టి చేయడంవల్ల వస్తువులో తత్త్వంలో వైవిధ్యం ఏర్పడింది. నవ్యకవిత్వం వివిధ తత్త్వాలను వెలువరించింది. కవుల మానసిక ప్రవృత్తిలో వచ్చిన చైతన్యం సాహిత్యంలో రూపుదిద్దుకుంది.

బౌద్ధమతానికి సంబంధించిన సాహిత్యం 20 వ శతాబ్ది ప్రారంభంలో అధికంగా కనబడుతుంది. జాతీయోద్యమం బలపడడం అహింసా సిద్ధాంతానికి ప్రచారం రావడం కొంతవరకు కారణం కాగా బుద్ధుని గూర్చిన సాహిత్యం ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో అధికంగా వచ్చి ఉంటుందని అనుకోవచ్చు. అహింసావాది అయిన గాంధీజీ సిద్ధాంతాలు దేశంలో విశేష ప్రచారం పొందసాగాయి. బౌద్ధంలో ప్రధానమైన కరుణకు ఆ సమయంలో ప్రచారం వచ్చింది. గాంధీజీ సిద్ధాంతాలకూ గౌతమబుద్ధుని సిద్ధాంతాలకూ గల సాదృశ్యం ప్రజల దృష్టి బౌద్ధ సాహిత్యం వైపు ప్రసరించడానికి దోహదం చేసి ఉండవచ్చు.

ఇంగ్లీషు భాషలోని లైట్ ఆఫ్ ఏషియా (Light of Asia) ఆధారంగా 9 వ శతాబ్ది చివరి భాగంలో తిరుపతి వేంకటకవులు 'బుద్ధచరిత్రము' వ్రాశారు. వారి 'శ్రవణానందము', కూడా బౌద్ధమత సంబంధి రచనే. పింగళి కాటూరి కవుల సౌందరనందము' జంధ్యాల పాపయ్యశాస్త్రి 'కరుణశ్రీ', సన్నిధానం సూర్య రాయణశాస్త్రి 'జాతక కథాగుచ్ఛము' వంటివి కూడా బౌద్ధమత సంబంధమైన ఆంధ్ర సాహిత్యంలో ప్రసిద్ధి పొందాయి.

20 వ. శతాబ్దిలో, మొట్టమొదటి సారిగా మహమ్మదీయ మతతత్త్వానికి ప్రాధాన్యం ఇస్తూ ఉమర్ అలీషా, మహమ్మద్ కాశింఖాన్ కొన్ని రచనలు చేశారు.

కాలానికే కనిపిస్తుంది.[1] అయినా ఆ కాలంలో సహితం బుద్ధుని గూర్చిన సాహిత్యం తెలుగులో వెలువడినట్లు కనబడదు. విష్ణువుకు అధిక ప్రచారాన్నిచ్చిన వైష్ణవ సాహిత్యంలో కూడా బుద్ధునికి ప్రాధాన్యాన్నిచ్చినట్లు గాని బౌద్ధ మత ప్రసక్తిగాని ఉన్నట్లు తోచదు.

ఏదయినా ఈ విధంగా ఉన్న ప్రాచీన ఆంధ్ర సాహిత్యం అధికభాగం వైదిక మత తత్త్వానికి సంబంధించినదని చెప్పవచ్చు. అది ఎక్కువగా పరబ్రహ్మ తత్త్వాన్ని, పారలౌకిక సత్యాలను అన్వేషిస్తూ, ఆలంబనం చేసుకుంటూ సాగింది. ఆ సాహిత్యంలో చతుర్విధ పురుషార్థాలలోని ధర్మమోక్షాలకు అధిక ప్రాధాన్యం లభించిందని చెప్పుకోవచ్చు. శ్రుతి స్మృతి పురాణేతిహాసాలలోని ధర్మబోధను నైతికవిలువలను అధికంగా ఆదరించి ప్రచారానికి తేవడానికి ప్రయత్నించింది. కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలను, సనాతన వైదిక సంప్రదాయాలను, భక్తి తత్త్వాన్ని ఆలంబనం చేసుకున్నది. షోడశ కర్మల వంటి వైదిక సంస్కారాలను, అర్ఘ్య పాద్యాది సత్కారాలవంటి సంప్రదాయాలను ప్రాచీనాంధ్ర సాహిత్యం ప్రతిబింబింపజేసింది. ఆ సాహిత్యంలో ఏదో ఒక దైవానికి ప్రాధాన్యమే గాని నాస్తికభావ ప్రాధాన్యం దాదాపుగా లేదనే చెప్పవచ్చు.

---

1. "కాకతీయుల యుగమునందు ఆంధ్రదేశమున....బౌద్ధ మత స్థాపకుడగు గౌతమబుద్ధుని శ్రీమహావిష్ణుని దశావతారముగా నంగీకరించి పూజించుట ప్రారంభించుటవలనను క్రమక్రమముగ బౌద్ధులు ప్రాచీనమగు హీనయాన బౌద్ధమును విస్మరించి మూర్తి పూజాదికములగు నాచారములతో నిండిన మహాయానము నవలంబించుటచేతను బుద్ధ ధర్మము క్రమముగ హిందూ ధర్మములో లీనమయ్యెను." 'ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి'. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరం. P 228.

ధర్మాన్ని అధికంగా ఆదరించారు నవ్యకవులు. 'మానవ సేవే మాధవ సేవ' వంటి సూక్తులు ప్రాచీనమయినవే అయినా ఆ మానవత్వానికే ప్రాధాన్యం ఇచ్చిన సాహిత్యం ఆనాడు ప్రసిద్ధంగా వెలువడలేదు. మాధవుని భక్తితో కొలిచి సాధించే ముక్తికంటె తోటి మానవుని సాంఘిక అసమానతా బంధవిముక్తి ప్రధానం అని భావించిన సాహిత్యం ఆధునిక కాలంలో కొంత అధికంగా వెలువడుతుంది.

బ్రహ్మసమాజం వంటి ఉద్యమాలు ఏకేశ్వరోపాసనకు ప్రచారం తెచ్చాయి. ఇతర మతస్థులతో సాన్నిహిత్యం వల్ల వివిధ ఆ మతసిద్ధాంతాలతో పరిచయం ఏర్పడింది. దీనివల్ల ఇతరమతాల మంచిచెడుల అవగాహనకు అవకాశం కలిగింది. భగవంతుడు ఒక్కడే అనే భావన ప్రాచీనమయినదే అయినా అది కొంత విస్తృతి పొంది అన్ని మతాల దైవం ఒక్కడే అనే భావప్రచారానికి కృషి సాగింది. ఏ మతం అయినా ఏ పేరుతో కొలిచినా దేవుడొక్కడే అనే అభిప్రాయం స్థిరపడాలని కవులు బోధించడం కనబడుతుంది. వ్యక్తిగతంగా ఏ దేవుని నమ్మినా, ఏ దేవుడిని కొలిచినా ఇతర మతస్థులను, వారి దేవతలను నిందించడం కొంత తగ్గి, మతపరమైన ఉదారతను ఆధునికులు కనబరచసాగారు.

ఆధునిక జీవనవిధానంతో ప్రాచీన వైదికకర్మాచరణ విధానం కొంత మారింది. నిత్యాగ్నిహోత్రాలవంటి వైదిక కర్మ నిష్ఠ కొంత సన్నగిలసాగింది. 'పూర్వ సంప్రదాయాల మీద, ఆచారాలమీద ప్రత్యయము చాలా సళ్ళినది.

వద్దాది సుబ్బారాయుడు - భక్త చింతామణి.

దాసు శ్రీరామకవి - దేవీభాగవతము.

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి - శివపురాణము.

పిసుపాటి చిదంబరశాస్త్రి - పద్మపురాణము.

విశ్వనాథ సత్యనారాయణ - రామాయణ కల్పవృక్షము-వంటివి ప్రాచీన మార్గంలోని కొన్ని రచనలు.

ఉమర్ అలీషా సూఫీ వేదాంతదర్శనము, ఇలాజుల్ గుల్బా మునద్దాన్ అలీ వంటి రచనలలో ఇస్లాం తత్త్వం ప్రధానం. మహమ్మద్ కాశింఖాన్ ఖురాన్‌కు తెలుగు అనువాదాన్ని వ్రాశారు. ఇస్లాం తత్త్వాన్ని ప్రతిపాదించే మొట్టమొదటి తెలుగు సాహిత్యంగా ఈ రచనలను పేర్కొనవచ్చు.

ఆధునిక కాలంలో సాహిత్యంలో గోపరాజు రామచంద్రరావు, త్రిపురనేని రామస్వామిచౌదరి, లవణం వంటివారి రచనలలో కొంత నాస్తికత ఉంది. నాస్తిక భావాలుగల వ్యక్తులు ఏ కాలంలో అయినా ఉండవచ్చు, కాని నాస్తిక భావాలను లంబనం చేసుకున్న సాహిత్యం ఆధునిక కాలంలోనే వెలువడినట్లు చెప్పుకోవచ్చు. స్తిక భావప్రధానంగా సాహిత్య సృష్టి ప్రాచీన సాహిత్యంలో ప్రత్యేకంగా నబడదు. ఆధునిక యుగం స్వేచ్ఛ దీనికి కొంత దోహదం చేసి ఉంటుందని హించవచ్చు.

ఆధునిక సాహిత్యంలోని ప్రధాన తత్త్వం సమానత్వం. పారలౌకిక ధ్యాత్మిక చింతనలకంటె లౌకిక జీవిత సత్యాలకు ఈ సాహిత్యం ప్రాధాన్యా చ్చింది. అగోచరమయిన పరబ్రహ్మతత్త్వం, మరణానంతరం జీవుని స్థితి, ర్గనరకాలు, మోక్షమార్గం వంటి చర్చలు, మీమాంసల కంటె, మానవుడు తన తంలో అనునిత్యం ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కార మార్గాన్వేషణ ఖ్యమని ఆధునికులు భావించినట్లు కనబడుతుంది. ప్రాచీన సంప్రదాయ ర్గంలో భారత, భాగవత, రామాయణాలవంటి రచనలు సహితం వెలువడు న్నప్పటికీ అధిక భాగం సమాజంలోని మానవ జీవన తత్త్వాన్ని అన్వేషిస్తూ ంది.[1] సామాన్య సంఘటనలతో, సర్వసాధారణ వస్తువుతో మానవతా

---

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి - శ్రీకృష్ణభాగవతము, భాగవతము, రామాయణము.

వావిలికొలను సుబ్బారావు - ఆంధ్రవాల్మీకి రామాయణం.

జనమంచి శేషాద్రిశర్మ-రామాయణము, బ్రహ్మాండపురాణము, లపితో పాఖ్యానము, తాండవకృష్ణ భాగవతము.

# ఆధునికాంధ్రకవుల

# తత్త్వచింతనపై ప్రభావాలు

అభిప్రాయ స్వాతంత్ర్యము ఎక్కువైనది. అపనమ్మకము ప్రబలినది."[1] వర్ణ వ్యవస్థ వృత్తి ప్రాధాన్యాన్నిబట్టి ఏర్పడిందనే భావం అధికప్రచారానికి వచ్చింది. కొందరు కవులు జాతి, మత వర్ణ భేదాలు సమాజ పురోగమనానికి అవరోధం అని సూచిస్తూ మానవులంతా ఒక్కటే అనే భావప్రచారానికి కృషి చేయసాగారు. పారిశ్రామిక విప్లవ ప్రభావం వల్ల మానవుని మేధాశక్తిమీద; శక్తి సామర్థ్యాల మీద విశ్వాసం పెరిగింది. ప్రతి చిన్న విషయానికి భగవంతుడే కారణమనే తత్త్వం కొంత తగ్గసాగింది. విమర్శనాత్మక పరిశీలన, హేతువాదదృష్టి ఈ భావనకు ప్రోత్సాహాన్నిచ్చి ఉంటాయి.

ఈ విధమైన భావవిస్తృతి సామాజిక తత్త్వదర్శనం ఆధునికాంధ్ర సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. ఈ పై విధ్యానికి దోహదం చేసినవి 19వ శతాబ్దిలోని పరిస్థితులు. ఆ పరిస్థితుల ప్రభావం ఆధునిక కవుల తత్త్వచింతనపై వచి విస్తృత పరిధిలో నవ్యకవిత్వం వెలువడింది. నవ్యకవిత్వతత్త్వం మీద అధిక ప్రభావాన్ని చూపిన 19వ శతాబ్దిలోని సాంఘిక, రాజకీయ, మత, సాహిత్య పరిస్థితులను కొంత వివరించడం అవసరం.

# 19 వ శతాబ్ది సామాజిక సాంస్కృతిక పరిస్థితులు

19 వ శతాబ్దిలోని పరిస్థితుల కారణంగా 20 వ శతాబ్దిలోని తెలుగు సాహిత్యం-ప్రధానంగా కవిత్వం నూతనమార్గాలలో సాగింది. నవ్యకవిత్వం ఒక ఉద్యమమయి సాగింది. అయితే ఈ ఉద్యమం ఒక్కసారిగా వచ్చిందికాదు. క్రమ పరిణామంగా వచ్చిన భావవిప్లవం. ఈ భావవిప్లవానికి దోహదం చేసిన పరిస్థితుల్లో రాజకీయ పరిస్థితులు కూడా ప్రముఖపాత్ర వహించాయి.

పాశ్చాత్య పరిపాలన భారతీయుల్లో రాజకీయ చైతన్యం కలిగించడానికి కొంత తోడ్పడింది. రాజకీయ కారణాలవల్ల ప్రజలలో స్వాతంత్ర్యాభిమానం బల పడింది. పరాయి పాలనలోని కష్టనష్టాలను తోటివారందరికీ తెలియజేసి దేశభక్తిని పెంపొందించాలనే కోరిక కొందరు యువకవులలో పెరిగింది. ఉద్యమ ప్రచారానికి వీలుగా ఛందోబద్ధంగా, పాడుకొనడానికి అవకాశం ఉన్న గేయకవిత వ్యాపిం చింది. ప్రబోధాత్మకమైన దేశభక్తి పూరితమైన రచనలు ఎక్కువగా వెలు వడ్డాయి. తరువాతకాలంలో ఆధునికాంధ్ర కవిత్వంలో ఒక ప్రత్యేకశాఖగా వింగ డింపబడ్డ దేశభక్తి కవిత్వానికి ఆనాటి రాజకీయ పరిస్థితులే ముఖ్యకారణమని చెప్పవచ్చు.

హిందూమత సంస్కరణోద్యమాలు నవకవులలో విశాల దృక్పథాన్ని తేవడానికి కొంతవరకు తోడ్పడ్డాయి. సంఘ సంస్కరణోద్యమాలు సమాజంలో సంచలనం కలిగించి ఆదర్శభావాల వ్యాప్తికి దోహదం చేశాయి. ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రత్యేకస్థానం పొందిన ప్రముఖులలో చాలామంది మీద ఈ సంస్కరణోద్యమాల ప్రభావం ఉన్నట్లు కనబడుతుంది. వీరేశలింగం పంతులు, వేంకటరత్నము నాయుడు, చిలకమర్తి, వేంకటపార్వతీశ్వరకవులు, కృష్ణశాస్త్రి, ముట్నూరి కృష్ణారావు వంటివారు బ్రహ్మసమాజపు ఆదర్శాలను నమ్మినవారు. ఇటువంటి ఉద్యమాల ఆదర్శాలతో సంఘసంస్కరణ కవిత్వం వెలువడ్డది.

పత్రికలు విద్యాధికులు విభిన్న విషయాలమీద తమ అభిప్రాయాలను వెల్లడించడానికి అవకాశం కలిగించసాగాయి. పత్రికల్లో ప్రచురణకు వీలుగా ఉండే

ఈ ఇంగ్లీషు విద్యావసరాన్ని గుర్తించిన రాజా రామమోహన్‌రాయ్ వంటి భారతీయులు ఈ దేశంలో యూరోపియన్ భాషలు సైన్సువంటి శాస్త్రాలు బోధించే విద్యావిధానాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టాలనే కోరిక కనబరిచారు. దానికై కంపెనీ పాలకులను వత్తిడి చేయసాగారు. పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీ (Public Instructi.n committee) అధ్యక్షుడైన థామస్ బాబింగ్టన్ మెకాలే (Thomas Bobington Macaulay) మినిట్ (Minute of Dissent 2-2-1835)[1] వలన ఇంగ్లీషు విద్యావిధానం సాధికారంగా భారతదేశంలో ప్రవేశపెట్టబడింది. 1844 లో ఇంగ్లీషు భాషా పరిచయం ఉండి పాశ్చాత్య విజ్ఞానశాస్త్రం చదువుకున్న వారికి ప్రభుత్వోద్యోగాలకు అవకాశం ఇస్తున్నట్లు ప్రకటించిన తీర్మానంతో ఇంగ్లీషు చదువులు దేశవ్యాప్తం అయ్యాయి. 19 వ శతాబ్ది మధ్యకాలానికి పాఠశాలలు కళాశాలలతో పాటు విశ్వవిద్యాలయాలు కూడా స్థాపింపబడ్డాయి.[2] ఇంగ్లీషు విద్యాభ్యాసం అధికం కావడంతో విద్యావంతులకు పాశ్చాత్య నాగరికత సంస్కృతులతో పరిచయం ఏర్పడింది. ఇంగ్లీషు సాహిత్యపఠనం విద్యావంతులలో నూతన భావాలకు బీజాలు వేసింది. భాషాసంబంధమైన ఏకీకరణ విద్యావంతులు తమ తమ అభిప్రాయాలను పరస్పరం అవగాహన చేసుకునే అవకాశాన్ని కలిగించింది.

బ్రిటిషు ఉద్యోగులకు ఉద్యోగదృష్ట్యా దేశంలోని వివిధ భారతీయ భాషల పరిచయం అవసరమయింది. క్యాంబెల్ విలియం బ్రౌన్ (William Brown), . పి. బ్రౌన్ (C P. Brown) మొదలైన పాశ్చాత్య పండితులు ఆ విధంగా లుగు భాషాధ్యయనం చేసినవారు. తెలుగు నేర్చిన పాశ్చాత్య పండితులు తెలుగు

1. భారతీయ పునరుజ్జీవనము - D. రామలింగము. P 30.
2. "1841 ఏప్రిల్ 14 వ తేదీని మద్రాసు యూనివర్సిటీ అను పేరనొక విద్యాసంస్థ స్థాపింపబడెను. ఈ విద్యాసంస్థయే తరువాత ప్రెసిడెన్సీ కాలేజీగా మార్చబడింది. (1855) ఇప్పుడున్న మద్రాసు యూనివర్సిటీ 1857 లో కలకత్తా, బొంబాయి విశ్వవిద్యాలయములతోపాటు స్థాపింపబడెను."
   తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము.
   కొత్తపల్లి వీరభద్రరావు P 246, 248.

చిన్నచిన్న రచనలకు ప్రోత్సాహం లభించసాగింది. దీనివల్ల కవులు ఖండకావ్య రచనను అధికంగా ఆదరించారు. ఇది వస్తువైవిధ్యానికి దోహదం చేసింది.

నవ్యకవుల ఆలోచనావిధానంపై అధిక ప్రభావాన్ని చూపిన ఆనాటి పరిస్థితులలో ఇంగ్లీషు విద్యావిధానమూ, పాశ్చాత్యులతో సంపర్కమూ ప్రధానంగా చెప్పదగ్గవి. ఆనాటి నవ్యకవులలో చాలామంది పాఠశాలలో కళాశాలలో ఇంగ్లీషు విద్యను అభ్యసించినవారేనని చెప్పవచ్చు. పాశ్చాత్య పండితులు తెలుగు భాషా సాహిత్యాలకు చేసిన సేవ, వారితో సంపర్కం చాలామందిలో హేతువాద వైఖరి లాటివి పెరగడానికి కొంతవరకు దోహదం చేశాయి. అవ్యవహిత పూర్వ కాలంలోని తెలుగు సాహిత్యం ఈ పరిస్థితులకు తోడయింది. నవ్యకవుల మానసిక పరివర్తనను స్పష్టంగా చూపడానికి ఇంగ్లీషు విద్యావిధానం, పాశ్చాత్యులతో సంపర్కం గూర్చిన వివరణ కొంత సహాయపడగలదు.

## ఇంగ్లీషు విద్య-పాశ్చాత్య సంపర్కం

పాశ్చాత్య పరిపాలనా కాలంలో ప్రవేశపెట్టబడిన ఇంగ్లీషు విద్యావిధానం విద్యావంతులకు ఇంగ్లీషు సాహిత్య పరిచయాన్ని కలిగించింది. ఇంగ్లీషు సాహిత్య పరిచయం భారతీయ సాహిత్యంలోని ఎన్నో మార్పులకు ప్రేరణ నందించింది.

ప్రాచీనకాలంలో భారతదేశంలో ఉన్న విద్యావిధానం నేటి ఇంగ్లీషు విద్యా విధానానికి పూర్తిగా భిన్నమయింది. ప్రాచీన సాహిత్యం, వ్యాకరణం, తర్కం, న్యాయం, తత్త్వశాస్త్రాల అధ్యయనం, మతగ్రంథ పఠనం, గణితం వంటివి ప్రాచీన భారతీయ విద్యావిధానంలో భాగాలుగా ఉండేవి.

ఆ విధానంలో విద్యనార్జించిన విద్యావంతులు, ఇంగ్లీషు భాషా పరిచయం లేకుండడంవల్ల పాశ్చాత్యదేశ పరిస్థితులను అధికంగా అవగాహన చేసుకోవడం సాధ్యమయ్యేది కాదు. ఆ కాలంలో పాశ్చాత్య దేశాలలో పారిశ్రామిక విప్లవం అనేక మార్పులు తెచ్చింది. మానవుని జీవనవిధానంలో నూతన శకం ప్రారంభ మయింది. ఆ శాస్త్ర పరిజ్ఞానాన్ని అవగాహన చేసుకోవడానికి అవసరమైన సైన్సు వంటి శాస్త్రాల పఠనానికి ఇంగ్లీషు భాషా పరిచయం, ఇంగ్లీషు విద్యాభ్యాసం అవసరమయింది.

చోటు చేసుకున్నాయి. టెన్నిసన్ (Tennyson), వర్డ్స్‌వర్త్ (Wordsworth), షెల్లీ (Shelley), కీట్సు (Keats) వంటి ఇంగ్లీషు కాల్పనిక కవుల రచనలు విద్యార్థులలో నూతనోత్తేజాన్ని కలిగించాయి. ఇంగ్లీషు సాహిత్య పరిచయం తెలుగులో నూతన సాహిత్య ప్రక్రియలు, ఛందోరీతులు ప్రవేశించడానికి సహాయపడింది. ఏకాంకిక, కథానిక, వ్యాసరచన, నవల వంటి సాహిత్య ప్రక్రియల మీద ఇంగ్లీషు సాహిత్య ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. విషాదాంత రచనలకు కూడా ఇంగ్లీషు సాహిత్యం దోహదం చేసింది. కొంత స్వేచ్ఛ, సాహసం పెరిగి ఇంగ్లీషు రచనల వంటి రచనలు తెలుగులో కూడా చేయాలనే కుతూహలం ఆధునిక కవులలో కలిగింది. ఖండకావ్య ప్రక్రియ తెలుగు భాషకు పూర్తిగా కొత్తది కాకపోయినా ప్రాచీన సాహిత్యంలో దానికి ఆదరణ గౌరవం కొంత తక్కువగానే ఉండేదని అనవచ్చు. కాని 20వ శతాబ్దిలో నవ్య కవితోద్యమంలో వస్తు వైవిధ్యంతో ఖండకావ్యం అధిక ప్రచారం పొందింది. దీనికి పత్రికావ్యాప్తితో పాటు ఇంగ్లీషు సాహిత్య పరిచయం కూడా దోహదం చేసింది.

సాహిత్యానికి ఎంతో సేవ చేశారు. తెలుగు సాహిత్య చరిత్రలో వీరి కృషికి ప్రత్యేక స్థానం ఉంది. వీరి కృషి మూలంగా ఎన్నో తాళపత్ర గ్రంథాలు ముద్రణ పొంది వెలుగు చూశాయి. వీరి కృషిలో కొందరు దేశీయ పండితులు వారికి సన్నిహితులయ్యారు. పాశ్చాత్య పండితుల సంపర్కం వల్ల వారికి పరిశోధనాదృష్టి అలవడింది. పరిశీలనాత్మక అధ్యయనానికి, హేతువాద వైఖరికి ఈ పాశ్చాత్య పండితుల సేవ దోహదం చేసింది. బ్రౌన్ దొర తన నిఘంటువులో వ్యావహారిక పదాలకు స్థానం ఇచ్చి గ్రాంథిక పదాలతో సమాన గౌరవాన్ని కల్పించాడు. తదనంతరకాలంలో వచ్చిన వ్యావహారిక భాషావాదానికి ఇది కొంత దోహదం చేసింది. సాహిత్యంలో కవి హృదయ స్పష్టతకు, భావవ్యక్తీకరణకు, రసస్ఫురణకు సాధారణ విద్యావంతులకు సహితం సులభ గ్రాహ్యమయిన వ్యావహారిక భాష సమర్థవంతమే అనే అభిప్రాయానికి ఆధునికులకు ఇది బలాన్నిచ్చింది. ఈ భావచైతన్య ప్రభావంగా ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రజల దైనందిన వ్యవహారంలోని సజీవ భాషకు ప్రాముఖ్యం పెరిగి, మారుమూల నిఘంటువులలో నిద్రించే పదప్రయోగం తగ్గుముఖం పట్టింది.

ఇంగ్లీషు సాహిత్యాధ్యయనానికి కొత్త విద్యావిధానం తోడ్పడింది. పాఠ్య గ్రంథాలలోని ఇగ్లీషు కవుల రచనలు విద్యావంతులైన యువకులకు ఇంగ్లీషు సాహిత్య పఠనాసక్తిని పెంపొందించాయి. మిగిలిన విషయాలలో లాగానే ఇంగ్లీషు సాహిత్య ప్రభావం కూడా ముందుగా వంగదేశం మీదనే పడింది. వంగదేశం దీర్ఘకాలం పాశ్చాత్య సంపర్కం పొంది ఉండడంవల్ల ఇంగ్లీషు సాహిత్య ప్రభావం ముందుగా వారిని సోకి ఉండవచ్చు. ఆ ప్రభావంతో నవీనసాహిత్య లక్షణాలను సంతరించుకొన్న వంగభాష ఇతర భారతీయ భాషలకు దారి చూపింది. బెంగాలీ సాహిత్యం నుంచి అనువాదాలు ఇతర భారతీయ భాషలలో వెలువడసాగాయి. ద్విజేంద్రలాల్ రాయ్ నాటకాలు, బంకిం చంద్రుని నవలలు, రవీంద్రుని, శరత్ రచనలు తెలుగులోకి అనువదింపబడ్డాయి. బెంగాలీ సాహిత్యం తెలుగు కవుల రచనలలో కొంత మార్పు తెచ్చింది.

తెలుగు సాహిత్యంలో నవ్యమార్గాలలో ప్రయోగాలు చేసినవారిలో దాదాపు అందరూ ఇంగ్లీషు సాహిత్యంతో పరిచయం కలిగినవాళ్ళే అని చెప్పుకోవచ్చు. ఇంగ్లీషు సాహిత్యపరిచయంవల్ల నవ్యకవులలో ఒకవిధమైన చైతన్యం భావవిప్లవం

విశ్వసించారు. దానికి మనోబలమూ, ఉత్సాహమూ పెంచుకోవాలని మార్గాన్ని సూచించారు. మంచి మంచిని పెంచుతుందనీ, ఈనాటి శుభం రేపటి శుభానికి కారణం అవుతుందనే నమ్మకంతో-

'గతము రాదాగతము తెలియదు
నేటి శుభములె మనకగున్.'1

అని అంటారు రాయప్రోలువారు.

ఎన్ని ఉత్పాతాలు వచ్చినా, ఈతిబాధలు కలిగినా భవిష్యత్తును ఆశాజనకంగా ఊహిస్తూ మానవుడు ముందుకు సాగుతాడని నమ్మారు రాయప్రోలు వారు. పరిస్థితులు ఎదురయినా ఉత్సాహాన్ని పీడక హృదయౌన్నత్యాన్ని పెంచుకునే ప్రయత్నం చేయాలన్నది వీరి ప్రబోధం. గతానికై చింతిస్తూ భవిష్యత్తుపై నిరాశ వహించడం పురోగమనానికి ఆటంకం అవుతుందనీ, పూర్వకాలంలోని మహోన్నతి క్షీణించిందని బాధపడుతూ నిరాశ నిస్పృహ చెందనవసరంలేదని వీరిఅభిప్రాయం.

"ఉత్సాహప్రభు మంత్రశక్తుల నొకండొక్కండె చాలున్ క్రియా
సత్సంసిద్ధికి, మంత్రమేగెను తపోజ్వాలాస్తమానావధిన్
ఉత్పన్నప్రభుశక్తి క్రమ్మఱదు క్షాత్రోపాస్తి లేమిన్ కలిన్
ఉత్సాహం బొకడే శరణ్యమిక నాత్మోత్థాపన ప్రాప్తికిన్.

ధనధాన్యస్థితి సన్నగిల్లినను విద్యాజ్ఞానదీపంబు లా
ఱిన, మర్యాదలు మాసినన్ ప్రబల దారిద్ర్యంబు పోటెత్తినన్
జన సమ్మేళన సళ్ళినన్, పగలు దంష్ట్రల్ విప్పినన్‌గాని యెం
దు నిరుత్సాహవశుండు గాని నరుడందున్ తత్పునర్భోగముల్'.'2

ఈ సందర్భంలో కార్యదీక్షకు సత్సాధనకు ఉత్సాహం ఆవశ్యకం అనీ, నిరుత్సాహం పొందక ముందుకు సాగినపుడు గత వైభవాన్ని తిరిగి పొందుతారనే దృఢ విశ్వాసాన్ని వ్యక్తం చేశారు సుబ్బారావుగారు. మనోబలంతో ప్రగతి పథంలో పయనిస్తే అభ్యుదయ ప్రాప్తికి అవకాశం ఉందనే నమ్మకంగల వ్యక్తి రాయప్రోలువారు.

---

1. 'సంక్రాంతి సంబరము' - మిశ్రమంజరి. p. 66.
2. 'ఉగాది నివేదన' - వనమాల - p. 15, 16.

'కడుపులు కాలా కన్నులు కుట్టా
పాతిన ధాన్యము దాచిన విత్తము
ప్రజలకు పంచీ పనులకు పెట్టీ
ఇరుగు పొరుగులను అరసికొనండీ.'[1]

అని నిర్మల హృదయంతో సమాజశ్రేయస్సును ఆశించారు. హాలకుండ వంటి సమాజ ప్రగతిని విషపూరితం చేసే పద్ధతి మారే రోజులు రావాలని వీరి కోరిక.

వంటయింటిలో మగ్గిపోయే స్త్రీలకు, రాత్రింబగళ్ళు కాయకష్టంతో 'క్షేత్ర సేవ' చేసే రైతులకూ, బ్రతికినంతకాలం శరీరశ్రమతో గడిపే కష్టజీవులకు, అంటరానివారిగా పరిగణింపబడే దురదృష్టవంతుల కందరికీ పుస్తక జ్ఞానం కలిగి, కనీసం 'నా ప్రజలు, నా దేశం' అనే మాత్రం అయినా జ్ఞానం కలగాలని ఆశించారు.[2]

కలతలతో, కక్షలతో, కష్టాలపాలైన లోకాలన్నీ ప్రేమతో ఏకమయి సుఖించాలని వాంఛిస్తూ-

'విరియునే జాతుల విద్వేష తమ మెల్ల
ఆఱునే దేశాల అర్థదాహమొకింత
మాతృదేశం బిచ్చు మధురాన్న పానాల
స్వేచ్ఛగా సుఖియింతురే యెల్ల ప్రజలు
ఆ యనంతుని లీల లనుభవించుచును?'[3]

అని సంశయాత్మకంగా ప్రశ్నించినా ఆ కాలం వస్తుందనే ఆశ వీరిలో ఉంది. నిష్కల్మషంగా, నిస్వార్థంగా సమాజాభ్యుదయాన్ని వాంఛించిన సుబ్బారావు గారు ఆ చల్లని రోజులు వస్తాయని, చక్కని సమాజం నెలకొంటుందని

1. 'సర్వజిత్' - వనమాల. p. 80.
2. 'పుస్తకము' - ఆంధ్రావళి. p. 23.
3. 'శ్రీ రవీంద్రకవి' - ఆంధ్రావళి. p. 45.

మానవజీవితంలో అత్యంత సహజాలయిన కష్టసుఖాల విషయంలో కూడా వీరి దృష్టి ఇంతే. కష్టసుఖాలు వెలుగుచీకట్లలాగా ఒకటివెనుక ఒకటి వచ్చిపోతూ ఉంటాయని, కష్టకాలంలో నిరాశ చెందకూడదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

''సుఖంబు కష్టముల్, వెన్నెల చీకటుల్ బలెనె వీడక ఒక్కటి వెన్క నొక్కటై
క్రన్నన వచ్చుచుండును నిరాశవహింతురె ఇంత మాత్రకున్.''[1]

రాయప్రోలువారు వర్తమానం కంటె మంచి రోజులు భవిష్యత్తులో రాగల వన్న ఆశతో నిరాశ, నిస్పృహ, నిరుత్సాహాలను దూరం చేసుకుని ముందుకు సాగిననాడు జాతి అభ్యుదయాన్ని పొందగలదన్న ఆశాతత్త్వం కలవారు.కనుకనే-

"కలదు కలదధిక ప్రకాశము
తోడ నారీ నరసమాజము
శాంతిగని సుఖియించు కాలము
ఏటికీ గుంజాటనల్?"[2]

అంటూ కలతలు కల్లోలాలు మరిచి, రాబోయే మంచిరోజుల కోసం శాంతితో నిరీక్షించమని ప్రబోధించారు.

రాయప్రోలువారు ఈ విధమైన సామాజిక స్పృహతో రచనలు చేస్తూనే కవిత్వాన్ని ఒక మలుపు తిప్పారు. తమ భావాలను, తాత్త్విక దర్శనాలను కవితామయంగా వెల్లడించడంలో కొత్తదనాన్ని కనబరిచారు.

తమ ఉక్తివైచిత్ర్యంతో రచనా వైశిష్ట్యంతో సుమారు వేయి సంవత్సరాలనుంచి దాదాపుగా ఒకే మార్గంలో పయనిస్తున్న సాహిత్యానికి నూతన మార్గాన్ని చూపారు. భావవ్యక్తీకరణలో చమత్కారాన్ని చూపుతూ తమ కవిత్వానికి నవ్యతాస్ఫూర్తిని కలిగించారు.

---

1. 'లలిత' - అభినవకవిత - p. 201.
2. 'ఆషాఢి' - మిశ్రమంజరి - p. 69.

# రచనా వైశిష్ట్యం - ఉక్తివైచిత్ర్యం

రాయప్రోలువారి రచనల్లో ఇతివృత్తం, రచనా విధానం, భావాలు, భావ వ్యక్తీకరణ, ఉపమానాలు, కావ్యభాష ఇలాటి వాటిలో అన్నిటా ప్రత్యేకత కనబడుతుంది. వీరి కావ్యాలలోని ఇతివృత్తాలు అధికంగా సామాజికాలనే చెప్ప వచ్చు. వీటిలోని ఇతివృత్తం సంక్షిప్తంగా ఉంటుంది కనుక కథాకథన శిల్ప చాతుర్యాన్ని ప్రదర్శించిన రచనలుగా ఇవి కనబడవు.

జీవన తత్త్వవివేచనా శీలం అయిన వస్తువును తృణకంకణాది కావ్యాలలో గ్రహించారు. వారు దర్శించిన ప్రేమతత్త్వ స్వరూపాన్ని, స్త్రీ గుణాల ప్రాధా న్యాన్ని వస్తువుగా ఉన్న వీరి కావ్యాలు ఒక ప్రణాళికా బద్ధంగా ఉన్నాయి. ఒక్కొక్క కావ్యం ఒక్కొక్కవిధమైన ప్రేమ లక్షణాన్ని ప్రధానం చేసుకుని కావ్య పరంపర పలయించడం వీరి రచనల ప్రత్యేక లక్షణంగా పేర్కొనవచ్చు.

సుఖలాలసతకు ప్రతీకలన్న భావాన్ని కొందరికీ, తాత్త్విక దర్శనాన్ని ధ్వనింప చేస్తున్నవన్న భావాన్ని కొందరికీ కలిగింపచేసిన ఉమర్ రుబాయీలను రాయప్రోలువారు మొట్టమొదటిసారిగా తెలుగులోకి 'మధుకలశం' అన్న పేరుతో అనువదించి తెలుగు సాహితీ ప్రియులకు సవ్యరుచులను అందించారు[1]. వస్తు నిర్ణ యంలో ఈ మధుకలశ రచన చక్కని నిదర్శనం.

తమ సాంఘిక, సాహిత్య దర్శనాలన్నిటి సమీకరణ స్వరూపంగా రమ్యా లోకం, మాధురీ దర్శనం, రూప నవనీతం వంటి రచనలు చేశారు. రూప

---

1. 'ఉమరు రుబాయతును ఆంధ్ర సారస్వత లోకానికి సుపరిచితం చేసిన ఘనత శ్రీ సుబ్బారావుగారిదే. మధుకలశంలోని పద్యాలు మొదట 1924వ సంవత్సరంలో భారతిలో అచ్చయినవి. ఆ తరువాత కొన్ని సంవత్స రాలకు గాని ఇతరుల అనువాదాలు వెలువడలేదు.'
'మధుకలశము' - కొమరగిరి నరసింహారావు - కిన్నెర, మార్చి, 1954.

కాని వీరి కావ్యాల పేర్లలో 'తృణకంకణం', 'జడకుచ్చులు' వంటివి అపూర్వంగా కనబడతాయి.

ఇవి పేరు పెట్టడంలో నవ్యత కాగా పేరు పెట్టకుండా నవ్యత తెచ్చినవి తృణకంకణ కావ్య పాత్రలు. కావ్యంలో పాత్రలుగా గ్రహించడానికి ప్రాచీన కాలం నుంచి కూడా ప్రత్యేక నియమ నిబంధన లేవీ ఉన్నట్లు కనబడవు. పశు పక్ష్యాదులను, నదీ నగాలను సహితం కావ్య పాత్రలుగా ప్రాచీన కవులు కొందరు గ్రహించారు. అయితే కావ్య పాత్రలయినవి చేతనాచేతనాలలో ఏవయినా వాటికి సార్థకమయిన ఒక పేరుపెట్టి వ్యవహరించడం అలవాటు. పశు పక్ష్యాదులకే పేరు పెట్టినపుడు కావ్యంలో ముఖ్యమయిన మానవపాత్రలకు పేర్లుపెట్టి వ్యవహరించడం సహజం. అయితే రాయప్రోలు వారు ఈ అలవాటుకు కొంత భిన్నంగా తృణ కంకణంలో ప్రధాన పాత్రలయిన నాయికా నాయకులకే పేర్లు పెట్టకుండా కావ్య రచన చేయడం సాహిత్య జగత్తులో అపూర్వ విషయంగా చెప్పవచ్చు.

ఇక రచనా విధానాన్ని పరిశీలించి నపుడు నవీనంగా, కొంత ప్రత్యేకంగా కనబడేది కావ్యారంభం. ఇష్టదేవతాస్తుతి, పూర్వకవిస్తుతి, శ్రీకారం వంటివాటితో కావ్యాన్ని ప్రారంభించడం దాదాపు వేయి సంవత్సరాలుగా వస్తున్న ఆంధ్ర సాహిత్య సంప్రదాయం. ఈ ఆచారానికి కొంత భిన్నంగా 'ఓ సుగుణాల వాల' అని వీరి తొలి కావ్యం 'లలిత' ను ప్రారంభించారు. ఆంధ్ర సాహిత్యంలో విషాదాంత రచనలు అంతకు పూర్వం కొద్దికాలం క్రితమే ప్రారంభం అయ్యాయి. కనుక విషాదాంత రచన అప్పటికి సర్వసాధారణం అనడానికి అవకాశం తక్కువ కాబట్టి వీరి రచనలలో విషాదాంతాలు కొంతవరకు కొత్తవి కాగా వీరు విషాదంతో కావ్యాన్ని ప్రారంభించడం అతి నవ్య ప్రయోగం అనవచ్చు. 'లలిత' కావ్యం నాయిక మానసిక వ్యధతో ప్రారంభం కాగా, 'తృణకంకణం' 'అడుగులు బొబ్బ లెత్త....' అని నాయిక శారీరకమైన శ్రమను సూచిస్తూ ప్రారంభింపబడింది. 'స్నేహలత'లో విషాదాంతాన్ని దృష్టిలో పెట్టుకుని,

'నిత్య సంధ్యాకుమారీ మణీమతల్లి
కట్టు చీర చెఱంగులు కాలు పోల్కి—

నవనీతం పూర్తిగా సంవాదాత్మకమయిన రచన అనడానికి గాని, సంప్రదాయ సిద్ధమైన నాటక లక్షణాలు ఉన్న దృశ్య కావ్యంగా గాని చెప్పడానికి అవకాశం లేని విధంగా ఆ రెంటికీ నడుమ నిల్చింది.[1] రసపోషణ, కథాకథనం వంటి వాటికి దీనిలో ఎక్కువ ప్రాధాన్యం కనబడదు. భావాన్ని అభివ్యక్తం చేయడానికి ఏర్పడిన సంవాదరూపకమయిన కల్పనగా దీనిని చెప్పవచ్చు. ఈ విధంగా రూప నవనీతమ్‌లో వస్తువులోనే కాక స్వరూపంలో కూడా ప్రత్యేకత ఉంది.

ఇక ఖండికలలో విస్తృతమైన వస్తు వైవిధ్యాన్ని ప్రదర్శించారు. 'పులియాకు' నుండి 'పూజ'ల వరకు ఎన్నో విషయాలు వీరి కవితా వస్తువులుగా కనబడతాయి. 'పులియాకు' వంటి నీరస వస్తువుపై రసవత్తరమైన రచన చేసి తమ సౌందర్య దృష్టిని స్పష్టం చేశారు. స్మృతి గీతాలు, స్తుతి గీతాలు వంటివి ఆనాటికి నవ్యవస్తువులే అని చెప్పవచ్చు. 'పాలబాన', 'కాపుకన్నె', 'చిల్క', 'కోయిల', 'మేఘమాల', 'తిలకము', 'పూవు' వంటి ఎన్నో విషయాలు వీరి కవితా వస్తువులు. దేశమాతను, తెలుగు తల్లిని, ప్రబోధాన్ని ప్రధానం చేసుకున్న రచనలు సహితం ఉన్నాయి. సామాన్యుల జీవితాన్ని, సాధారణ సంఘటనలను, సర్వసాధారణ ప్రకృతి సంపదను వస్తువులుగా గ్రహించి కొన్ని ఖండికలలో నిసర్గ రమణీయంగా చిత్రించారు. ప్రధాన కావ్యాలకు వీరు ఏర్పరచుకున్న ప్రణాళిక ఒకటి ఉంది కాని, వీరి ఖండికలకు వస్తునియతి లేదు. వీరిని కదిలించిన అనుభూతులు, సంఘటనలు, సన్నివేశాలు ఏవయినా వీరికి కవితా వస్తువులే అయ్యాయి. ఈ విధంగా వస్తు వైవిధ్యానికి, వస్తు నవ్యతకు చిహ్నాలుగా వీరి రచనలు నిలబడతాయి.

వస్తువును గ్రహించడంలోనేకాక కావ్యానికి పేరు పెట్టడంలోకూడా కొంత నవ్యత కనబరిచారు. కావ్యాలలోని ప్రధాన పాత్రల పేర్లో, ప్రధాన సంఘటనలు లేక సన్నివేశాల పేర్లో కావ్యానికి పెట్టడం అధికప్రచారంలో ఉన్న సంప్రదాయం.

---

1. "పాత్రలు, ప్రవేశ నిష్క్రమణలు, రంగములు ఇలాటి విభాగీకరణం ఈ రచనకు రూపకచ్ఛాయ నిచ్చింది. కాని ఇది రసానుపాదకమయిన దృశ్యబంధము కాదు. భావాభివ్యంజకమయిన కల్పనగా కాంక్షితమైన రచన." 'రూప నవనీతమ్' - నివేదన-రాయప్రోలు సుబ్బారావు.

అనే పద్యాన్ని ద్రౌపదితో రెండు సందర్భాలలో పలికిస్తాడు. కీచకునితో పరుష వాక్యాలు పలికే సందర్భంలో ఒకసారి, తిరిగి ద్రౌపది భీమసేనునితో తన భంగపాటును చెప్పి పరితపించే సందర్భంలో ఒకసారి పునరుక్తిగా అదే పద్యం వాడబడింది. ఈ విధంగా రెండుసార్లు పలికించి ఔచిత్యాన్ని, నాటకీయతను పోషించి ఆ భావానికీ ఆ సందర్భానికీ వన్నె తెచ్చాడు తిక్కన సోమయాజి.

రాయప్రోలువారు 'స్నేహలత' అగ్నికి ఆహుతి అవుతున్న సందర్భంలో వివిధ ఉపమానాలను ప్రయోగిస్తూ చివరి రెండు పాదాలను పునరుక్తిచేసి నవీనంగా చెప్పారు.[1] ఈ విధానం రచనకు కేవలం నవ్యత నాపాదించడమే కాక ఆ సందర్భానికీ సన్నివేశానికీ బలాన్ని చేకూర్చింది. ఈ విధంగా సాదృశ్య పరంపరతో సన్నివేశాన్ని పఠితకు ప్రత్యక్షం చేయడమే కాక ఆ ఘట్టానికి కరుణ రస స్ఫూర్తిని కలిగించారు. వార్తా పత్రికలలో ప్రచురితమైన ఒక అబల ఆహుతి వార్త కవితాపరమైన భావావేశంతో రసమయమై స్థిరపడడానికి ఈ వర్ణన దోహదం చేసింది.

---

1. విరియు చెంగల్వ పూవుల చెరువు నందు
కులుకు రాయంచ కన్నియ కొదమ పగిది
చూడదలపించె భావవిశుద్ధ వీధి
దహనులో నున్న స్నేహలతామ తల్లి!

ఈ పద్యంలోని చివరి రెండు పాదాలను తిరిగి తిరిగి ఎనిమిది రకాల ఉపమానాలతో ప్రయోగించారు.

తామ్ర పర్ణీ నవారుణోదకములోన
పొదము తెలియాణి ముత్యాల బొమ్మబోలి....
మామిడి చిగుళ్ళ నిగనిగల్ మలయు సెజ్జ
చెదరు ధవళోత్తరీయంపు చెఱగు వరుస....
పండు పగడాల రాశిలో బడి భ్రమించు
నిండు జాబిల్లిరేక నా నిర్మలముగ ....
లిఖిత కుంకుమ రంగవల్లికల నడుమ

ఆస్తగిరి మస్తకమున సస్యస్తకాంతి
కాయుడగు సూర్యభగవాను డాయె లలమె.'[1]

అని అశుభ సూచకమైన వర్ణనతో ప్రారంభించారు. ఈ విధంగా శ్రీకార ప్రారంభం లేకపోగా విషాదాన్ని సూచిస్తూ ప్రారంభించడం నవ్య మార్గం అన వచ్చు.

పూర్వ కవులపై వీరికి అభిమానం అధికంగా ఉన్నప్పటికీ కావ్యాదిలో పూర్వకవులను స్తుతించిన సందర్భాలు తక్కువ అని చెప్పవచ్చు. రమ్యాలోకంలో-

"మామిడి కొమ్మ మీద కలమంత్ర
పరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి..... ..."[2]

అని ధ్వన్యాత్మకంగా వాల్మీకిని స్ఫురింపచేస్తూ స్తుతించడం పూర్వ కవి స్తుతి విధానంలో ప్రత్యేకంగా కనబడుతుంది. అలంకారాలలో మాలోపమాలంకారము ప్రాచీనమే అయినా పద్యపాద పునరుక్తితో ఉపమా మాలికను ప్రయోగించడం రాయప్రోలువారు అనుసరించిన నవ్యవిధానం. ఒకే పద్యంకాని పద్య పాదాలు కాని పునరుక్తిగా ప్రయోగించడం ప్రాచీన ఆంధ్ర సాహిత్యంలో అసలు లేదనలేము గాని అధికంగా కనబడదు. తిక్కన సోమయాజి మహాభారతంలో—

'దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతి వీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా'"[3]

1. 'స్నేహలత' - మొదటి పద్యం.
2. రమ్యాలోకము - p. 2.
3. శ్రీమదాంధ్ర మహాభారతము - విరాటపర్వము - ద్వితీయ ఆశ్వాసము 55 వ పద్యం; 172 వ పద్యం.

వక్రోక్తి వీరి కవితాంశానికి జీవం అని అనిపిస్తుంది.[1] పదప్రయోగంలోని విశిష్టత వల్ల ఆ పదజాలం సమాహారంగా వాచ్యార్థానికి అతీతంగా రమణీయ భావ ప్రపంచాన్ని సృష్టిస్తుంది. ఉదాహరణకు—

"తళుకు కప్రంపు పాతరలు తీసినయట్లు
శ్రీగంధ భాండముల్ చిందినట్లు
పచ్చకుంకుమ పువ్వు పంటకోసినయట్లు
పన్నీటి గడ్డలు పగిలినట్లు
అగరు వృక్షమదంబు పిగిలి పిచ్చిలినట్లు
కస్తూరి కోశముల్ కరిగినట్లు
పునుగుపిండి దుమారముల్ రేగినట్టులు
పూలు తావుల నెగబోసినట్లు

ప్రేమరూపనా నారక్త బింబనముల
దిద్దినావు రచించి చిత్రించి ఆల
పించి అభినయించి వచః ప్రపంచమందు[2]...."

ఈ సందర్భంలో రచించి, చిత్రించి, ఆలపించి, అభినయించి అన్న క్రియలకు పై పాదాలలో వాటికి ఉపయోగించిన ఉపమానాలకు సమాన ధర్మం

---

1. "రాయప్రోలు కవిత్వంలో కీలకం వక్రోక్తి.... ఈ విచిత్ర శబ్ద ప్రయోగ కళ ఒక ఆకర్షణీయ జగత్తును, ఒక రమణీయ వ్యవహారాన్ని సృష్టిస్తోంది.... ఈ ఆకర్షణీయ జగద్వ్యవహారం అంతా శబ్దము యొక్క లక్షణాశక్తి నాశ్రయించి ఉద్భవించినదే. ఇదే రాయప్రోలు సృష్టించిన నవ్య ప్రపంచ పంచప్రాణ లక్షణం. ఇది తెలుగులో తత్పూర్వం అప్రధానమూ లేక క్వాచిత్కమూ, లేక మృగ్యమూ గనక నిజమైన కవిత తెలుగులో 11 వ శతాబ్దిలో కాక 20 వ శతాబ్దిలోనే మొలకెత్తింది. ఈ మొలక పేరే రాయప్రోలు సుబ్బారావు." గుంటూరు శేషేంద్రశర్మ - విమర్శిని 4, p. 112 - 113.
2. రవీంద్రుని అస్తమయము - వనమాల p 55

భావాన్ని చెప్పడంలోనే కవి సామర్థ్యం వ్యక్తం అవుతుంది. భావం పాతదే అయినా చెప్పే విధానంలో కవి ప్రత్యేకత కనబడుతుంది. కనుకనే రాయప్రోలు వారు-

'కలదు కాదె అనుక్తంబు గ్రథనమందు'[1]

అని అన్నారు. గ్రథనం విషయాన్ని అనుక్తంగా, అపూర్వంగా మలచి నవ్యతాస్ఫూర్తిని కలిగిస్తుంది. శబ్దాలు కాని వాటి అర్థాలు కాని కొత్తగా వీరు సృష్టించినవి కావు. కాని, శబ్దప్రయోగకౌశలంతో వీరు నవ్యత సాధించారన వచ్చు.[2] వీరు ఉక్తి వైచిత్ర్యంతో భావవ్యక్తీకరణలో కొత్తదనాన్ని చూపారు.

---

తీర్చినట్టి కర్పూర లతిక విధాన....
ప్రజ్వలించు జీవౌషధీవనమునందు
రంజిలెడి తెల్లని సుధాసరసి విధాన....
సుభగ తాంబూల రససాంద్ర సుషమ మధ్య
నొత్తు తెలినవ్వు రేకల గుత్తి మాద్రి....
కనక కదళీదళంబులు గప్పికొనిన
పారిజాత ప్రసవ మాలభంగి ..."
'స్నేహలత' - p. 300, 301. (అభినవ కవిత)

1. రమ్యాలోకము.
2. "వీళ్ళు నూతనపదాలను సృష్టించినారా ? లేదు ...ఉన్న పదాలకు ఉన్న అర్థముకంటె భిన్నార్థములు కల్పించినారా? లేదు. ప్రతిదానికీ సహజమైన అభిధార్థమూ అది పట్టకపోతే ఉండే లక్షణార్థమూ అట్లాగే ఇన్నవి. పోనీ వ్యంజననేమైనా యెక్కువగా వాడి పదాలకూ పదబంధాలకూ నూతన రసవంతమైన అర్థాలను సహృదయులలో కలుగజేసినారా అంటే వీళ్ళలో వ్యంగ్యం కంటే వాచ్యమెక్కువ. అవే పదాలై అవే అర్థాలైతే యిక నవ్యత యెక్కడ ఉన్నది ? వాటి గ్రథనములో ఉన్నది - విశేషమూ నవ్యతానూ. ఈ గ్రథనమువల్ల పదసమ్మేళనానికి ఒక అపూర్వతా నవ్యతా వస్తున్నది."
నవ్యాంధ్ర సాహిత్య వీధులు - కురుగంటి సీతారామయ్య. p. 596.

'పసుపు బూపిండి చరులెల్ల విసరుచుండ.'[1]
'చూపులను పాలవెన్నెల జున్ను తేఱు.'[2]
'చీకటి జడల్ ముడుల్ విచ్చి చిందులాడె.'[3]
'కన్నెవిరులు సమర్తాడు కాలమందు.'[4]

ఇటువంటి సందర్భాలలో వీరి భావాభివ్యక్తిలోని నవ్యత స్పష్టం అవుతుంది. వీరు చెప్పిన భావాలలో కొన్ని పాతవే కావచ్చు. ప్రాచీన ప్రయోగాలలో కనబడేవేకావచ్చు. కాని వాటిని వ్యక్తం చేయడంలో వీరి పదప్రయోగం వాటికి కొత్తదనం కలిగిస్తుంది.

వెదుళ్ళలోనుండి గాలి వీచినపుడు వెలువడిన శబ్దాన్ని సంగీతధ్వనిగా వర్ణన చేయడం ప్రాచీనం కావచ్చు; కాని 'నవ్వుచు పండువెదుళ్ళు పాడసాగ'[5] అని వర్ణించడం నవీనంగా కనబడుతుంది.

చంద్రునితో ముఖాన్ని పోల్చడం అతిప్రాచీన ఉపమానం. ఈ ఉపమానాన్ని ఎన్నోవిధాలుగా కవులు అనేక అలంకారాల ద్వారా వ్యక్తపరిచారు. ఉపమేయం అయిన వ్యక్తి ముఖ సౌందర్యం ముందు చంద్రుడు ఓడిపోతాడన్న భావవ్యక్తీకరణ కూడా వాటిలో ఒకటి. ఇటువంటి విధానాన్నే అవలంబించి అదే భావాన్ని చెప్పినప్పటికీ,

'సిరి సిరి జాబిల్లి చెరిపేటి మోము
పాసిన పుష్పమై మాసెరా తండ్రి.'[6]

అని జాబిల్లి అందాన్ని చెరిపిన ముఖంగా చెప్పడంలో నవ్యత చేకూరింది.

---

1. 'తెనుగుతోట' -అభినవ కవిత - p. 319.
2. 'అమృతవార్త' - 'జడకుచ్చులు' - p. 164.
3. 'ఎవరు' - 'జడకుచ్చులు' - p. 132.
4. 'స్వప్నకుమారము' - p. 9.
5. జన్మాష్టమి - వనమాల - p. 71.
6. మిశ్రమంజరి - p. 75.

గాని, చెప్పుకోదగిన సామ్యంగాని వాచ్యార్థంవల్ల అధికంగా కనబడదు. కాని ఆ ఉపమానాలు సృష్టించిన ఒక మధుర భావం మనోహరంగా ఆ క్రియలకు అన్వయించి విషయాన్ని అనుక్తంగా చేసింది. ఇదే విధంగా,

"పాల క్రొమ్మీగడల్ పచ్చి వెన్నయి విచ్చి
తీయని నునుపూసలాయెనేమొ?
కమ్మని మకరంద కణములు స్నేహించి
చిన్నారి పలుకులై చిక్కెనేమొ?
పూల లావణ్యంబు పొంగి చక్కదనాల
పిండెలై రుచులెచ్చి పెరిగెనేమొ?
సెలయేటి యుయ్యాల కులుకు టొయ్యారముల్
ముద్దుముచ్చటలయి ముదిరెనేమొ?
పాటకును పద్యమునకు నమ్రముగ నొదిగి
చవికి చాతుర్యమునకు సాజముగ సాగి
పోరునకు పొత్తునకు చాలి పొంది పొసగు
మా తెనుగుతల్లి మెడకిదే మల్లెదండ"[1]

అంటూ భాషాసామర్థ్యాన్ని, మాధుర్యాన్ని స్మరించారు. ఈ సందర్భంలో సహితం సీసపద్యంలోని నాలుగు పాదాలలోని భావం తెనుగు భాషా మాధుర్యాన్ని చవి చూపుతుంది. కాని, ప్రతి పదానికి వాచ్యార్థాన్ని గ్రహించి, అన్వయించ బోతే ఆ భావమాధుర్యం తగ్గిపోతుంది.

'కాళిదాసుని భణితి కళలు సమర్తాడె.'[2]
'తమసా తరంగవతికిన్ పొడకట్టె సమర్త చిన్నెలు.'[3]
'వెన్నెలలు నిద్రవోయెడు వేళలయ్యె.'[4]

1. తెనుగుమాన్యము - ఆంధ్రావళి - p. 39.
2. 'నమోవాకమ్' - మిశ్రమంజరి - p. XI.
3. 'జన్మాష్టమి' - వనమాల - p. 71.
4. 'తెనుగుతోట' - అభినవకవిత - p. 336.

గించడం విశిష్టంగా కనబడుతుంది. ఇదేవిధంగా రువ్వడం, మేయడం, ఉదారం, కారాడటం, నానడం, పిదకడం, కవుగిలించడం, విందులాడడం మొదలైన పదాలు ప్రయోగించిన సందర్భాలు కొన్ని నవీనంగా కనబడతాయి.[1]

వీరి రచనకు నవ్యతను చేకూర్చిన మరొక లక్షణం లింగాలను సూచించే శబ్దప్రయోగం. కొన్ని స్త్రీలింగపదాలకు పులింగ పదాలను, కొన్ని నపుంసక లింగపదాలకు స్త్రీలింగ సూచక శబ్దాలు జోడించి ప్రయోగించడంలో విచిత్రమైన అందం చేకూరింది.

---

1. 'చలుదుల పాటలు రువ్వుకొనుచు' - 'కోలాటము' - కన్నెపాటలు p 12.
'మొగిలుమేసే ప్రభాతములందు కొండలన్' - 'మేఘమాల' జడకుచ్చులు p. 127.
'గొల్లని యుదారపుటీలలో' - 'కోయిల' - జడకుచ్చులు - p. 143.
'కోర్కెలు లోలోన నానసాగె' - 'లలిత' అభినవకవిత p. 219.
'కనులు కనులు కవుగిలింప' - 'చెమ్మచెక్క' - కన్నెపాటలు p. 9.
'వ్రేళ్ళు వ్రేళ్ళతో విందులాడగా' - 'నాలుగు స్తంభాలాట' కన్నెపాటలు p. 10.
'చక్కని యందము పుక్కిలింతలై" - 'వరలక్ష్మీవ్రతము' కన్నెపాటలు p. 35.
'పాటకయి కారాడె కోకిల' - 'బ్రహ్మముడి' -మిశ్రమంజరి p. 128.
'అందాలు పిదికేటి సందె సంపంగి' - 'వసంతము' ఆంధ్రావళి p. 68.
'నవ్వు రవ్వలు చిమ్మగన్' - 'పల్లెపడుచు' మిశ్రమంజరి p. 142.
'గంటలు మెడలందు ఘల్లని ఎడాపెడ మ్రోయగ' - 'కోయిల' - జడకుచ్చులు p. 143.
'రాలన్ చక్కదనాల నవ్వు' - కష్టకము' అభినవకవిత p. 259.
'అందముల్ నలగని ... కమలం' - 'కష్టకము' అభినవకవిత p. 270
'కొంత తాపము తునియన్' - 'లలిత' అభినవకవిత p. 214.

ఒక వ్యక్తిని గూర్చి చెప్పడంలో 'ఏ ముహూర్తాన పుట్టాడో' అనీ, 'ఏ నక్షత్రాన పుట్టాడో' అనీ అనడం లోకవ్యవహారం. ఇటువంటి భావాన్నే 'మీ యమ్మ ఏ తారచాయలో నినుగాంచె'[1] అన్న ప్రయోగం ఆ భావాన్ని అనుక్తంగా చేసింది. ఇదే పద్ధతిలో 'జోతిర్మయం వాఙ్మయం' అన్న ఆర్యోక్తి ఛాయలో సాహిత్యం తేజోవంతమన్న భావాన్ని ఇమిడ్చి - 'ఇంటింట దేశిసాహిత్య దీపములతో' అని ప్రయోగించారు. దేశి సాహిత్య దీపాలనే పదజాలం పాత భావానికే కొత్త అందాన్ని తెచ్చింది.

వీరి రచనలో మరొక ప్రత్యేకత ఒక భావవ్యక్తీకరణకు ప్రసిద్ధంగా ప్రచారంలో ఉన్న కొన్ని పదాలను, పదబంధాలను వేరే భావాన్ని చెప్పడానికి ప్రయోగించడం. 'ఫక్కున' అన్న పదం నవ్వడానికి ప్రయోగించడం అధికంగా కనబడుతుంది. అయితే రాయప్రోలువారు దానిని తలుపు తెరవడానికి వాడడం కొత్తగా కనిపిస్తుంది. 'పడకటింటి తలుపు ఫక్కున తెరచి'[2] అన్న ప్రయోగం విచిత్రంగా ధ్వనిస్తుంది. అదే రకంగా కెవ్వున అన్నది కేకవేయడానికి, చిన్న పిల్లల ఏడుపుకు వాడడం ప్రసిద్ధం. 'కెవ్వుకెవ్వున నవ్వు పక్షినిచయయుంబు',[3] 'కెవ్వున నొయారపు కూజితము ల్వెలార్చు చా కొదమ శుకంబు వోయె'[4]- అన్న ప్రయోగాలలో (కొదమ శుకం అన్న పదబంధం) పక్షులు చేసేధ్వనిని నవ్వడంగా భావించడంతోపాటు, ఒయారపు కూజితం కెవ్వున ధ్వనించిందనడం, కెవ్వున నవ్వడం అన్న భావవ్యక్తీకరణలు నవ్యత నాపాదించాయి. కుచ్చెళ్ళ 'పెళ పెళ కుసు క్రుంగి'[5] అన్న సందర్భంలో 'పెళ పెళ' అన్నది చీరకుచ్చెళ్ళకు వాడడం అంత ప్రసిద్ధం కాదు. 'క్రక్కడం' అన్న క్రియను విషం క్రక్కడం, ఆగ్రహం వెళ్ళగ్రక్కడం అన్న విధంగా ప్రయోగించడం ప్రసిద్ధం కాగా ఆ క్రియా పదాన్ని అందానికి చేర్చి 'రెక్కల నందాలు గ్రక్కేటి పూవ'[6] - అని ప్రయో

---

1. 'అడివోరి చిన్నాడు' - వనమాల - p. 59.
2. 'గీతాందేహి' - జడకుచ్చులు - p. 111.
3. 'వసంత వికాసము' - జడకుచ్చులు - p. 121.
4. కష్టకమల - అభినవ కవిత p. 262.
5. 'గీతాందేహి' - జడకుచ్చులు p. 111
6. 'పూవు' - జడకుచ్చులు - p. 125.

'వెండి లాంతరు వెలిగించి వెడలె రజని.'[1]

'నీలగిరులను బట్టబయలున
పెరుగుముద్దలు పంచు శారద....'[2]

'జున్నుగడ్డల భంగి చుక్కల
వెన్నెలను పెరుగన్నమట్టుల
మ్రింగె దెయ్యము వంటి చీకటి....'[3]

చంద్రుని లాంతరుగా భావన చేయడానికి తోడు 'రజని' అన్న స్త్రీ లింగ శబ్ద ప్రయోగం దానికి మరింత సౌందర్యాన్ని ఆపాదించి అభిసారికను స్ఫురింప జేస్తుంది. వెన్నెలను తత్పూర్వం ఎందరో కవులు ఎన్నో విధాలుగా వర్ణించారు. కాని, పెరుగన్నంగా భావించడం అపూర్వం.

'మొగ్గనవ్వె తెక్కలు విచ్చు - పొట్టపగల
నవ్వె శుక్తి ముత్యంబులన్ రువ్వు - చెట్లు
నవ్వె లేత కేంపుల వాయనంబు లెత్తు
శబ్దములు నవ్వె అర్థకోశముల తెరుచు.'[4]

మొగ్గవిచ్చి పువ్వుగా మారడం, చెట్లు చిగర్చడం, శబ్దం సహజ శక్తితో అర్థాన్ని స్ఫురింపచేయడం వంటి వాటిని నవ్వడంగా భావన చేసి చమత్కరించారు. ఈ సందర్భంలో వీరి భావ వైశిష్ట్యం స్పష్టం అవుతున్నది.

సామాన్యుని దృష్టికి కవి దృష్టికి ఉన్న భేదాలలో ముఖ్యమయినది భావుకత. భావుకుడయిన కవి, సామాన్యునికి సాధారణం అనిపించిన విషయాన్ని తన కల్పనాసామర్థ్యంతో అసాధారణంగా, రసవత్తరంగా సృష్టిస్తాడు. ఉదాహరణకు-

---

1. 'పెండ్లి లగ్నం' - మిశ్రమంజరి. p. 57.
2. 'నవరాత్రి' - మిశ్రమంజరి. p. 72.
3. 'మంగళమాషుమ్' - మిశ్రమంజరి p. 46.
4. 'ఏరుడు పూలు' - మిశ్రమంజరి. p. 99.

ప్రాచీన ప్రయోగాలలో పుంలింగంగా అధికప్రచారంలోవున్న భ్రమరాన్ని రాయప్రోలువారు మిళిందకన్య, భ్రమరబాల, తుమ్మెద పడుచు, భృంగపుత్రి అంటూ స్త్రీలింగంగా ప్రయోగించడం ప్రత్యేకంగా నవ్యత చేకూర్చింది.

జడపదార్థం అయిన మేఘాన్ని మేఘుడు అనడం ప్రసిద్ధంకాగా 'నీరద సుత' అని స్త్రీలింగంగా ప్రయోగించడం, వేణువుకు 'కలికి వేణువు'అని స్త్రీవాచకాన్ని చేర్చడం నవ్యప్రయోగాలుగా చెప్పవచ్చు.

భూమిని స్త్రీగా సంప్రదాయానుసారం భావన చేసినప్పటికీ, పచ్చికను వర్ణించే సందర్భంలో 'కోడెతనంపుజిగి' అని పుంలింగ సూచకశబ్ద ప్రయోగం కొత్తగా కనబడుతుంది. ఆడత్రాచు, నాగకన్య అని స్త్రీలింగపరంగా సర్పాలను చెప్పడం ఉన్నప్పటికీ, 'త్రాచుగుబ్బెతలు' అని 'గుబ్బెత' శబ్దాన్ని ప్రయోగించడం కొంత వైచిత్ర్యాన్ని కలిగిస్తున్నది. ఇదేవిధంగా వీరు చేసిన మరికొన్ని సమాసాలు 'జింకపడంతి', 'కురంగకన్య', 'కుమారహరిణి', 'గువ్వపడతి', 'కలికి కోయిల', 'కోడెకోయిల', 'కోకిలబాల' 'కలికి పూగుత్తి', 'కలికితీగెలు', 'ముదితవీచి', 'కౌదమవనము', 'కౌదమశుకం' 'పులుగు పొలతులు' వంటివి వీరి రచనకు కొత్తదనాన్ని చేకూర్చాయి.

ఇవి తిర్యగ్జడాలకు సంబంధించినవికాగా మానవపరంగా 'చెలీ' అన్న సంబోధం విశిష్టంగా కనబడుతుంది. 'లలిత' కావ్యంలో నాయిక నాయకునిగూర్చి తలచుకుని వ్యథచెందుతున్న సందర్భంలో.... 'వెతల గాసిలితిన్ నినుబాసినెచ్చెలీ!' అని నాయికతో పలికించారు. తృణకంకణంలో నాయిక నాయకునితో ఆతని తల్లి కోర్కెను తీర్చవలసిందని బోధించే సందర్భంలో.... 'చెలీ!యిటులౌనె దయాను వర్తనల్' అని నాయకుని 'చెలీ!' అని సంబోధించినట్లు వ్రాశారు. ఈ పదాల ప్రయోగాలు వ్యాకరణరీత్యాగాని, శబ్దార్థవిషయంలోకాని దోషాలు కాకపోయినా ఈవిధమైన ప్రయోగాలు అరుదని చెప్పవచ్చు.

వీరి రచనకు కొత్తదనాన్ని కలిగించిన వాటిలో ప్రధానంగా చెప్పదగ్గవి భావాలు. వీరి భావనారీతిలో కొత్తదనం క్రింది సందర్భాలలో స్పష్టంగా కనబడుతుంది.

ఈ సందర్భాలలో భూదేవి ప్రసూతగా కనబడగా మరొకచోట చిగురు టాకులు పసిపాపల పొత్తిళ్ల భావన కలిగించాయి.

'ప్రసవించిన ఎల తీవెల
పసిపాపల పొత్తులాఱబఱచిన పగిదిన్
మిసమిసల చిగురుటాకులు
పసుపారెడు ఎఱుపు మెఱయ వటవృక్షములన్'[1]

వీరి వాత్సల్యదృష్టికి జగమంతా మాతృత్వభరితమే. కనుకనే వీరిదృష్టిలో 'మామిడి పూలు మోయగా'. రేయి చుక్కల చాయ - దోస తీయని పిందెలను కన్నట్లు కనబడింది. దానిమ్మకు పగడాలకానుపును, శుక్తికి మౌక్తికాల కానుపును, లతకు ప్రసూతిని వీరు భావన చేశారు. సృష్టి సమస్తాన్ని వాత్సల్య దృష్టితో వీక్షించడం వల్లనేమో వీరికి అంతటా పసితనం కనబడింది. వీరి వాత్సల్య నయనాలలోని ఆ పసితనం చాలావాటిలో పసితనం బాల్యం వంటి పదాలుగా వ్యక్తమయింది.

పసి తెమ్మెర, పసికొండ, పసిపచ్చిక, పసి తమలపాకు, పసి పైరగాలి, బాలపుష్పము, బాలమామిళ్లు, బాలపత్రము, పుల్గు బాలెంత, బాల గులాబీలు, బాల లతామతల్లి, కోకిలబాల, కలువపాపలు, బాల శాఖలు, నాగబాలలు, పక్షి బాలికలు, వంటి పదబంధాలు వీరి వాత్సల్యదృష్టికి ప్రతీకలు. మేఘాలు 'నీలాల పుట్టింట నీళ్ళాడ వెళ్తున్నట్లుగా' నదులను 'సస్యములకు పాలిచ్చు వాత్సల్యవతుల' గాను భావించడం కూడా ఇలాంటిదేనసవచ్చు. ఇదే విధంగా-

'నింగి బాలెంత నడికట్టుకొంగులనగ
జారు సతసీ పయోదప్రసన్న రేఖలు....'[2]
అని నింగి బాలెంతగా వీరి భావనకు తోచింది.

---

1. 'శ్రీముఖ' - ఆంధ్రావళి - p. 15.
2. 'కవిత' - జడకుచ్చులు p. 129.

'పంట రాసులపైన పవళించి లేచి
తేట తటాకాల తీర్థమ్ములాడి
వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి....'[1]
'తళ తళలాడే మెఱుపుల జడతో
ఏడు వన్నియల ఒడ్డాణంబును
నింగి నడుమునను సింగారింపగ....'[2]
'మావి కన్నెరికమే మరులు గొల్పెనో నిన్ను
నీ పిలుపుతో మావి నిలువెల్ల పూచెనో....'[3]
'ఎండలో మాడిపోవు లేయిగురులరసి
ఏడ్చు నదుల ప్రేమోదంత మెవ్వడెరుగు....'[4]

అన్నవి కవి ఊహాశక్తిని చూపుతాయి. రాయప్రోలు వారి భావనాబలానికి, కల్పనాచమత్కృతికి చక్కని నిదర్శనాలుగా చెప్పదగ్గవి ఇటువంటి సందర్భాలు. *

వీరి భావవ్యక్తీకరణలో స్వేచ్ఛ స్పష్టంగా కనబడుతుంది. వీరు ప్రయోగించిన పదబంధాలు, ఉపమానాలు ఈ స్వేచ్ఛను ప్రదర్శిస్తాయి. వీరి నూతన భావాలలో, పదబంధాలలో, ఉపమానాలలో కొన్ని వాత్సల్యస్ఫోరకంగా కనబడతాయి. మాతృమహత్త్వకు వీరి దృష్టిలో ఉన్న ప్రాముఖ్యం వల్లనేమో పసిబిడ్డలు, బాలెంతలు ఆలంబనంగా వీరి నవ్యభావవాహిని సాగింది.

"భూదేవి ముఖ ప్రసూత పగిదిన్ జలమాడి
ధరించె పచ్చపూపావడ ...'[5]
'భూసతి ప్రసూతి వేదనమును గ్రహించి....'[6]

---

1. 'సంక్రాంతి' - ఆంధ్రావళి. p. 72.
2. 'తొలిమబ్బులు' - కన్నెపాటలు. p. 26.
3. 'కోయిల' - మిశ్రమంజరి. p. 102.
4. 'స్వప్నకుమారము'. p. 27.
5. 'జన్మాష్టమి' - వనమాల - p. 71
6. 'తెనుగుతోట' - అభినవకవిత - p. 325

* మరికొన్ని ఉదాహరణలు ఒకటవ అనుబంధములో ఇవ్వబడ్డాయి.

'తల్లి రెక్కల క్రింద మెత్తని సువర్ణ
తూలికల మైమరచి నిద్దురలు వోవు
కన్నె పారావతము భాతి కదలదాయె
నా యహంకారమేమి బంధంబొ కాని-'[1]

'అబల నధరము నంటి యంటక
ఆరిపోయెడి ముద్దులట్టుల
తాకి తాకక ఒడల పులకల
తడియ నొలయు సమీరముల్.'[2]

'ఆరిపోవును చుంబనము వలె శబ్దమెప్పటి కప్పుడే.'[3]

మాఘ మాసంలో చెల్లాచెదరుగా కనిపించే మేఘశకలాలు కొప్పుకు అందని కురుల లాగా తోచగా సంక్రాంతి మబ్బులు పాలు తీసిన పొదుగుల్లాగా రాయప్రోలు వారి భావనకు తోచాయి. ఇటువంటివి సాధారణ విషయాలకు సంబంధించిన ఉపమానాలు. సామాన్య విషయాన్ని అసాధారణమైన తాత్త్విక ఉపమానంతో గంభీరంగా చెప్పిన సందర్భం క్రింద ఉదహరించినవి.

'కొమ్మకొన నందగించిన క్రొత్త పువ్వు
ఎందరెందరి కెన్నెన్ని చందములను
భిన్న భిన్న భావనలు మొలిపించు నపుర
ఐక్యగతియె ద్వైతాద్వైతమైన రీతి.'[4]

ఇక్కడ సామాన్యమయిన పుష్పం తాత్త్విక సత్యంతో సామ్యం పొందగా మరొక సందర్భంలో తాత్త్విక సత్యాన్ని అతి సామాన్య విషయంతో ఉపమించడం కనబడుతుంది.

---

1. ధ్యాన గీతము - జడ కుచ్చులు - p. 114.
2. 'ప్రభాతము' - ఆంధ్రావళి - p. 77.
3. 'ఆషాఢి' - మిశ్రమంజరి - p. 84.
4. 'ఎవరు' - జడకుచ్చులు - p. 136.

"నిండు గృహదీర్ఘికల నున్న నీరజముల
కడుపుచల్లనిపంట నావెడలుచున్న
మదవదదళికుల సంతానము"....[1]

తామర పూలలో నిద్రిస్తాయని ప్రాచీనులచే భావింపబడిన తుమ్మెదలు కూడా తామరల సంతానంగా వీరికి గోచరించింది.

నిశలు హసించడం, నిశలు పులకించడం, అందచందము లారడం, కథల జడలల్లడం, చీకటి చిందులు వేయడం, వేదుకలు విప్పారడం, నేర్పులు పుష్పించడం, చీకటి పడగలెత్తడం, వయసు పూయడం, శశి వికసించడం, మబ్బులు మంచు కన్నీళ్ళు కార్చడం- ఇటువంటి భావాలు వీరి భావనా రీతిలోని విశిష్టతకు మచ్చుతునకలు.

వీరి రచనలో కనబడే మరొక విశేషం విచిత్రమయిన ఉపమానాలు. రాయప్రోలు వారు ప్రయోగించిన ఉపమానాలలో అధిక భాగం అతి సాధారణ విషయాలకు సంబంధించినవి. చెప్పే విషయం ఎటువంటిదయినా అతి సామాన్యమయిన ఉపమానంతో సామ్యం చెప్పడం వీరి ఉపమానాలలోని విశేషం. అందు వల్ల ఈ ఉపమానాలు సామాన్యులకు కూడా విషయ స్వరూపాన్ని విస్పష్టం చేయడానికి సహాయపడతాయి.

'అజు సృష్టికంటె కవిత
ల్లజు శిల్ప సృజన విలసదలంకృతమై ఆ
రజ మగునంటివి దువ్విన
నిజకుంతలములు జడ రమణించెడి కరణిన్.'[2]

'కాన్పులుడిగిన ఈ గోవు కదలలేక
వణకుచున్నది నా వచః ఫణితి పగిది'[3]

1. 'తెనుగుతోట' - అభినవకవిత p. 325.
2. కృష్ణాష్టపది - మిశ్రమంజరి - p. 36.
3. 'బుద్ధ దీక్ష' - ఆంధ్రావళి - p. 65.

పంచదారను పంచవచ్చెను
చందమామ జగంబునన్'[1]

ఇక్కడ సూచనప్రాయంగా ఉన్న ఇతర ఆధారాలనుబట్టి, పాలవంటి వెన్నెలను, నల్లని ఆవువంటి ఆకాశాన్ని ఉపమేయాలుగా భావించాలి.

....'జలకమాడిన నభోజనని ఘనాలక
లార విప్పిన వేళ నాడు నెమలి'[2]

నెమలి ఆట ఆధారంగా 'మేఘాలు' అన్న ఉపమేయాన్ని 'అలకల' ఉపమానంతో అన్వయించుకోవాలి.

'తెల్లమబ్బులు నడుచు నల్లమైదానమున'[3]

నల్లమైదానం అనడంలో 'ఆకాశం' అన్న ఉపమేయం ధ్వనిస్తుంది.[4]

వీరి కావ్యభాషలో ఇటు నవ్యతాప్రీతి, అటు వైదిక సంప్రదాయాభిమానము రెండూ మిశ్రితమయ్యాయి. సామాన్య జన వ్యవహారంలో ఉండే చిన్న చిన్న పదాలను, లోకోక్తులను, సామెతలను కలిగి ఉండి తెలుగు నుడికారాన్ని సజీవంగా ప్రత్యక్షం చేస్తుంది వీరి భాష. అటు వైదిక సంస్కృతి సంప్రదాయాలకు సంబంధించిన పదజాలంతో వైదిక వాతావరణాన్ని చూపుతుంది. కనుకనే వీరి శైలి ఒకసారి చాలా సరళంగానూ కనబడుతుంది. మరొకసారి అతి గంభీరంగానూ కనబడుతుంది. దానిలో పదలాలిత్యమూ ఉంది, పదగాంభీర్యమూ ఉంది. ఆ రెండు లక్షణాల విచిత్ర సమ్మేళనంవల్ల వీరి శైలికి, కావ్యభాషకు ప్రత్యేకత చేకూరింది.

---

1. 'బ్రహ్మముడి' - మిశ్రమంజరి - p. 129.
2. 'రామలింగారెడ్డి' - ఆంధ్రావళి p. 56.
3. 'విజయదశమి' - మిశ్రమంజరి p. 73.
4. మరికొన్ని ఉపమానాలు ఒకటవ అనుబంధములో చేర్చబడ్డాయి.

'ప్రత్తి విత్తు దుకూలమై పరిణమించు
మాద్రి, పచ్చిక పాలుగా మాఱురీతి
సృష్టి బహు రూపముల ఫలియింప, కర్మ
లమృత భాగ్యానుభవమున కగుచునుండె.'[1]

ఈ విధంగా సామాన్య విషయానికి తాత్త్విక ఉపమానాన్ని, తాత్త్విక విషయానికి సామాన్య ఉపమానాన్ని చూపారు.

ఉపమానాన్ని ప్రధానంచేసి చెప్పడం, ఉపమాలంకారాన్ని ప్రయోగించడంలో వీరు అనుసరించిన ఒక కొత్త పద్ధతి. ఈ పద్ధతిలో ఉపయేయం వాచ్యంగా పద్యంలో కనబడక ధ్వని ప్రాయంగాసూచింపబడుతుంది.

'కలువలు పరచిన కంచు కంచముల
పెరుగన్నము తినె ప్రియ చకోరములు'-[2]

ఇక్కడ వెన్నెలకు, కలువలకు, చకోరాలకు ఉన్న సంబంధాన్నిబట్టి ఉపమేయాన్ని ఊహించాలి. రాత్రిపూట వికసించే కలువలను కంచాలుగా భావించి చకోరాలు వెన్నెలను భుజిస్తాయన్న కవి సమయాన్ని ఆధారంగా గ్రహించినపుడే పెరుగన్నం అన్న ఉపమానానికి మూలంఅయిన వెన్నెల అన్న ఉపమేయం స్ఫురిస్తుంది. దీన్ని గూర్చి రాయప్రోలు వారు.... "ఉపమేయాన్ని చెప్పకుండా ఉపమానాన్నే ప్రధానం చేసి చెప్పాను. ఇట్లా చెప్పడాన్ని సంప్రదాయజ్ఞులు అంగీకరించరు. తెలుగు కవిత్వంలోకి ఈ విధానాన్ని తెచ్చింది నేనే"[3] అన్నారు.

ఇదే పద్ధతిలో చెప్పిన మరొక సందర్భం -

'పడుచు కరియావులను పిండిన
పాలు పోయుచు కలువ కడవల

---

1. ధ్యానగీతము - జడకుచ్చులు p. 119.
2. Interview with Sri 'Rayaprolu' - Oct. 79.
3. 'రాయప్రోలుతో ముఖాముఖి' - విమర్శిని-4, p. 36. (అనుబంధం)

పిండి, నానాసుఖాలు, కైకొనలు, ప్రసన్నమనస్సు, అరసందె, చిత్రభిత్తిక, మండు శోకము, చిట్లిన నవ్వు, లజ్జా లతికలు వంటి అరుదైన పదబంధాల నెన్నిటినో వీరి రచనల్లో చూడవచ్చు.[1] లెక్కకు మిక్కిలిగా కనబడే వీరి పదబంధాలలో కొన్ని తదనంతర కవుల ప్రయోగాలతో స్థిరపడిపోయాయి. పూల సంకెళ్ళు, వలపు వాకిలి, సెలయేటి పాట, మబ్బుల ముసుగు, వెండితెర, చూపులవల, చూపుల గాలం, భావదాస్యము, వలపుటుచ్చు, నవ్వుపువ్వు వంటివి అధిక ప్రచారంవల్ల రాయప్రోలు వారి నూతన ప్రయోగాలా అనే సందేహాన్ని ఈనాడు కలిగిస్తున్నాయి.

నిత్య వ్యవహారానికి సన్నిహితమైన సజీవ భాష వీరి కావ్యాల్లో కనబడు తుంది. ప్రసిద్ధమైన సామెతలు, లోకోక్తులు, నానుడులు ప్రయోగించి తెలుగు భాష వన్నె తగ్గకుండా ప్రదర్శించారు. 'మ్రాగన్ను వేసితిమి, వచ్చిందాలటె ఓ భామా!, ఏటికి గుంజాటనల్, దేవతల కండ్లు కుట్టెను, కొండ యెక్కె నఖండ దీపము' వంటి ప్రయోగాలలో తెలుగు నుడికారపు సొంపు స్పష్టం అవుతుంది. 'దశ త్రింశల్లక్ష జన ప్రసన్న రసనా దేవాలయాభ్యంతర ప్రాంశు ప్రార్థన గీతము' వంటి సుదీర్ఘ సమాసాలు చాలా అరుదుగా కనబడతాయి. అధిక భాగం వీరి శైలి సరళ సుందరంగా గోచరిస్తుంది.

వీరి కావ్య భాషలో వైదిక పదాలు అడుగడుగునా ప్రత్యక్షం అవుతాయి. రచనలలో అతి విస్తారంగా కనబడే వైదిక పదజాలం వీరి సంప్రదాయాభిమా నాన్ని సూచిస్తుంది. ఈ పద జాలం వారి భాషకు భావానికి ఒక విధమైన సౌంద ర్యాన్ని, గాంభీర్యాన్ని చేకూరుస్తున్నది. వైదిక పద ప్రయోగం వైదిక విషయా లలో వారి అభినివేశాన్ని ప్రదర్శించడమే కాక కావ్యగత విషయానికి ఒక విధమైన పవిత్రతను సహితం ఆపాదిస్తోంది. ఈ పదాలను సాధికారంగా ప్రయోగించడం వీరి ప్రత్యేకత.

వీటిలో కొన్ని వైదిక కర్మలతో సంబంధం కలవి, కొన్ని వైదిక సాహి త్యానికి చెందినవి. పుణ్యాహ వచనం, ప్రతిష్ఠాపనం, అభిషేక మంగళక్రతువు, ఉపాసన, పూర్ణాహుతి, అభిఘరించడం లాటివి కర్మలకు సంబంధించిన పదాలు.

---

1. ఇటువంటి మరికొన్ని పదబంధాలు ఒకటవ అనుబంధంలో ఇవ్వబడ్డాయి.

వీరి కావ్య భాషకు కొత్తదనాన్ని చేకూర్చిన వాటిలో పదబంధాలు ప్రముఖమైనవి. వీటిలో కొన్ని వ్యాకరణ నియమాలకు అందనివి కూడా ఉన్నాయి. వ్యాకరణ నియమాల కంటె శ్రవణ సుభగత్వానికే అధిక ప్రాధాన్యాన్నిచ్చే సుబ్బారావుగారు[1] వ్యాకరణశాస్త్ర రీత్యా దోషాలయిన వాటిని కూడా స్వేచ్ఛగా ప్రయోగించారు. ఎటువంటి పదబంధాలైనా వీరి శైలీవైశిష్ట్యంవల్ల ఆ సందర్భంలో కలిసిపోయి ఎంతో సహజంగా ఉంటాయే కాని ఎబ్బెట్టుగా తోచవు.

........'మధు మాసపు కన్నె యెండలో
ఎలకొబ్బరి తోట నీడలన్
పసుపాడిన నిమ్మ చెంగటన్
వయసారిన మావి పొత్తునన్
ఎలకోయిల యీల నేర్పగా
పసి తెమ్మెర సేద తీర్పగా
మనసోపని పచ్చి ముచ్చటల్
తనివోవగ చెప్పికొందమో'[2]

ఈ సందర్భంలో దాదాపు ప్రతిపాదంలో ఒక కొత్త పదబంధం ఉన్నా ఆ పద్యపు నడకకు అవి వింత అందాన్ని కలిగిస్తున్నాయి.

జ్ఞాపనా సోపానములు, చాతక ముని యతి, పచ్చిపడుచు పదాలు, కాపులేదతుక, కటికి నట్టెండ, వాఙ్మయ కుముదము, చిత్తబలము, జూబాటలు, పూల

1. "వదలరీ వృత్త పద మృదు బంధమెందు
నవ్వులు రసవద్వాక్య సంధానమందు
సంధులు విసంధులైనను, సాంస్కృతములు
దేశ్యములతోడ సమసించి తీపె గొనిన.
.......శ్రవణ సుఖంబు పాయదేని
అవిరళింతు రీ భంగిమ నాధునికుల."
రమ్యాలోకము p. 25.
2. 'పదవే చెలి' - వనమాల p. 30.

....'శబ్దదర్శన పటిష్ఠుల తపోవరేణ్య వైదగ్ధ్యములన్.'[1]

....'కవిత బ్రహ్మానంద కామ్యక్రతు ఫలార్థహవిస్సువంటిది.'[2]

'సామము పాడుచు త్రావిరి
సోమము స్వర్లోక కాంక్ష సుడియగ మన మా
తామహ పితామహ ప్రపి
తామహు లానందవల్లి తలిరింప సుధీ!'[3]

ఈ విధంగా వీరికి వైదిక వాఙ్మయంతో ఉన్న సంబంధాన్ని, అభిమానాన్ని చూపే సందర్భాలెన్నో వారి కావ్యాలలో కనబడతాయి.[4] ఇటువంటి పదాలనే

---

గురురాహవనీయస్తు సాగ్నిత్రేతా గరీయసి." (మనుస్మృతి 2-231) సంకేత పదకోశము - సంపాదకుడు : ఆర్. శ్రీహరి - p. 13లో ఉల్లేఖించబడింది.

1. మాధురీ దర్శనమ్ - p. 10.
2. నవరాత్రి - మిశ్రమంజరి - p. 72.
3. మాధురీ దర్శనమ్ - p. 13.
4. 'అభినవ శ్రీచక్ర మభయముద్ర వహింప భద్రపద పుణ్యాహవాచనము శ్రుతినింప....తుంగభద్రా పూర్ణమంగళోదకములతో సాగినది.'
'నీ రాష్ట్రి సంప్రతిష్ఠాపనము' .... ('ఆంధ్రాభిషేకమ్' - మిశ్రమంజరి)
'అనంత భూతంబులలో రాగిలు ప్రణయ మధు హవిర్భాగము' .... ('ఫాల్గుని' - వనమాల).
'కామకోటి పీఠాధిపస్వామి అయిన అతను నభిషేక మంగళక్రతువునందు'- ('ఫాల్గుని - వనమాల).
'అంతఃకరణమందు ఆనందవల్లినే పూయించి కాయించి పూర్ణక్రతువు సల్పె' - ('ఈ గీతము' - వనమాల).
'స్వీకరింపుమయ్య కన్నబిడ్డ ఇచ్చు కడసారి వందనంబు నీశ్వరార్పణం బటంచు' - (స్నేహలత).
'ఈ దక్షిణాగ్ని కలుషితాచారములు కాల్చి వెలుగు గాక'- (స్నేహలత).
'మాధుర్యోపాసకులయిరి సుకవులుర్విపయి' - (మాధురీ దర్శనమ్).

ఈ పదాలను వారు ప్రయోగించడంలో ఒక విధమైన సౌలభ్యం కనబడుతుంది. అవలీలగా ఇతర పదాలతో కలిపి నాటిని సుబ్బారావు గారు ప్రయోగిస్తుంటారు.

.........'ప్రేమారాధన మాచరింతు లలితార్తి స్వేద లీలాదశల్
కామారార్పణమంచు బాష్పకణముక్తా మాలికన్ ద్రిప్పుచున్."[1]
'నీ నామ జపమాల నిష్ఠతో త్రిప్పితిమి.'[2]
'భవత్స్వాతంత్ర్య పుణ్యాహవాచన పారాయణ.'[3]
'స్వతంత్రోదయావభృథంబు.'[4]

ఈ విధంగా ఆరాధనం, జపం, పుణ్యాహవాచనం, పారాయణ. ఉపాసన, క్రతువు, అవభృథం వంటి వైదిక కర్మల పదజాలాన్ని శైలీ భంగం కాకుండా ధారావాహికంగా ప్రయోగించడం రాయప్రోలువారి ప్రత్యేకత. ఇటువంటి కర్మలకు సంబంధించిన పదజాలమే కాక నీవారాగ్రము, వరేణ్యులు, పారణముచ్చిచ్చు దక్షిణాగ్ని, హవిర్భాగం, ఆనందవల్లి, దీక్షితుడు, సోమామృతంవంటి ఎన్నో వైదిక శబ్దాలు వీరి సాహిత్యంలో ప్రత్యక్షమవుతాయి. వైదిక సాహిత్యానికి, సంప్రదాయానికి సంబంధించిన ఇటువంటి పదాల ప్రయోగాన్ని ఈ విధంగా చూడవచ్చు.

'దేశ ఋణమును....తీర్పగలిగిన దీక్షితుడనని తెలిసి తెలిపే సమయమోయ్.'[5]

*'మూడు వన్నెలును ముచ్చిచ్చులుగా....'[6]

---

1. స్వప్న కుమారము - p. 22.
2. 'సత్రాకజయంతి' - ఆంధ్రావళి - p. 86.
3,4. 'ఆంధ్ర నవమి' - మిశ్రమంజరి - p 10.
5. భద్రయాత్ర - మిశ్రమంజరి - p. 25.
6. భద్రయాత్ర - మిశ్రమంజరి - p. 21.
* గార్హపత్యము (పిత), దక్షిణాగ్ని (మాత), ఆహవనీయము (గురువు) 'పితా వై గార్హపత్యోఽగ్నిర్మాతాగ్నిర్దక్షిణః స్మృతః

ఒక ఆనందాన్ని అనుభవించిన తరువాత దానికంటె మిన్నదయిన మరొక ఆనందాన్ని పొందాలని వాంఛిస్తాడు. దీనివల్ల అతడు పొందిన ఆనందం తాత్కాలికం కూడా అవుతోంది. అది చివరికి దుఃఖరూపమయిన వికారం కూడా పొందే అవకాశం ఉంది. కాబట్టి ఆ ఆనందం అసంపూర్ణం ఈ విధంగా ఒకదాన్ని మించిన మరొకదాన్ని పొందాలనే కోరికవల్ల పీటని మెట్లుగా 'ఆనందసోపానములు' అన్న పదానికి అన్వయించుకోవచ్చు.

తాత్త్వికంగా ఆలోచించినపుడు 'ఆనందం' అనగానే తైత్తిరీయోపనిషత్తులోని బ్రహ్మానందవల్లి స్ఫురిస్తుంది. అక్కడ మనుష్యుడు, గంధర్వుడు, పితరుడు, ఆజానజుడు, కర్మదేవుడు, దేవుడు, ఇంద్రుడు,బృహస్పతి, బ్రహ్మముల ఆనంద వైశిష్ట్యం ఒకదానికంటె మరొకటి అధికమంటూ చెప్పి బ్రహ్మానందం నిరతిశయ సుఖ స్వరూపంగా చెప్పబడింది.[1] పరమానంద స్వరూపమైన బ్రహ్మానందం శాశ్వతమయింది. పొందే వ్యక్తి, పొందడం, పొందబడేది అన్న త్రిపుటి లేని అద్వైత స్థితి అది.

ఆనందం-విషయానందం, ఆత్మానందం అద్వైతానందం, నిజానందం, ముఖ్యానందం, బ్రహ్మానందం, వాసనానందం, విద్యానందం, అని విభజింపబడింది. దీనిలో కూడా భోగవస్తుజ్ఞానమే లేని విద్యానందం పరమోత్కృష్టమయింది.[2] ఈ భావాలను గ్రహించినపుడు పై ఉదాహరణకు ఈ విధంగా అర్థం చెప్పుకోవచ్చు. అఖండమూ, అద్వైతమూ శాశ్వతమూ అయిన ఆనందాన్ని పొందడానికి మానవ ప్రయత్నంగా మనుష్యుడు కృషి చేస్తున్నాడనీ; ఉన్నతోన్నతమైన ఆనందాలనుపొందే ఆధ్యాత్మిక చింతనతో వాటిని అధిగమించే ప్రయత్నంలో మానవుడు అలసిపోతూ కూడా ముందుకు సాగుతున్నాడనీ అన్వయం చేసుకోవచ్చు. 'ఆనంద' పదంలో దివ్యానంద స్ఫురణను గ్రహించవచ్చు.

---

1. బ్రహ్మానందవల్లి - అష్టమానువాకం.
2. "సాత్త్వికస్థితి యందు బ్రహ్మభాసము గల్గినప్పుడు గలుగు మానసిక సుఖము విషయానందమగును. సమాధి స్థితి యందు గలుగు సంవృత్తి ఆత్మానందమగును. ఇది ఆత్మసాక్షి మాత్రమనెడి భావంబు గల్గుటవలన జనించు సుఖరూపముగా నున్నది. భోక్తృ భోగ్య రూపములైన ద్వైత

కాక మంత్రశాస్త్రానికి, తంత్రశాస్త్రానికి వేదాంతానికి సంబంధించిన పదాలను కొన్నిటిని వీరు ప్రయోగిస్తుంటారు. అటువంటి పదాలు సామాన్యులకు వ్యవహార ప్రసిద్ధమయిన సాధారణార్థంలో అవగాహన అవుతుండగా తాంత్రిక సంప్రదాయాల నెరిగినవారికి, మంత్రశాస్త్రంతో పరిచయం ఉన్నవారికి, వేదాంతవిదులకు వాటిలో విశేషార్థం స్ఫురించే అవకాశం ఉంది. అవి కొన్నిచోట్ల సాధారణార్థంతోనూ, కొన్నిచోట్ల తాత్త్వికార్థంతోనూ కూడి ఉంటాయి. కొన్ని సందర్భాలలో రెండు అర్థాలూ సమన్వయిస్తాయి. విశేషార్థస్ఫోరకాలయిన ఇటువంటి పదాలలో ఉదాహరణకు 'ఆనంద', 'అమృత' శబ్దాలను గ్రహిస్తే ఈ విధంగా కనబడుతుంది.

లౌకికమైన సుఖ సంతోషాలకు సంబంధించిన మానసిక స్థితికి ఆనందం అన్న శబ్దం వ్యవహారంలో ఉంది. ఇంతేకాక ఈ శబ్దం పారలౌకికమైన పరమానంద స్ఫోరకంగా చిదానందం, సచ్చిదానందం, బ్రహ్మానందం వంటి రూపాలతో తాత్త్వికంగా ప్రసిద్ధి పొందింది. 'ఆనందో బ్రహ్మ' అంటూ ఆనందమే బ్రహ్మంగా చెప్పబడినపుడు దానికి లౌకికమైన వస్తుగతమైన ఆనందం కాక ఆధ్యాత్మిక విషయగతమైన ఆనందం పరమార్థం. ఆనందమే తానుగా తానే ఆనందంగా అద్వైతస్థితిని పొందడమనే పరమోన్నతస్థితిగా బ్రహ్మానందాన్ని ప్రాచీనులు భావించారు. రాయప్రోలువారు-

'మనుజుడానంద సోపానమండలముల
అధిగమించి అధిగమించి అలసిపోయె.'[1]

అని అన్నపుడు మానవుడు సుఖ సంతోషాలను పొందడానికి అనాదిగా కృషి చేస్తున్నాడనీ, శ్రమిస్తున్నాడనీ దానితో అలసిపోతూ కూడా నిరంతరం ప్రయత్నిస్తూనే ఉన్నాడనీ అర్థం చెప్పుకోవచ్చు. సామాన్యుడయిన మానవుడు

---

ప్రేమమంత్ర మహోపాసనామయులగు సవ్యులకు - (రమ్యాలోకము).
చేతమా కుసుమాభిషేకము తెనుగు సంపెగ సామికిన్ - (కన్నెపాటలు).
చేరగ చాతకములు రసపారణకయి - (మాధురీ దర్శనమ్).

1. అర్థమాలలు - వనమాల. p. 43.

ఉంటుంది, కైవల్యప్రాప్తికి కారణమవుతుంది. కాబట్టి ఇక్కడ అమృతశబ్దానికున్న తాత్త్వికార్థము స్ఫురించే అవకాశం ఉంది.

ఈ విధంగా వీరు ప్రయోగించిన రమ్య, మాధురి, కల్యాణశివ, కులార్ణవము వంటి శబ్దాలలో కూడా తాత్త్వికార్థాలు ఇమిడి ఉన్నట్లు కనబడతాయి. దేవీ ఉపాసనా, వైదికసాహిత్యం మీది గౌరవం, లలితాసహస్రనామ పారాయణ, సౌందర్యలహరి, దేవీపంచశతి వంటి రచనలపట్ల అభిమానం ఉండడంవల్ల ఇటు వంటి పదాలు అప్రయత్నంగా దొర్లుతూ ఉంటాయి.

ఇక రాయప్రోలు వారి రచనలలోని ఛందోరీతులను పరిశీలించినపుడు అధికభాగం సంప్రదాయమైన వృత్తాలనూ, జాత్యుప జాతులనూ స్వీకరించడం కనబడుతుంది. సంప్రదాయానుసారం యతిప్రాసాది నియమాలను పాటించిన సందర్భాలే ఎక్కువ. అయితే ఛందో విధానంలో కూడా అక్కడక్కడ కొంత విశిష్టతను చూపించకపోలేదు.

వినసొంపుగా ఉండి పాటకు అనుకూలంగా ఉండే శంకరాచార్యులవారి భజగోవింద శ్లోకాలు వీరిని ఆకర్షించాయి. ఆ ఛందస్సు మీది అభిమానంతో ఆదే రీతిలో సుందరకాండనంతటినీ అనువదించారు. అదే విషయాన్ని-

"తల్లిపాలవలె తనివో త్రావిన
రాయప్రోలు గిరాభ్రమరిని వల
పించె, ధేనువును వేణుగీతివలె
భగవత్పాదుల 'భజగోవిందము'
వినసొంపయి పాడను వాచవి యగు
భణితి చరణ చారణ శింజితములు
అనురణింపగా తెనుగు వీణియను
ప్రతి చేసితినీ శుచిరుచి మత్కృతి."[1]

అంటూ సుందరకాండ ప్రారంభంలో చెప్పారు.

'పదవే చెలి కాళ్ళ గజ్జియల్
రవళింపగ పెదుళ్ళపల్లికిన్.'[2]

1. సుందరకాండ - p. 6, 7.
2. వనమాల - p. 30.

'కర్మలమృత భాగ్యానుభవమున కగుచు నుండె '[1] 'అమృతస్వరూపాచ' అని నారదునిచే భక్తి అమృత స్వరూపంగా భావింపబడింది.[2] 'అమృతాది మహాశక్తి సంవృతా' అని లలితాదేవి స్తుతింపబడింది. ఆ దేవిని పరివేష్టించి ఉండే షోడశ పద్మదళాలలోని షోడశ శక్తులలో అమృతాశక్తి కూడా ఒకటి. ముక్తి, కైవల్యం, అపవర్గ పదాలకు పర్యాయపదంగా తాత్త్వికార్థంలో అమృత శబ్ద ప్రయోగం ఉంది. అమృత శబ్దానికి ఉన్న నానార్థాలలో[3] 'ముక్తిః కైవల్య నిర్వాణ శ్రేయసామృతామ్' అంటూ మోక్షార్థం కూడా ఉంది. మధుర మనీ, సుధ అనీ, శాశ్వతమనీ దానికి సాధారణార్థాలు. పై ప్రయోగంలో 'కర్మల మృత భాగ్యాను భవమునకగుచు నుండె' అని అన్నపుడు మధురమైన భాగ్యాను భవమనీ, శాశ్వతమైన భాగ్యానుభవమనీ, కైవల్యభాగ్యానుభవమనీ చెప్పుకో వచ్చు. పురాకృత కర్మఫలం లౌకిక సుఖ సంతోష భాగ్యానుభవంగానూ

---

భావంబు లేని స్థితిని సాధించునపుడు గల్గు సుఖము అద్వైతానందమగును. ప్రారబ్ద కర్మఫలములైన సుఖదుఃఖంబులకు దూరమై సమత్వ స్థితిలో నున్నపుడు కలుగు సుఖము నిజానందమగును. అహంకార నాశనమగుట వలన నుండు సుఖము ముఖ్యానందము. బ్రహ్మజ్ఞానము వలన కలుగు ఫలము బ్రహ్మానందము. అలసిన బాటసారేదో నొక సత్రమును జేరి సుఖముండునట్లుగా జీవుడు జాగ్రత్స్వప్నావస్థలందలి క్లేశములకు విసిగి బ్రహ్మమునుజేరి శాంతించును. వాసనానందమనగా ప్రారబ్ధకర్మఫలముగా ఆనందమయము నుండి విజ్ఞానమయమునకు బోవునప్పుడు గల్గు బ్రహ్మా నందాభాస మనవచ్చును. ఆనందబోధను విద్యానందమగును. ఇందు భోగవస్తుజ్ఞానమే యుండదు. దీనినే నిర్వికల్ప సమాధి యందురు. ఇందు అనుభూతమగునది తృప్తిగాదు, సంతోషముగాదు, సుఖముగాదు, కేవలా నందము గాదు. తత్త్వమొక్కటియే యగును."

'నారదభక్తిసూత్రములు'-అనువాదకులు: దొడ్ల వేంకటరామిరెడ్డి-p. 60.

1. 'ఎవరు' - ఆంధ్రావళి-p. 119.
2. 'నారదభక్తిసూత్రములు' - 3 వ సూత్రము.
3. "'అమృతం వారి సురయోర్నిర్వాణే చాతి సుందరే అయాచితే యజ్ఞశేషే పుంసి ధన్వంత రౌభవే' దితివ్యాడిః" - అమరకోశం. p. 760.

మాత్రా ఛందస్సునుపయోగించి చాలా గేయాలను వీరు వ్రాశారు. మాత్రా గణాలను ప్రయోగించేటపుడు సర్వసాధారణంగా నియతమైన మాత్రలతో విరిగే పదాలనే ప్రయోగిస్తారు. కాని మాత్రల సంఖ్య పూర్తికావడానికి తరువాతి పదం లోని ఒకటి రెండక్షరాలను కలుపుకొని పదం మధ్యలో విరవడం చాలా తక్కువ సందర్భాలలో తనబడుతుంది. మాత్రాఛందోరచనలలో చాలవరకు అన్ని సంద ర్భాలలోను యతి నియమం విధిగా పాటించారు. ఈ యతి విషయంలో మొదటి అక్షరానికి మైత్రి ఉన్న ఇతర అక్షరాలను ప్రయోగించడానికి అవకాశం ఉన్నా కూడా అదే అచ్చుగాని, అదే హల్లుగాని ప్రయోగించడం ఎక్కువ సందర్భా లలో కనబడుతుంది. ఇవి గేయాలలాగా పాటకు వీలయిన రచనలు కావడంవల్ల ఈ విధమైన అక్షర పునరుక్తి ఒక గమకాన్ని ఇచ్చింది.

> "నవరసమ్ములు నాట్యమాడగా
> చివురు పలుకులు చెవులవిందుగ
> కవితలల్లిన కాంత హృదయుల—....."[1]

అన్న సందర్భంలో న - నా; చి - చె; క - కాం అనేవిధంగా ఒకే హల్లును ప్రయోగించడం లయవిన్యాసంతో సొంపు చేకూరుస్తున్నది. కొన్ని రచన లలో చివరిపాదంలో చివర ఒకటి, రెండు మాత్రలను తగ్గించి వ్రాశారు. ఇలా ఉద్దేశపూర్వకంగా మాత్రలను లోపింపచేసి గతిగమకాన్ని సాధించారు. ప్రాసను గాని, అంత్యప్రాస నియమాలను అంతగా ఈ ఛందోరీతులలో పాటించినట్లు కన బడదు. కాని యతిని ఉల్లంఘించలేదని చెప్పవచ్చు.

మూడు మాత్రలు నాలుగు మాత్రలతో 3 + 4; 3 + 4 మొత్తం 14 మాత్రల పాదాలు మూడు, చివరిపాదంలో 3 + 4;3 + 2 మొత్తం 12 మాత్రలు. (చివరిపాదం చివర 2 మాత్రల లోపం)తో, 8 వ మాత్ర యతిగా పాటించి దేశి ఛందోరీతిలో చాలా గేయాలు వ్రాశారు.[2] 'తమ్ముడా', 'ప్రభాతం', 'యాత్ర' 'మాంచాల', 'శ్రీరవ్యాత్', 'శుభమ్', 'ఆషాఢి', 'ఫాల్గుణి', 'త్యాగరాయస్వామి' 'మంగళ మాఘమ్', 'ఉగాది', సంక్రాంతి సంబరము', 'బ్రహ్మముడి', 'నవ రాత్రి' వంటివి ఈవిధమైన ఛందస్సుతో వ్రాసిన రచనలలో ప్రముఖమైనవి.

నాలుగు మాత్రల గణాలతో పదహారు మాత్రల పాదాలతో నడిచిన ఖండి కలు 'మన్మథావాహన', 'ఉత్కంఠ' వంటివి. వీటిలో తొమ్మిదవమాత్ర యతి స్థానంగా పాటింపబడింది.

---

1. 'తమ్ముడా' - ఆంధ్రావళి p. 27.
2. ఇవి ముత్యాల సరాలకు సన్నిహితమైనవి.

అనే ఖండికను సంస్కృతంలోని 'వియోగినీ' వృత్త ఛందస్సులో వ్రాశారు. మాత్రా ఛందస్సు లాగా లయబద్ధంగా గేయరూపం నడవడం వల్ల ఈ వృత్తపు నడక వీరిని ఆకర్షించి ఉంటుంది. రాయప్రోలు వారు ఈ ఖండికలో యతి నియమాన్ని పాటించారు.

ప్రాచీన ఛందస్సులోని పద్యాలలో కొన్ని సందర్భాలలో వీరు పాద నియమాన్ని పాటించలేదు. 'చిగురుల పూవులన్ దరహాసింతువు'[1] అనే చంపకమాలా వృత్తాన్ని ఆరు పాదాలతో వ్రాశారు. 'సతమున్ ధేనువకొండవారి నిజవాసం బందు'....[2] అనే మత్తేభవృత్తాన్ని ఐదు పాదాలతో వ్రాశారు.

"ఆ మహాకవి వాల్మీకి కవల నెవ్వ
డే నొకడు ప్రతిభానంత్యమియ్యకొనిన
ఏతదానంత్య మక్షయమై తలిర్చు."[3]

అనే తేటగీతిని మూడు పాదాలతోటే వ్రాశారు. 'తెనుగుతోట'లో తేటగీతి పాదనియతిని పూర్తిగా ఉల్లంఘించారు. ఆ పద్యాలకు వారి భావసంపూర్తిని అనుసరించి పాదనియతి ఏర్పరుకున్నట్లు కనబడుతుంది. రెండు, మూడు, ఐదు, ఆరు, ఏడు పాదాలతో ఉన్న తేటగీతి పద్యాలిందులో కనబడతాయి.

మత్తేభ వృత్తరచనలో యతి ప్రాసలను ఉద్దేశపూర్వకంగా వదలి 'దూత మత్తేభము'ను వ్రాశారు. దీనిని గూర్చి రాయప్రోలువారు 'నా రచనలన్ని యతి ప్రాసలతోనే సంవృత్తమయినవి. కాని ఈ కావ్యములో మొట్ట మొదటి పద్యం యతి ప్రాసలు లేకుండా ఉన్ముక్తమయింది. రెండు, మూడు పద్యాలు అలాగే నడిచినవి. ఆ పయిన యతి ప్రాసలను నియతములు పాటింపక వ్రాసితిని. ఆలంకారికులు ఎవరునూ రసాధికరణ విచారణలో యతిప్రాసల ప్రసక్తి తవ్వ లేదు. కాగా పద్యరచనలో వాటిని వదిలిపెట్టితే ఏదో లోపము కనిపించవలెను. లేదా వికృతము కావలెను. అది యేమిటో తెలుతుందని తర్కించుచుంటిని ... మేఘదూత........లాంటి కృతిని సంయమముతో, శ్రద్ధాసక్తులతో తెనుగులోనికి, యతులను వదలి, ప్రాసలకోసం ప్రయాసపడక తీసుకొనివస్తే ఎలా పరిణమిస్తుంది.? .......అని మథనపడ్డాను కృతిని ఈ రీతిలోనే యుంచి రసజ్ఞుల ముందుంచితే వారే ఔగాములు తేల్చగలరని తుదకు ప్రకటించితిని"[4] అని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

---

1. వనమాల - p. 15.
2. వనమాల - p. 39.
3. జడకుచ్చులు - p. 160.
4. దూతమత్తేభము - ఆముఖము.

'నీ సిగపూల సువాసన లలకల
స్నేహ కుటిలములు భామా - ఇటు
చెలుగును వీధుల, భామా!'[1]

ఇక్కడ మొదటిపాదం పదహారు మాత్రలతో వ్రాసి రెండోపాదంలో రెండుమాత్రలు లోపింపచేసి మూడోపాదంలో మరి రెండుమాత్రలు (మొత్తం నాలుగు మాత్రలు) తక్కువచేసి వ్రాశారు.

ఐదు మాత్రల గణాలతో పాదానికి ఇరవై మాత్రలనుంచి 'శ్రీ శివశంకర శాస్త్రి', 'సోదరీ సోదరా', 'కోయిల' 'మీరాదేవి గేయము' అవసాన సమర్పణ వంటి రచనలుచేశారు. 'శ్రీ రవీంద్రకవి', శ్రీమతి సరోజినీదేవి' వంటివాటిలో చివరి రెండుమాత్రలు తగ్గించారు. 'వాణి'లో ప్రతి రెండోపాదంలో చివరి మాత్రను లోపింపచేశారు. ఐదు మాత్రల గణాలనే వాడుతూ పాదానికి పది మాత్రలే ఉంచి నాలుగు పాదాలతో 'శ్రీ రాధాకృష్ణ మహోదయులకు' వ్రాశారు.

చిల్కలో పది మాత్రల పాదాలు మూడింట తరువాత నాల్గవ పాదం 20 మాత్రలతో వ్రాశారు. 'ఈ గీతము'లో ఇరవై మాత్రల పాదాలు నాలుగు, పది మాత్రల పాదాలు నాలుగు చొప్పున వ్రాశారు; 'పాలబాన' 'సత్రాజయంతి'లో ఇరవై మాత్రల పాదాలేకాని మూడుపాదాలే ఉండేట్లు వ్రాశారు.

'ఊరి కావల చెరువులో నీరు తెత్తురు నిరతమున్
జారు సందెలు మెరయగా పల్లె పడుచులు కడవలన్'[2]

అనే రచనలో $3 + 4 + 5 = 12$ మాత్రాగణాలను అదే క్రమంలో వాడారు. ప్రతిపాదంలో 12 మాత్రలు తరువాత 13వ మాత్రను యతిగా పాటించారు. మిశ్రగతిలో $3 + 4$ మాత్రల గణాలతో వ్రాయడం ఎక్కువగా వాడుకలో ఉంది ఇలా మూడు రకాల గణాలను కలిపి వ్రాయడం ఒక విశిష్ట ప్రయోగంగా కనబడుతుంది. దీనివల్ల ప్రత్యేకమైన నడక గేయానికి ఏర్పడింది.

ఈ రకంగా రాయప్రోలువారి ఛందోరీతులలో విశిష్టత కనబడుతుంది. ఈ ఛందో విధానం గతిగమకాన్ని, లయవిన్యాసాన్ని సాధించగా భాష, భావాలు, భావాభివ్యక్తి వంటి విషయాలలో వీరి ఉక్తివైచిత్రి కవిత్వానికి కొత్తదనాన్ని చేకూర్చింది. వీరి కావ్యాలను పరిశీలిస్తే కొత్తదనంతోపాటుగా ప్రముఖంగా కనిపించే మరొక ప్రధాన లక్షణం తెలుగు దనం.

1. 'సరాగం' - మిశ్రమంజరి - p 137.
2. 'పల్లె పడుచు' - మిశ్రమంజరి p. 140

# రాయప్రోలువారి రచనలలో తెలుగుదనం

రాయప్రోలువారు తెలుగుభాష అన్నా, తెలుగుదేశం అన్నా, తెలుగు ప్రజలన్నా పొంగిపోతుంటారు తెలుగంటేనే పరవశం పొందే వీరి హృదయపు పులకింత తెలుగుదనంగా వీరి కవితల్లో ప్రత్యక్షం అవుతుంది. తెలుగుతల్లి వీరి ఆరాధ్య తెలుగు కవులు అభిమానులు, తెలుగుభాష అమృత తుల్యం. కనుకనే 'తల్లినుడి కంటె పరమామృతం లేదనీ', 'భాష కంటె నవ్యులకు తపస్సులేదనీ'[2] అన్నారు.

'ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో ఇందు పుట్టినాడ
కలదయేని పునర్జన్మ కలుగు గాక
మధుర మధురంబయిన తెనుగు మాతృభాష'[3]

జన్మజన్మలకూ తెలుగునే మాతృభాషగా పొందాలన్నది వీరి ఆకాంక్ష. తెలుగు దేశంలో జన్మించడం అభిమతం. వారు ఇంతగా అభిమానించిన తెలుగుభాష తియ్యదనాన్ని కవితల్లో చాటి చెప్పారు. మాధుర్యపు అనుభూతి ఎవరికివారు చవిచూడగలిగింది. మాటలతో ఎదుటివారికి వ్యక్తం చేయడం కష్టం. అటువంటి మాధుర్యాన్ని రసవత్తరంగా-

"వంశిన్ వంచి మృణాళమున్ మెలచి పక్వద్రాక్షనెండించి, వా
గంశల్ మార్దవ మాధురీ సుభగ విన్యాసంబు జిల్కన్ దశ
త్రింశల్లక్ష జనప్రసన్న రసనా దేవాలయాభ్యంతర
ప్రాంశు ప్రార్థనగీతమైన తెనుగుం జల్కన్ ప్రశంసించెదన్."[4]

---

1,2. రమ్యాలోకము p. 7.

3. రమ్యాలోకము p. 6.

4. 'తెనుగుమాన్యము'-ఆంధ్రావళి - p. 39.

ఇవే సుబ్బారావు రసమయ హృదయాన్ని ప్రేరేపించినవి... తృణకంకణంలో ఆ తరుణ ప్రణయిని - "అడుగులు బొబ్బలెత్త వదనాంచలమందున చిన్ని చెమ్మటల్ మడుగులుగట్ట" 'ఇసుక దిగబడు నడుగుల నీడ్చుకొను'ట కన్నులకు గట్టినది."[1] కనుకనే వీరి రచనలు తెలుగుదేశపు ప్రకృతికి నిలయంగా నిలబడతాయి. వీరి రచనల్లోని పొడుపుచేర్లు, దీర్ఘికలలో ఊరే జలాలు, సొనల కిరువైపుల పెరిగిన పచ్చని పచ్చిక బీళ్ళు, మట్టిచెట్లక్రింద ఇసుకపడకలు, మల్లె పందిళ్ళు, ఆ పందిళ్ళక్రింద చీర ఒడిపట్టి మొగ్గలుకోసే స్త్రీలు తెలుగుదేశానికి-ముఖ్యంగా బాపట్ల ప్రాంతాలకు సజీవ రూపకల్పనలు. జొన్నచేలు, అరటి తోటలు, తమలపాకు తోటలు, నిమ్మ, నారింజ, దబ్బ చెట్లు తెలుగుదేశాన్ని ప్రత్యక్షం చేస్తాయి "ఈ కావ్యము (తెనుగు తోట) చదువువారికి తెలుగుదేశము ప్రత్యక్షమగును. బాపట్ల, చీరాల, వేటపాలెము ప్రాంతములవారికే సొనలఅందము తెలియును. అవి ఆకస్మికముగా నిసుక పడకల జీల్చుకొని పుట్టి, లోతులేని స్వచ్ఛజలముతో ప్రవహించును. సొన రెండు ప్రక్కలను పచ్చగా పచ్చిక పొడలు, తోటలు పెరుగును....

'వీనులకు ముద్దుగొలుపు నవీన మధుర
సుస్వరమ్ములు పాడెడు సొనలు నేడు
మొలకలెత్తెడు ప్రక్కల మోహనముగ
నవతృణాంకుర జీవరత్నాల శయ్య'

మరియు -

'శుచి యయిన దోయిళుల బట్టి సొనల నీరు
వదలబోవుచున్నారలావలి మహర్షులు....'

మహర్షులు వదలునది కూడా సొనల నీరేనట.... ఆ ప్రాంతములలో మల్లె పందిళ్ళ ప్రోది ఎక్కువ.

1. "రాయప్రోలు సుబ్బారావు - కొన్ని స్మృతి శకలాలు" (వ్యాసము) మరుపూరు కోదండరామరెడ్డి - విమర్శిని - 4. p 66-67.

అని తమ శబ్దప్రయోగ కళాకౌశలంతో, శైలీ వైశిష్ట్యంతో సాహిత్య పిపాసువులకు చవిచూపారు. మధురమయిన తెలుగుభాషా ప్రవాహ వీచికలలో తేనె లొలుకుతూ విరాజిల్లుతోందని వీరి ఉద్దేశం.[1] పాటకు, పద్యానికి అందంగా అమిరే ఆంధ్రభాషపై వీరికి అంతులేని అభిమానం. నిసర్గ మోహనమయిన పలుకు బళ్ళలో దేశస్థుల వ్యవహారంలో సజీవంగా నిలిచిన తెలుగుభాష వీరికి అత్యంత ప్రీతిపాత్రం. వీరు ఆదరించిన ఈ భాష వీరి రచనలలో తెలుగుదనానికి సజీవ రూపకల్పన చేసింది.

వీరి రచనల్లో వర్ణించబడిన తెలుగుదేశ ప్రకృతి సౌందర్యం, తెలుగింటి పరిసరాలు, ప్రజల జీవన విధానం, భోజనపు అలవాట్లు, స్త్రీల కట్టుబొట్టు, నోములు వ్రతాలు, పండుగలు వేడుకలు, ఆటపాటలు మొదలయినవి తెలుగు దనాన్ని సంతరించుకున్నాయి.

నేలతీరు, నీటి వనరులు, శీతోష్ణస్థితులనుబట్టి కొన్నికొన్ని ప్రాంతాలలో కొన్నికొన్ని పంటలు, పైర్లు అభివృద్ధి పొందుతాయి. కవులు వర్ణించిన చెట్టు చేమలు, పంటచేలు, పండ్లతోటలు మొదలయినవాటినిబట్టి అవి ప్రసిద్ధంగా, విస్తారంగా ఉండే ప్రాంతాన్ని కొంతవరకు గుర్తించే అవకాశం ఉంది. రాయ ప్రోలు రచనలను పరిశీలిస్తే తెలుగుదేశపు ప్రకృతిసంపద ప్రత్యక్షం అవుతుంది. కవులు పుట్టిపెరిగిన పరిసరాలు కవితలో ప్రతిబింబించడం సహజం. సుబ్బారావు గారి రచనలో తెలుగుదేశంలోని గుంటూరు, బాపట్ల, పెదుళ్ళపల్లి ప్రాంతాలు కనుల ముందు కదలాడుతాయి. ముఖ్యంగా పెదుళ్ళపల్లి పరిసరాలు వీరిని అధి కంగా ప్రభావితులను చేసినట్లు తోస్తుంది. "బాపట్ల, స్టువర్టు పురం మధ్య ఇసుకదిబ్బల మధ్య పెదుళ్ళపల్లె ఉన్నది. ఆ పల్లె పరిసరాలు, ఈయన కవితను- ముఖ్యంగా తృణ కంకణాన్ని ఎట్లా ప్రభావితం చేసినవో చెపుతా వినండి.... పెదుళ్ళపల్లె ప్రయాణం నాకు సుబ్బారావు కవిత భూమికను (**Background**) తృణకంకణ కావ్యరంగాన్ని చూపినది. పెదురు పొదలు, సొనల దరులలో మొగలి గుబురులు - ఇసుక తిన్నెలు - దూరాన తూర్పున వరిపొలాలు, తెల్లటి స్వాతికొంగల బారులు - పల్లెటూరివారి కోలాహలము - పశువుల మందలు అన్నీ రమ్యప్రకృతి దృశ్యాన్ని గ్రామీణ వాతావరణాన్ని ప్రదర్శించినవి.

---

1. రమ్యాలోకము - p. 6.

'నిగనిగ లెగయు కన్నె చిగుళ్ళ గుత్తుల
నీడలారెడు చిరునిమ్మచెట్లు
పురివిచ్చినట్లు చిమ్ముల కొమ్మ పందిళ్ళ
సాచు కుమార రసాలతరులు' [1]

'చువ్వలల్లెదిగి మంజుల గుచ్ఛముల వ్రేలు
మెలక ప్రాయపు పాలపోక చాళ్ళు'[2]

ఇటువంటివన్నీ తెలుగుదేశపు ప్రకృతిశోభకు ప్రత్యక్ష నిదర్శనాలు.

చిన్నపల్లెలోని బ్రాహ్మణ వాటికలో దూరదూరంగా ఉన్న తాటాకు కుటీరాలు, వాటి పరిసరాలు 'కష్టకమల'లో మనోహరంగా చిత్రించారు. కమల ఇంటి పరిసరాల వర్ణనను ఆధారంగా చేసుకుని సాధారణంగా పల్లెల్లో ఇంటి చుట్టుపట్ల ఉండే తోట వీరి రమ్యమయిన వర్ణనలో జీవం పోసుకుంది. ఆ ఇంటి తోటకు అందాన్ని చేకూరుస్తున్నవి మల్లెపందిరి, బచ్చలిపాదు; అరటిచాలు, నిగనిగలాడే నిమ్మచెట్లు, గుబురు కొమ్మలతో మామిడిచెట్లు, పోకమొక్కలు, వెదురులు, గున్నగోరంట పొదలు దట్టంగా పెరిగి జొరబడడానికి సాధ్యంకాని విధంగా తోటకు రక్షణచిచ్చే దడిగా ఏర్పడ్డాయి.

"పోకలను కౌగిలించు తాంబూల లతలు
పందిరులనెక్కు లేద్రాక్షవల్లికలును
పచ్చచేమంతి మడులును బంతిపూల
కుదురులును కొన్ని కలవు కన్నదరజేయ
మవ్వమలలోని మధ్యాహ్నమల్లికలును
నవకమెలయు కాశీరత్న లవలికలును
తులసితోటకు నావల నిలిపినట్టి
యలవలకు నల్లియుండె నాయనటితోట.[3]

---

1. కష్టకమల - అభినవ కవిత - p. 256.
2. కష్టకమల - అభినవ కవిత - p 256.
3. కష్టకమల - అభినవ కవిత - p. 257.

'దివ్యమగు మల్లెపూల పందిళ్ళ పజ్జ
చీర యొడిపట్టి మొగ్గలు చిదుపు చిన్ని
కన్నియల ముద్దు నడకలన్ కాంక్షపడెదొ ?'

అని లేఖిని నడిగినాడు.... బాపట్ల చుట్టు ప్రక్కల నున్న తోటలే సుబ్బా రావుగారికి కావ్యనామము స్ఫురింపజేసినవి"[1].... ఈ ప్రాంతాలలోని 'మిసమిసలు మీరు మెత్తని ఇసుక నేలలు'[2] పసుపు పూసిన ముత్తైదువుల ముఖాలను తలపించే పూలతో గుమ్మడిపాదులు,[3] చెంపకు వంగిన సీతాఫలపు చెట్లు,[4] చుక్కలతో ఆకాశంలాగా పిందెలతో నిండిన దోసపాదులు,[5] వనకుమారికలుంచిన పసుపు ముద్దలలాటి పండ్లతో నారింజచెట్లు,[6] ఇరువైపులా పెరిగిన అనాస మొక్కలతో దొరువులు,[7] దొరువు క్రిదరికి పొందుగ ప్రవాలి నీటిముత్యాల పూజలు చేయు దబ్బ చెట్లు,[8] చిన్ని బంగారు పూసల చెండ్లవంటి జొన్నకంకులు పండిన సొగసు చేలు[9] తెలుగుదేశపు గ్రామసీమలను కనులముందుంచుతాయి.

'గెలలు దిగిన మవ్వపు నారికేళ తరులు
పూలగుత్తులు ప్రేలాడు పొన్నచెట్లు
మృదుర వమ్ముల పిలిచెడి పెదురుపొదలు
కన్నెగందంపు మాకులున్ కలపు మఱియు'[10]

---

1. 'తెనుగుతోట'(వ్యాసము) - నోరి నరసింహశాస్త్రి - భారతి-జనవరి, 1954.
2. స్వప్నకుమారము - p. 20.
3. 'ఒకమాట' - జడకుచ్చులు - p. 106.
4. స్వప్నకుమారము - p. 20.
5. 'మంగళమాఘమ్' - మిశ్రమంజరి - p. 47.
6. స్వప్నకుమారము - p. 20.
7. కష్టకమల - అభినవకవిత - p. 258.
8. స్వప్నకుమారము - p. 21.
9. తెనుగుతోట - అభినవకవిత - p. 322.
10. తృణకంకణం - అభినవకవిత - p. 230.

బయటకు వెళ్ళివచ్చిన భర్తకు ఉపచారాలు చేయడం, ఇంటికి వచ్చిన అతిథులను ఆదరించడంవంటి బాధ్యతల నిర్వహణలో గృహిణి ప్రాముఖ్యం పొందుతుంది. సూర్యోదయాన పొలానికి వెళ్ళి కాయకష్టం చేసివచ్చిన రామన్నకు 'కడవతో నీళ్ళు తోడి, ముక్కాలి పీటవేసి, చాకింటి ధోవతి తీసి' అందించి భార్యగా పరిచర్య చేస్తుంది 'భూదేవి'. పెండ్లి మాటలకు ఊరి పెద్దలు వచ్చిన సందర్భంలో గృహిణిగా ఆదరించి తగిన మర్యాద చేస్తుంది.

'నిలువు చెంబుతో వేడినీళ్ళు తెచ్చి
అనువు గనిపెట్టి భూదేవి అంతలోనె
కిర్రుచెప్పులు విడిచి..కాళ్ళేలు కడిగి
కూరుచుండిరి వారును కుశలమడిగి.'[1]

ఇంటికి వచ్చినవారికి కాళ్ళు కడుగుకొనడానికి నీళ్ళు అందించడం తెలుగింటి మర్యాద. కాళ్ళు కడుగుకొని కూర్చోవడం అలవాటు. అతిథులను మంచాలువాల్చి కంబళి పరిచి కూర్చోబెట్టడం, స్నానాలకు నీళ్ళుతోడి భోజనాలు ఏర్పాటుచేయడం, అంచు దుప్పట్లు పరిచిన మంచాలు పంచలో కొన్ని, ఆరుబయట వెన్నెల్లో కొన్ని వేసి విశ్రమింపజేయడంవంటి వర్ణనలన్నీ పల్లెప్రజల మర్యాదలను చూపుతాయి.

కట్టుబొట్టుతీరు, ఆటపాటలు, వేడుకలు, పండుగలు కూడా జీవనవిధానానికి సంబంధించినవే.

'జిలుగుపూల కలంకారి చీరజార
చెందు సందెడు కుచ్చెళ్ళు చెదరనీక
మాటిమాటికిని కాలి మట్టియలు మలుపుకొనుచు'[2]

పాదరసం కదులుతున్నట్లు నడిచివస్తుంది తృణకంకణ నాయిక. 'మగువకు మంగళస్థానమయిన' వదనంలో తిలకరేఖను దిద్దుకొని, కాటుకకళ్ళతో, ఎఱుపంచుల గళ్ళపావడా పాదాలపై జీరాడగా, నిడుపాటిజడతో, జడలో పైడిజడకుప్పెలు

1. పెండ్లిలగ్నం - మిశ్రమంజరి. p. 61.
2. తృణకంకణం - p. 1.

వీటికి సమీపంలో ఉన్నవి తాటాకు దళ్ళు. సర్వసాధారణంగా తెలుగు పల్లె ఇళ్ళలో కనబడే ఈ తాటాకు దళ్ళు, మధ్యాహ్నమల్లికలు, కాశీరత్నపు తీగెలు, తులసి మొక్కలు, అరటి మొక్కల ప్రస్తావన ఈ వర్ణనను సహజత్వానికి దగ్గరగా తెచ్చింది. ఇది సహజత్వాన్ని కలిగించగా ఆ గృహపరిసరాల చిత్రణకు జీవాన్నిచ్చింది క్రింది పద్యంలోని 'దానిమ్మమీది చిలుక' ప్రసక్తి

"అపుడు కిలకిల లాడుచు నగ్రశాఖ
నుండి దోరగా పండిన పండు కొటికి
మొలక కెంపుల వంటి గింజలను రాల్చె
చిన్ని దానిమ్మ చెట్టుపై చిలుక యొకటి."[1]

ఇంటి పరిసరాలు ఈ విధంగా ఉండగా ఇంట్లో వారి జీవన విధానానికి రమణీయ రూపకల్పన వీరి రచనల్లో కనబడుతుంది. పల్లె జీవనంలో ఒక రోజును ప్రదర్శిస్తుంది 'పెండ్లి లగ్నం' అన్న ఖండిక. కాపుదంపతుల జీవన విధానం, ఆలోచనా సరళి, పెండ్లి సంబంధాన్ని నిర్ణయించుకోవడానికి వచ్చిన ఊరి పెద్దలకు సత్కారం దీనిలో చిత్రింపబడ్డాయి. పల్లెల్లో రైతు కుటుంబాల సంఖ్య అధికం. రైతులకు పంటపొలాలు, పాడిపశువులే సిరిసంపదలు. కనుకనే పూర్తిగా తెల్లవారకముందే నిద్రమంచం మీదనే తమ పంటలను, పశువులను, పాకలను గూర్చిన ఆలోచన మొదలవుతుంది.

నీళ్ళులేక వరిచేలు పొల్లుపోయాయని, సేద్యానికి వానలు ఆలస్యంగా పడ్డాయని, చెరువు నిండింది కాబట్టి కరువు రాదని, మిరపతోటకు అంతవరకు పురుగు పట్టలేదని, మొక్కజొన్న అప్పుడే పాలుపోసుకుంటోందనీ, పూతపట్టిన కొత్తిమీర చేను మంచుతాకకుండా కాస్తే చాలునని, ఏవిధంగానయినా ఎడ్లపాక ఆ సంవత్సరము కప్పించాలని, వానలకు కారిపోయిన గోడలు మెత్తించాలని, శిస్తుకోసంచేసిన అప్పుమీద వడ్డీ పెరిగిపోతోందనీ, పెయ్యదూడను అమ్మి ఆ అప్పు తీర్చడానికి మనసు ఒప్పటం లేదనీ రామన్న తలపోస్తున్నట్లు చేసిన వర్ణన[2] గ్రామవాసుల ఆలోచనా సరళికి అద్దం పడుతున్నది.

1. 'కష్టకముల' - అభినవకవిత - p. 261.
2. పెండ్లిలగ్నం - మిశ్రమంజరి-p. 57.

ఆటపాటలతో హాయిగా కాలం గడిపే దృశ్యం అది. ఈ కన్యలు ఆడిన చెమ్మచెక్క, నాలుగు స్తంభాలాట, కోలాటము, గొబ్బిళ్ళు, బొమ్మల పెండ్లిండ్లు, అట్లతద్దె ఉయ్యాలల వంటి ఆటలు ఆంధ్రత్వాన్ని సంతరించుకున్నాయి. తెలుగుదనాన్ని అభిమానించే రాయప్రోలువారు కాలక్రమంగా ఈ క్రీడలు క్షీణిస్తున్నాయనీ నేటివారు ఆదరించడం లేదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

"బువ్వమ్మ బంతులన్ కవ్వించి వయసు కా
వరముబ్బ పడతులు పాడలేరు,
గొబ్బి తట్టెడు వేళగూడ ప్రాయపు కన్నె
లరమర లేకాడ మఱచినారు,
తద్దె పండుగల సైతముయాల బూగుట
మోటుగా ముగ్ధలు మూసినారు,
రుక్మిణి మొదలుగా రుచిగొన్న బొమ్మల
పెండ్లిండ్లు బాలలు విడిచినారు....'[1]

అని అంటూ కన్యలలో 'ఆనంద సౌందర్య సంచయా'న్ని పెంచిన క్రీడలను గూర్చి విచారించడం వీరికి వాటిపైగల అభిమానాన్ని సూచిస్తుంది. కేవలం ఆటపాటలతో బాధ్యతారహితంగా జీవితం గడపడం కాక, ఇహపరాల దృష్ట్యా నోములు వ్రతాల వంటివికూడా అవసరమైనవే. అయితే వాటిని ఏదో బాధ్యతగా బరువుగా భావించడం కాక ఆహ్లాదంగా చేసుకునే పద్ధతి పేరంటాలు, పండుగలు వంటివాటిలో కనబడుతుంది. తెలుగింటి పండుగల వేడుక, పేరంటాల ఉత్సాహం రాయప్రోలువారి రచనల్లో వెల్లివిరుస్తుంది.

తీరుతీరుల ముగ్గులతో ఇళ్ళను, వాకిళ్ళను అలంకరించి తెలుగువారు సంబరంగా జరుపుకునే పండుగ సంక్రాంతి. ఏడాది పొడుగునా పడిన శ్రమకు ఫలితంగా పంటలు ఇంటికి వచ్చేకాలం అది. చేతినిండా పుష్కలంగావున్న పదార్థాలు వారి సంబరానికి, దానధర్మాలకు మరింత తోడ్పడతాయి. ఇండ్లకు చేరిన ఆ పంటలు 'క్షేత్ర మాతృక లంపిన.... సంక్రాంతి సారెలు.'[2]

---

1. 'ఆచారము' - ఆంధ్రావళి - p. 38.
2. బ్రహ్మముడి - మిశ్రమంజరి - p. 127.

అందగించగా, మెడలో కాసులదండతో తెలుగుపడుచు ముగ్ధ సౌందర్యం వీరి రచనల్లో సాక్షాత్కరిస్తుంది. చెవులకమ్మలు, ముక్కుపుడకలు తీసిన బోసితనంకూడ వింత సింగారం చేకూర్చగా జారుముడితో ఆ కన్య-

'పూతనలుగుల తలయంట్లు పోసికొనక
శుక్రవాసర ముఖములు చూడలేదు.'[1]

ఈ తెలుగు కన్నెల శుక్రవారపు తలంటికి పరిపూర్ణతను, జీవాన్నిచ్చింది దూముడి విడిచి తల తుడుస్తున్న సందర్భం.

ఎంత యాలసించితే తలంటునకయి ?
నాన్న యింటిలోన నున్నవాడె!
అనుచు నీళ్ళుగాలు నాకన్నె దూముడి
విడిచి పైటలాగి తుడవ దొడగె.'[2]

రాయప్రోలు వారు ప్రస్తావించిన పట్టెడలు, కాళ్ళకడియాలు, చెంపసరులు, లోలకులు, కాళ్ళగజ్జెలు, పగడాల సరాలు, అందెలు, కాసుల దండలు, ఒడ్డాణాలు, జడకుచ్చులు, కమ్మలు, ముక్కుపుడకలు ఆంధ్ర కన్యల అభిమాన ఆభరణాలు ఈ విధమైన ఆభరణాలను అలంకరించుకుని వీరి రచనల్లో పడుచులు,

'గాజులాడ గలగల మని
పరికిణీలు విరిసి తిరుగ'[3]
'గిరగిర తిరిగే పరికిణీలలో,....
పమిటెల చెంగులు పంజల జాఱగ'
'కాళ్ళ గజ్జెలును కంకణంబులును
లయ తప్పని తాళములయి మ్రోయగ'[4]

1. 'ఎవరు' - జడకుచ్చులు - p. 135.
2. కష్ట కమల - అభినవ కవిత p. 263.
3. చెమ్మచెక్క - కన్నెపాటలు - p. 9.
4. నాలుగు స్తంభాలాట - కన్నెపాటలు - 10.

ఆశ్వియుజ కృష్ణ ద్వితీయ రోజు తలంట్లు, రాత్రి భోజనాల తరువాత గోరంటాకు చేతులకు పెట్టుకోవడం, సూర్యోదయానికి పూర్వమే వినవచ్చే 'ముదురు, లేత' అనే గోరంట ముచ్చట్లు, వేకువజామునే లేచి స్నానాదికాలు చేసి భోజనాలు చేసి తాంబూలం వేసుకుని అలంకరించుకోవడం, తెల్లవారక పూర్వమే ఉయ్యాల లూగే సందడి వంటి వాటి వర్ణన[1] తెలుగు కన్నెలు ఉత్సాహంగా జరుపుకునే తద్దె పండుగ వేడుకలను ప్రత్యక్షం చేస్తుంది.

వరలక్ష్మి వ్రతానికి అత్తవారు పంపిన 'ఎరుపంచుల పట్టుచీరెలు, పసుపద్దిన గళ్ళ రవికల'[2] తొలి లాంఛనాలను అందుకుంటారు తెలుగింటి కొత్త కోడళ్ళు. వీరు గౌరి పూజకుచేసే ఏర్పాట్లు కనుల పండుగ కలిగిస్తాయి.

"పసుపు కుంకుమ పూలు - బండ్లపయి తెచ్చితిమి....
అరటి స్తంభాలతో - అందమగు మంటపము
తమలపాకుల తోర - ణముల సవరించితిమి
బంతిపూలరుగు చే - మంతి పువ్వుల పీట
అమరించినాము నీ - ఆవాహనకు నేడె."[3]

ఉత్సాహంతో పూజా మందిరాలను అలంకరించడానికి, శ్రద్ధాసక్తులతో పూజకు ఆయత్తం కావడానికి ఇది కమనీయరూపకల్పన. ఆ విధంగా ఆవాహన చేసిన జగదంబను భక్తి శ్రద్ధలతో అర్చించి,

'స్నేహదీపము వెలిగించి చిత్రపీఠి
పసుపు కుంకుమపూలు కొసరి చల్లి
చిన్న కర్పూరహారతి చేతబట్టి.'[4]

మంగళహారతి పట్టి నోచిననోమును పరిపూర్ణం గావిస్తారు. ఆ విధంగా చేసే పూజలను అనుసరిస్తుంటాయి పేరంటాలు. 'మా యింట ఈనాడు పేరంట

1. రష్ట కమల
2. 'వరలక్ష్మి వ్రతము' - కన్నెపాటలు p 35.
3. 'గౌరి పూజ' - కన్నెపాటలు p. 33, 34.
4. 'తెనుగుతోట' - అభినవకవిత. p. 340.

'బూజు దులిపిన పూరి యిండ్లును
వెల్లవేసిన వీధి గోడలు
అతికి ముగ్గుల నిడిన యరుగులు
అందగించెను పల్లెలన్.'[1]

ఉన్నవి పూరిండ్లే అయినా గ్రామవాసుల శ్రద్ధాసక్తులవల్ల, 'వన్నెముగ్గులు పెట్టి వాకిళ్ళ ముందు' చేసిన అలంకరణతో, కన్నెలు పెట్టిన గొబ్బిళ్ళతో కళకళలాడుతూ ఉంటుంది గ్రామం.

'తెల్లవారగ మేలుకొలుపులు
పాడుచును హరిదాసులాడగ'[2]

పల్లె సందడిస్తుంది. కొత్త బియ్యము, కొత్త బెల్లము, ముట్టుపాలు పోసి పొంగలి చేసుకుని పండుగ జరుపుకుంటారు. ఈ మకర సంక్రాంతికి సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశిస్తాడని, ఆనాడు స్వర్గద్వారాలు తెరుస్తారని, విష్ణువు వైకుంఠంలో నిద్ర లేస్తాడని ఒక నమ్మకం వ్యాప్తిలో ఉంది. దీన్ని సూచిస్తూ సంక్రాంతికి పెట్టే ముగ్గులలో సహితం భోగిరోజు స్వర్గద్వారాలు మూసివున్నట్లు, సంక్రాంతి రోజు స్వర్గద్వారాలు తెరచి ఉన్నట్లు ముగ్గుపెట్టే వాడుక ఉంది. మాఘమాసాన్ని ఉద్దేశించి ఇటువంటి భావాన్ని ధ్వనింపజేశారు రాయప్రోలువారు.

"బంతి మొక్కలచాళ్ళు గొబ్బికి
పసుపు ముద్దలు పెట్టగాన్ ...
....శీత శుక్ల నిశీథమందున
శౌరి నిద్దురలేవగా - వై
కుంఠమున వాకిండ్లు తీయగ
వచ్చినావే మాఘమా !"[3]

1,2. 'సంక్రాంతి సంబరము' - మిశ్రమంజరి p. 64, 65.
3. 'మంగళ మాఘమ్' - మిశ్రమంజరి p. 48.

పేర పెట్టిన మీగడ పెరుగుతోడ
నపుడు తినిపించి రెల్ల కన్యలను సతులు.'[1]

రాయప్రోలు వారు ప్రజలందరికీ చేకూరాలని వాంఛించింది కూడా ఆంధ్రుల భోజనంలో ముఖ్యమయిన నెయ్యి, అన్నమే.

'నోరెడు తెల్లని యన్నము
చేరెడు గుమగుమల నెయ్యి చేకుర ప్రజకున్.'[2]

ఆంధ్రత్వం మీద ఇంత అభిమానం ఉండడం వల్లనేనేమో వీరి భావనా ప్రపంచంలో కూడా అది కనిపిస్తుంది. వీరికి నక్షత్రాలు 'నింగివాకిట పెండ్లి ముగ్గుల లాగా తోచాయి.'[3] పచ్చని పచ్చిక బీళ్ళ తోటి కళకళలాడే బృందావనం ముత్తైదువలు పట్టిన పచ్చల హారతి పళ్ళాన్ని తలపింపజేసింది.[4] ప్రభాత కాలం లోని అరుణిమలు పండుకుంకుమ కలిపి తీర్చిన ముగ్గుల అల్లికలను తలపింప చేశాయి.[5]

'చదలలికి యందముగ రంగ
వల్లికలు తీర్చినట్లు రంజిల్లె తార
లంతరమున దోచె శశి సంక్రాంతినాడు
పాలుపొంగింపగా నిడ్డ భాండమట్లు.'[6]

చంద్రుడు సంక్రాంతినాడు పాలుపొంగించడానికి పెట్టిన భాండంలాగా తోచడం వీరి తెలుగుదనానికి చక్కని నిదర్శన.

---

1. రష్టకమల - అభినవ కవిత p. 277.
2. 'తిరక్కాస జయంతినాడు' - వనమాల p. 41.
3. 'బ్రహ్మముడి' - మిశ్రమంజరి p. 128.
4. జన్మాష్టమి - వనమాల p. 71
5. ప్రభాతము - ఆంధ్రావళి p. 76
6. రమ్యాలోకము - p. 35

మున్నద'ని పిలిచి కుంకుమబొట్టు పెట్టి, పాదాలకు పసుపుపూసి, అక్షతలిచ్చి, వాయనాలనిచ్చే తెలుగుదేశపు పేరంటాలు సహితం రాయప్రోలు వారి రచనలలో ప్రస్తావించబడ్డాయి.[1] తులసికి నిత్యపూజలు చేయడం, చిట్టి బొట్టు నోములు నోయడం, పసినిమ్మపండ్లు వాయనాలివ్వడం, లక్ష దీపాల నోములు చేసుకుని ఉద్యాపనలు తీర్చుకోవడం వంటి తెలుగుదేశపు ఆచారాలు ఎన్నో వీరి సాహిత్య సీమలో దర్శనమిస్తాయి. చద్దిఅన్నం తినడం వంటి సామాన్యమయిన అలవాటు నుంచి, ద్వితీయ విఘ్నం కూడదనే విధమయిన నమ్మకాలవరకు వీరి కవిత్వంలో చోటు చేసుకున్నాయి.

ఇక వీరి రచనల్లో కనిపించే ఆహారపు అలవాట్లు కూడా ఆంధ్రత్వాన్ని పుణికి పుచ్చుకున్నాయి. ఇంటికి వచ్చిన బంధువులకు భూదేవి వంటి వడ్డించిన వంటలు తెలుగువారి భోజనాన్ని పరిపూర్ణంగా ప్రదర్శిస్తాయి.

"క్రొత్త సాంబారు కారముల్ కొసరి కోర;
పైరవంకాయ తాలింపు దోరవేపు
కందిపప్పు కమ్మదనాలు చిమ్ముచుండ ......
ఇంట కాచిన కపురము వంటి నెయ్యి
జిడ్డు మీగడ గట్టిన గడ్డపెరుగు...."[2]

లతో భోజనాలు చేశారు గ్రామపెద్దలు. 'దోరపాకపు గారెలు అరిసెల'[3]తో కూడుకున్నది పుట్టిన రోజు పండుగనాటి ప్రత్యేక భోజనం. తద్దెపండుగనాడు తెల్లవారక పూర్వమే కన్యలకు తల్లులు పెట్టిన భోజనం తెలుగింటి పల్లె భోజనం.

'అరుగ దంచిన సన్నబియ్యంబు వండి
పొట్లకాయలు నేతిపోపుల నమర్చి

---

1. 'చుక్క' - కన్నెపాటలు p - 4; 'మంగళాచరణము' - తెనుగుతోట, అభినవ కవిత p. 315, 316, 317; కష్టకమల - అభినవకవిత. p. 275.
2. 'పెండ్లిలగ్నం' - మిశ్రమంజరి. p. 61.
3. 'ఫాల్గుణి' - మిశ్రమంజరి p. 91.

తీసినది వీరే. తెలుగు నదులను, తెలుగు రాజుల శౌర్యపరాక్రమములను, తెలుగు సిరిని స్ఫుటమైన రేఖలతో చిత్రించిన ప్రథములు వీరే."[1] పూర్వ చరిత్రలోని ఆంధ్రుల విజయాలు, వైభవాలు, ఆంధ్రతేజస్సు, ఆంధ్రపౌరుషం వంటి వాటి నెన్నిటినో బహుముఖాలుగా స్తుతించారు. ఆంధ్రభూమిలోని ప్రతి ప్రాంతాన్ని విశేషంగా కీర్తించారు.

"నందనోద్యాన సౌందర్యమ్ము నెగబోయు
గోదావరి ముఖాన కోనసీమ
సుఫల సంపత్సస్య సురభియై మెరయు కృ
ష్ణారసశ్యామ గుంటూరు సీమ
ధవుని పోరి కదల్చి కవిని నేరిమి గెల్చి
మీరెన జాణ నెల్లూరి సీమ
ఆంధ్ర దిగ్జయ పతాకాలంకృతమ్మైన
రతనాల యంగడి రాయసీమ
నేల నాలుగు చెఱగుల నిగ్గుదేలె
రాణసూయాణమై తెలంగాణ రేఖ"[2]

'తెనుగుతల్లి' అంగాంగం ఐశ్వర్యోపేతమే, ఆ ప్రాంతాలన్నీ ఆంధ్రమాత ఆభరణాలే. అటువంటి వన్నెచిన్నెలు చెక్కుచెదరకుండా కాపాడడం ఆంధ్ర పుత్రుల కర్తవ్యం అని ప్రబోధిస్తూ 'తెనుగుతల్లి లాలాటికా తిలక దీప్తిని' ఎన్నోరకాలుగా ప్రత్యక్షం చేశారు. 'చావలేదు, చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర' అని చాటిచెప్పిన వీరి కవితలో గతవైభవం పునరుజ్జీవనం పొందింది. ఆంధ్రావనిని కీర్తిస్తూ, పురావైభవాన్ని చాటిచెప్తూ, ఆంధ్రమాతను స్తుతిస్తూ ఉద్యమానికి ఉత్తేజాన్నందించారు.

తెలుగువాణి ఎంతో మంచి గాయకులకు సంగీతపాఠాన్ని అందించగా, సౌందర్యాభిరుచిని పెంపొందింపజేసింది తెనుగురేఖ. వసుంధరను సస్యశ్యామలగా తెనుగుభూమి చేయగా విరోధి సమూహానికి సహింపరానిదై మెరిసింది తెనుగుకత్తి.

1. 'ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయములు-ప్రయోగములు' సి. నారాయణరెడ్డి p. 293.
2. తెనుగుతల్లి - ఆంధ్రావళి - p. 36.

ఈ విధంగా వీరి రచనల్లో ఆచార వ్యవహారాలు, అలవాట్లు, ఆటపాటలు వంటివాటిలో తెలుగుదనం వ్యక్తమవుతుంది. ఇది వీరికి తెలుగుదనంపై ఉన్న అభిమానాన్ని స్పష్టం చేస్తుంది. తెలుగుదనం మీది ప్రేమాదరాలు తెలుగుదేశాన్ని అభిమానించడానికి సహాయపడ్డాయి. ఆ దేశాభిమానం ఆంధ్రరాష్ట్రాభిమాన కవితగా రూపుదిద్దుకుంది. ఈ రాష్ట్రాభిమాన కవిత వెల్లువగా ప్రవహించడానికి రాజకీయ పరిస్థితులు దోహదం చేశాయి.

భాషలను బట్టి ప్రత్యేకరాష్ట్రాలు ఏర్పడాలనే నినాదం ఆంధ్రదేశంలో బయలుదేరింది. క్రమంగా అది ఉద్యమమై వ్యాపించింది. 1913లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. రాయప్రోలువారు శాంతినికేతనం నుండి వచ్చే సమయానికి ఈ ఉద్యమానికి చెందిన ఆంధ్రనాయకులలో స్పర్థలు బయలుదేరాయి.

...."1917లో నెల్లూరులోకూడిన ఐదవ ఆంధ్ర మహాజనసభలో ఉద్యమ విరోధులు రగడ లేవదీశారు. శాంతినికేతనము నుండి మరలివచ్చిన రాయప్రోలు ఈర్ష్యామగ్నులూ, స్పర్థాబద్ధులూనైన ఆంధ్రనాయకులను చూచాడు. ఉద్యమానికి రాగల ముప్పును పసిగట్టాడు....వర్తమానదురవస్థ నంతమొంపించేందుకు పూర్వ మహా చరిత్రాంతర్గతాలైన ఉత్తేజకర సంఘటనలు జ్ఞప్తికెలయించ సాగినాడు. ప్రతినిధులముందు అమరావతీ నగరాన విశ్వవిద్యాలయములు స్థాపించిన బౌద్ధులు ప్రత్యక్షమయ్యేసరికి (ఏ) మహజర్లకూ సిద్ధించని స్వప్నం సభాసదుల తలలు వంచేసింది......ఎక్కడి స్పర్థలు అక్కడనే అణగిపోయాయి. తత్కాలానికైనా ఇంత గొప్పవిజయాన్ని కవిత్వం ద్వారా సాధించిన కవి నాడు తిక్కన శ్రీనాథుల వలె నిన్న మొన్న రాయప్రోలు తప్ప మరెవరున్నారు?"[1] ఆ విధంగా విజయం సాధించిన ఆంధ్రప్రశస్తి, ఆంధ్ర రాష్ట్రాభిమాన కవిత్వంగా రాయప్రోలువారి రచనల్లో స్ఫుటాకృతి దాల్చింది, ఆంధ్రోద్యమ స్ఫూర్తి వీరి కవిత్వంపై ప్రసరించింది. తెలుగుదనంపై వీరికున్న అభిమానం దానికి మెరుగులు పెట్టింది. "తెనుగు తల్లి' అను పదమును మొదట ప్రయోగించినది వీరే. 'తెనుగువాణి', 'తెనుగుకత్తి' 'తెనుగు భూమి' మొదలైన వాని వెనుకగల ఆంధ్ర జాతీయావేశమునకు దారులు

1. 'ఆంధ్రరాష్ట్రోద్యమ దర్పణం'-రాయప్రోలు జాతీయకవిత (వ్యాసము) K. V. రమణారెడ్డి. అభ్యుదయ - ఆగష్టు 1957 p. 28.

ఇది వీరి ప్రబోధ కవితలో ప్రముఖమైనది. ఈ ప్రబోధం ద్వారా ప్రాచీన కాలం నుంచి కనబడుతున్న శక్తిసామర్థ్యాలను, శౌర్య పరాక్రమాలను దృష్టిలో నిలుపుకుని మహితాభిమానాన్ని పెంచుకొని దీక్షాబద్ధులు కావాలని ఆంధ్రులను ఉత్తేజపరిచారు.

యుద్ధంలో వెనుదిరిగి వచ్చిన భర్తకు పసుపిచ్చి వేడినీళ్ళు తోడిన వీర పత్నులు, విశాల సామ్రాజ్యాన్ని చాకచక్యంతో ఏలిన వీర వనితలు 'విమల సాహస సౌకుమార్యాలను వెలయించి' చరిత్రలో చిరస్థాయి పొందారు. కొండవీటి వీరులు, పల్నాటి శూరులు, తెలంగాణ భటులు, అద్దంకి మేటి మగలు ఆంధ్రుల ప్రతిష్ఠను పటిష్టం చేశారు. వారి చరిత్రను దృష్టిలో ఉంచుకుని దానికి అనుగుణంగా ప్రవర్తించడం ఆంధ్రుల విధి అంటూ ఉత్సాహాన్నందించారు సుబ్బారావుగారు.

విశేషమైన భాషా సేవ చేసిన కృష్ణరాయల కీర్తి ధ్వజమెత్తిన పవిత్ర భూమి ఇది. ఎన్నో విదేశ నౌకల కాశ్రయమై మోటుపల్లి రేవు వెలసింది ఆంధ్ర భూమిలో. పంజాబు కర్పూరపు మొక్కలను పెరటి తోటల్లో పెంచిన దేశం ఇది. అటువంటి ఆంధ్ర దేశంపై 'చల్లుడాంధ్ర మహోద్యమ ప్రథమ పూజా పుష్పముల్' అని ప్రబోధించారు.

రాయప్రోలువారి దృష్టిలో పూర్వాంధ్ర చరిత్ర యావత్తూ స్వర్ణ యుగమే. ఆ స్వర్ణమయమైన మహోజ్జ్వల చరిత్రను ఆంధ్రులకు వినిపించి, ఆంధ్ర దీప్తిని కొనియాడి 'బోయవలె తల్లి పల్లకిని' మోయుమని బోధించారు. ఆంధ్రుల ప్రాచీన ప్రాభవాన్ని కీర్తిస్తూనే ప్రస్తుత పరిస్థితిని దృష్టిలో ఉంచుకుని 'నాదు జాతి - నా దేశము - నాదు భాష' అనే అహంకారం అందరూ పొందాలని ఆకాంక్షించారు. ఆంధ్రులందరూ సమైక్యం కావాలని ఆశించారు.

'జాతిన దేశ గౌరవము చక్కనదిద్ది మహాంధ్ర మండలీ
భారము శ్లాఘనీయముగ పాలన చేసి సమాన రాష్ట్రముల్
కూరిమి నాసజేయు తెనుగుం బుడమిన్ కయిసేయరయ్య....'

అంటూ ఆంధ్ర రాష్ట్రాన్ని కోరారు. తమ రాష్ట్రాభిమాన కవిత్వంలోని భావావేశంతో ఇతర కవులకెందరికో ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని అందించారు.[1]

---

1. 'ఆంధ్ర ప్రశస్తి నేను వ్రాశానంటే ఆ ఉద్వేగం నాడు రాయప్రోలు వలన కలిగినదే.' - విశ్వనాథ. - ఆంధ్రప్రభ. 11-3-66.

ఇది ఖడ్గ తిక్కన కత్తిని కడిగిన కదన భూమి. అమృతాక్షర వికాసమయిన పోతన లేఖిని ప్రకాశించిన ప్రదేశం ఆంధ్రదేశం అని ఆంధ్రప్రశస్తిని ప్రకటించారు సుబ్బారావుగారు.

ఇక్కడ గత వైభవాలు క్షీణించి శిలావశిష్టమై కూడా బ్రతికిచెడ్డ ఆంధ్రుల ప్రాభవాన్ని చాటిచెప్తున్నా యంటారు వీరు. నిండారగా పారే అఖండ గోదావరి ప్రాంతాలలో చాళుక్య నాగరికత దాగింది. కోటగోడల శిథిలాలలో కాకతీయుల ప్రాభవం నిద్రిస్తోంది. పల్లెపదాలలో పల్నాటి వీరుల శౌర్యం జీవం నిలుపుకుంటోంది అని చెప్తూ అఖిల పురుషార్థ సిద్ధిపొందిన మాతామహ పితామహుల సంప్రదాయాన్ని మాయనీయవద్దని ప్రబోధించారు.

'ఉత్కలాశా నితంబమ్ము లొత్తి హత్తె ఆంధ్రుల యశోదుకూల సితాంచలములు' అంటూ తెలుగు శిక్ష, తెనుగు కుంచె, తెనుగు కవితలతో తెనుగు ప్రతిభ జగద్వ్యాప్తం అయిందన్నారు. 'గంగ తలనుండి కావేరి కాళ్ళదాకా' తెలుగుతీవి వెలిగింది. త్యాగరాజు, నారాయణ తీర్థులు, క్షేత్రయ్య, మల్లినాథుడు, అన్నంభట్టు పండితుడు, పంపడు, అక్కన్న, మాదన్నల వంటి ఆంధ్రులు సంగీత సాహిత్య కళల నుగ్గుబాలతో త్రాగి ఆంధ్రుల సామర్థ్యాన్ని నిరూపిస్తున్నారని రాయప్రోలు వారు గర్వించారు. కర్ణాట రాజ్యరంగం ఆంధ్ర కవులకు బ్రహ్మరథం పట్టడం ఆంధ్రులకు గర్వకారణం అని గుర్తు చేశారు. తెలుగు ప్రజల యశోవైభవం వీరివల్ల పెంపొందిందని సూచించారు.

"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజవీర లాంఛనముగా
బలుశస్త్రశాలలు నిలుపునాడు
విద్యానగర రాజ వీథులన్ కవితకు
పెండ్లి పందిళ్ళు కప్పించునాడు
పొట్నూరికి సమీపమున ఆంధ్ర సామ్రాజ్య
దిగ్జయ స్తంభమెత్తించునాడు
ఆంధ్ర సంతతికే మహితాభిమాన
దివ్యదీక్షాముఖ స్ఫూర్తి తీవరించె
ఆ మహావేశ మర్థించి యాంధ్రులార
చల్లుడాంధ్రలోకమున నక్షతలు నేడు."

# రాయప్రోలువారి

# తత్త్వచింతనపై ప్రభావాలు

వీరి కోరిక నెరవేరింది. ఆంధ్ర రాష్ట్రం అవతరించింది. అయితే దానితో అంతా తీరిపోతుందనుకున్నవ్యక్తికాదు రాయప్రోలువారు. ఉద్యమంతో ప్రారంభం అయిన అభిమానం రాష్ట్ర సిద్ధితో ఆగిపోలేదు. వీరి అభిమానం సహజ సిద్ధం అయింది. రాష్ట్రం ఏర్పడగానే ఆంధ్రుల బాధ్యత తీరిపోదు. ఆ రాష్ట్రాన్ని సమర్థవంతంగా ఆదర్శప్రాయంగా పాలన చేయడం కూడా ఆంధ్రుల బాధ్యతే. కనుకనే ఈ బాధ్యతను మరిచిపోకూడదన్నట్లుగా ఆంధ్రులకు గుర్తుచేశారు.

"నాలుగుకోట్ల మహాంధ్ర నాగరిక జనకాంక్ష
నలుబదేండ్ల నిరూఢ బలవదుద్యమ దీక్ష
ఈడేరినది ఆంధ్రులేకీభవింపండి
ఇరుగు పొరుగులు నచ్చ
హితులు నహితులు మెచ్చ
ఈడేరినది ఆంధ్రులేకీభవింపండి
....ప్రజల క్షేమమునెంచి పక్షకక్షలు డించి
నడపండి రాష్ట్ర తంత్రము ముళ్ళుపడకుండ
దేశ ప్రతిష్ఠల్ ప్ర
కాశంబు కావలె...."[1]

అంటూ కలతలు కల్లోలాలు వీడి ప్రజాశ్రేయస్సు ఆకాంక్షిస్తూ పాలించమని బోధించారు.

ఈవిధంగా రాయప్రోలువారి కావ్యాలను స్థూలంగా పరిశీలించినపుడు కొన్ని సామాజిక సమస్యలు ప్రతిఫలించడం, రచనా విధానంలో కొత్తదనం, తెలుగుదనం మీద అభిమానం కనబడతాయి. సూక్ష్మంగా పరిశీలిస్తే వీరి కవిత్వంలో అంతర్లీనంగా కనబడే సత్యాలు వీరి తత్త్వదర్శనాన్ని చూపుతాయి. ఆ తత్త్వ వివేచన వీరిని దార్శనిక కవిగా నిరూపిస్తుంది.

1. 'ఆంధ్రాభిషేకమ్' - మిశ్రమంజరి - p. 15

# రాయప్రోలువారిపై వైదికవాఙ్మయ ప్రభావం

రాయప్రోలువారి కావ్యాలలో అంతర్లీనంగా కనబడే తాత్త్విక దర్శనాన్ని అవగాహన చేసుకోవడానికి వారి వ్యక్తిత్వం ఏ విధంగా రూపుదిద్దుకుందో పరిశీలించడం సహాయపడుతుంది. వ్యక్తిత్వవికాసంపై పుట్టిపెరిగిన వాతావరణ, పరిసరాలు, చదివిన సాహిత్యం, పెంచి పెద్దచేసిన వ్యక్తులు, విద్యాబుద్ధులు నేర్పిన పెద్దలు, పరిచితులు - ఇలాటివి ప్రభావాన్ని చూపుతాయి.

వేదపండితుల వంశంలో జన్మించిన రాయప్రోలు సుబ్బారావుగారు తాము పెరిగిన వెదుళ్ళపల్లి వేదఘోషతో ప్రతిధ్వనించే మునివాటికలా ఉండేదంటుంటారు. పుట్టి పెరిగిన ఈ వాతావరణం వీరి వైదికాభిమానానికి దోహదం చేసి ఉంటుంది. ప్రాచ్యసంప్రదాయాలపట్ల, ఆర్షధర్మాలపట్ల, వేదోపనిషత్ సూక్తులపట్ల గౌరవాభిమానాలకు ఈ వాతావరణం కొంత కారణం అయి ఉంటుంది. ఈ ప్రభావంతో వీరు ఆర్ష సంస్కృతీ సంప్రదాయాలను పవిత్రంగా భావించి గౌరవించారు. 'వేదశాఖలు పెరిగె నిచ్చట....ఉపనిషన్మధు వొలికె నిచ్చట....' అంటూ వేదోపనిషత్తులను తలచుకొని ఉప్పొంగిపోయారు. ఉదారచరితులయిన ఋషులను పదే పదే ప్రస్తుతించారు. వైదిక సాహిత్యం పూర్వులు మనకిచ్చిపోయిన మాన్యమని, అమూల్య సంపద అని అభిమానించారు.

ఇంత గాఢంగా వీరి హృదయంలో స్థిరపడివున్న వైదికాభిమానం వీరి సాహిత్యంపై అధికప్రభావాన్ని చూపింది. వీరి రచనలో వేదోపనిషత్ ప్రభావం ఒకచోట ఉన్నదని చెప్పటానికి వీలులేకుండా పాలలో వెన్నలాగా సర్వత్రా వ్యాపించి ఉంది. వీరి కావ్యభాషలో వైదిక పదజాలం ప్రత్యేక స్థానం పొందింది. వీరి రచనలో వైదిక స్పర్శలేని పద్యాలు అతిస్వల్పం అనవచ్చు. వీరి వైదిక ధర్మాభినివేశం సాహిత్యంలో వైదిక వాతావరణ చిత్రణగా ప్రతిఫలించింది. భారతీయమైన వీరి ప్రత్యుత్పత్తిశక్తికి మూలాధారంగా చెప్పదగ్గది వైదికవాఙ్మయం. వీరి సాంఘిక జీవిత సత్యాన్వేషణకు, సాహిత్య దర్శనానికి వేదోపనిషత్తులు పూర్వరంగంగా భాసించాయి. పాప పుణ్య కర్మల నమ్మకం, జన్మ సిద్ధాంతం, భగవత్తత్త్వచింతన, దైవచింతన వంటి వీరి సనాతన సంప్రదాయ భావాలకు

పనిషత్తు ఆనందమే బ్రహ్మమని తెలియజేస్తుంది. దీనిలోని బ్రహ్మానందవల్లి అనే విభాగంలో ఆనందమయకోశ స్వరూపాన్ని ఆనందతత్త్వాన్ని మీమాంస చేయబడి, ఆనంద స్వరూపమైన బ్రహ్మము వివరింపబడింది.

జీవుడు శుభాశుభ కర్మఫలాల ననుభవించడానికి ఆధారంగా పాంచభౌతిక మైన శరీరం ఏర్పడింది. ఇది అన్నమయ శరీరం. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలు ఒకదానిలో ఒకటి ఇమిడి ఉన్నాయి. ఇవి క్రమంగా ఒకదానికంటె వేరొకటి సూక్ష్మమైనవి. ఆ క్రమంలో చివరిదయిన ఆనందమయ కోశము అన్నిటికంటె సూక్ష్మమయింది. ఈ ఆనంద మయ కోశానికి 'ప్రియము' శిరస్సు. 'మోదము' దక్షిణభాగం. 'ప్రమోదము' ఉత్తరభాగం. ఆనందమే ఆత్మ. బ్రహ్మ ఆధారం.[1] అని అంటూ ఆనందమయ కోశాన్ని భావన చేసింది తైత్తిరీయోపనిషత్తు.

జీవులు సుఖరూపంగా భావించి ఆనందించే మానుషానందము నుంచి ఉత్కృష్టమయి, సర్వోత్తమమయిన బ్రహ్మానందం వరకు గల అంతరాలు వివ రించింది తైత్తిరీయోపనిషత్తు. "మానుషానందము, మనుష్య గంధర్వానందము, దేవగంధర్వానందము, పితురానందము, ఆజానజానందము, కర్మదేవానందము, ప్రజాపత్యానందము, బ్రహ్మానందము" అనే అంతరాలను చెప్తూ బ్రహ్మానందం సర్వోత్తమం అన్నది. 'బ్రహ్మము' అనంతం కనుక బ్రహ్మములోని ఆనందం కూడా అనంతమే.

'భృగువల్లి' అనే వేరొక విభాగంలో అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము - వీటిలో ఒక్కొక్క దానిని బ్రహ్మముగా తెలుసుకోడానికి

---

1. 'తస్మాద్ వా ఏ తస్మాద్ విజ్ఞానమయాత్। అన్యోఽన్తర ఆత్మా ఆనంద మయః। తేనైష పూర్ణః। సవా ఏష పురుషవిధ ఏవ। తస్యపురుష విధతామ్। అన్వయం పురుషవిధః। తస్యప్రియమేవ శిరః। మోదో దక్షిణః పక్షః। ప్రమోద ఉత్తరః పక్షః। ఆనంద ఆత్మా। బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా।'
(తైత్తిరీయోపనిషత్తు - బ్రహ్మానందవల్లి - పంచమానువాకము)

వైదిక వాఙ్మయం ఆధారభూతం. వైదిక సంస్కృతీ సంప్రదాయాల్లోని ఔన్న త్యాన్ని గుర్తించి కీర్తించడం ద్వారా ఆనాటి సాహిత్యసీమలో ఒకవిధంగా వాటిని వీరు పునరుద్ధరించారని చెప్పవచ్చు.

కనుకనే వేదోపనిషత్ సూక్తులకు, భావాలకు ప్రతిబింబాలవంటి భావాలు వీరి రచనలో కనబడతాయి. 'నీవారశూకవత్ తన్వీపీతా భాస్వత్యణూపమా'[1] అని ప్రాచీనులచే పరతత్త్వరేఖ భావింపబడ్డది. ఇదే భావాన్ని అనుసరిస్తూ రాయ ప్రోలువారు 'నీవారాగ్రము మాద్రి సూక్ష్మమయి హృన్నీలాభ్రమధ్యస్థ లీలా విద్యుచ్ఛిఖలోని జీవుని మొదల్ దర్శించి సూక్తించె....'[2] అంటూ మహర్షులకు దర్శనీయమైన పరతత్త్వాన్ని స్మరించారు. ఆ పరబ్రహ్మ నిర్వికారము, నిరంజ నము అని అంటూ అది సామాన్యులకు అందనిదని భావించారు. శుద్ధవిజ్ఞానాంశ, నిర్వికల్పబ్రహ్మ అయిన పరతత్త్వరేఖ తపోధనులయిన మహర్షుల హృత్కమల భాసితం. కనుకనే తపోవిదగ్ధులు 'కలడో లేడో యనుచు భూమ్యాకాశములు వెదుకన్ హృదంతిక కోశమున నీవారశూకాగ్రముగ మెఱసె తదంశయున్'[3] అన్నారు. ఇదే భావాన్ని 'చిన్ని నివ్వరి సిగవలె సన్నగా తళుక్కుమన జీవి లక్షించె నొక్కద్రష్ట'[4] అని వ్యక్తం చేశారు. 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ'[5] అన్న ఉపనిషదుక్తి ఛాయలో పరతత్త్వాన్ని వాగతీతంగా భావించి 'వాచామగోచరం బనిరి దానిని'[6] అని అన్నారు రాయప్రోలువారు.

జగదాధారమయిన భగవత్ స్వరూపాన్ని సచ్చిదానంద రూపంగా భావిం చడం ప్రసిద్ధి పొందిన విషయం. 'రసోవై సః రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి'[7] అని అంటూ తిత్తిరినామక ఋషిప్రోక్తంగా భావింపబడే తైత్తిరీయో

1. తైత్తిరీయారణ్యకం 10-13 యజుర్వేదం.
2. 'ఉగాది నివేదన' - వనమాల - p. 15.
3. 'బ్రహ్మముడి' - మిశ్రమంజరి - p. 130.
4. రమ్యాలోకం - p. 15.
5. తైత్తిరీయోపనిషత్తు - బ్రహ్మానందవల్లి - చతుర్థానువాకం.
6. రమ్యాలోకము - p. 12.
7. తైత్తిరీయోపనిషత్తు - బ్రహ్మానందవల్లి - సప్తమానువాకం.

న్నట్లు కనబడదు. ఈ జగత్తు 'సచ్చిదానంద కల్యాణ నిలయం'గా నమ్మి వీరు "కావ్యము వలన ఆర్థింపదగిన పరమ ప్రయోజనము ఆనందము. ఆ ఆనందోపాసన కావించువాడే కవి.....మీరు ఆనందగీతమునే పాడుడు. ఆనందసూత్రములనే అల్లుడు, ఆనందమూర్తినే చిత్రింపుడు"[1] అని ప్రబోధించారు. ఈ విధంగా వీరి విశ్వాసానికి ప్రాతిపదికగా ఉపనిషద్వాణి గోచరిస్తోంది.

'ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః' అన్న సూక్తిని అనుసరిస్తూ 'లవియింఫకుమి ప్రజాతంతువు' నను శ్రుతి శాసనము పాలించడం మానవాళికి ధర్మం అని రాయప్రోలువారు భావించారు. ఆ సూక్తిని శాసనంగా తలదాలుస్తూనే తమదైన అమలిన శృంగార సిద్ధాంతానికి రూపకల్పన గావించారు. ఉపనిషదుక్తిలోని ప్రజాతంతు ధర్మానికి భంగం వాటిల్లకుండా నవ్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. దీనినిబట్టి వేదోపనిషత్ సూక్తులు వీరి దృష్టిలో తగిన గౌరవాదరాలను కలిగి ఉన్నాయని తోస్తుంది.

వైదిక సంప్రదాయంలో అగ్నికి ప్రముఖ స్థానం ఉంది. ఎన్నో వైదిక కర్మలకు అగ్నిహోత్రం సాక్షీభూతంగా అత్యావశ్యకంగా ఉంది. హవిర్భాగాలను ఆయా దేవతలకందజేసే వాహకుడైన దేవునిగా అగ్నికి ప్రధాన పాత్ర ఉంది. అగ్నిని భగవత్స్వరూపంగా భావించి, ఆరాధించి, పూజించడం ఋగ్వేద కాలం నుంచి వస్తున్న సంప్రదాయం. 'అగ్నిర్దేవో ద్విజాతీనాం' అని ప్రసిద్ధి. నిత్యాగ్నిహోత్రం విధిగా నిర్వహించడం అనాదిగా వస్తున్న వైదికాచారం. 'అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా అయమ్. అపాం రేతాంసి జిన్వతి' - 'అగ్నిరస్మి జన్మనా జాత వేదాఘృతం మే చక్షురమృతం మ ఆసన్'[2] అని అగ్ని ధ్యానింపబడింది. ఈ విధమైన సంప్రదాయ ఛాయలో-

---

1. అభినవాంధ్ర కవి పండిత సమ్మేళనము - ద్వితీయ సమావేశం. రాజమహేంద్రవరము - 28-12-33 - భారతి, ఫిబ్రవరి 1934.
2. ఋగ్వేదము 8-44-16; 3-26-7 - 'భారతీ నిరుక్తి'-(హరిసోదరులు) లో ఉల్లేఖింపబడినది. అవతారిక - p. 20, 21.

ప్రయత్నం చేస్తూ భృగువు ఆనందస్వరూపుడైన 'బ్రహ్మము'ను కనుగొని ఆనందమే బ్రహ్మగా గుర్తించిన విధం వివరింపబడింది.

'ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్ ।
ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే ।
ఆనందేన జాతాని జీవంతి ।
ఆనందం ప్రయం త్యభిసంవిశంతీతి ।'[1]

ఆనందరూపమయిన బ్రహ్మను తెలుసుకుని, ఆ బ్రహ్మానందం పొందడమే మానవ జిజ్ఞాసకు పరమావధి. రాయప్రోలు వారు సాహిత్యంలో ఆనందానికి ప్రాధాన్యం ఇవ్వడానికి ఈ ఉపనిషత్ ప్రభావం పూర్వరంగంగా ఉపకరించిందనవచ్చు. సృష్టి, స్థితి, లయ విన్యాసం ఆనందమూలమని, అటువంటి ఆనంద సాధన సాహిత్యానికి లక్ష్యమని అంటారు సుబ్బారావుగారు. సాహిత్యం అమంగళం పలుకకూడదని, అశుభం వాంఛించకూడదన్న వీరి విశ్వాసానికి పై ఉపనిషద్వచనం ఆలంబనం. వీరు ఆనందానికిచ్చే ప్రాధాన్యానికి ప్రాతిపదిక లాంటి ఈ సూక్తిని రాయప్రోలు వారు తరచుగా ఉల్లేఖిస్తుంటారు.[2] సాహిత్యం అశుభం, అమంగళం పలుకకూడదన్న అభిప్రాయం వీరికున్నా వీరి రచనలలో విషాదాంతంతోపాటు విషాదారంభం కూడా ఉంది.[3] అయితే ఇది వీరు గ్రహించిన కావ్యవస్తువును, రసపోషణను, సమస్యా పరిష్కారాన్ని దృష్టిలో పెట్టుకుని కథా వస్తువుకు అనుగుణంగా స్వీకరించిన నవ్యమార్గమేనని చెప్పుకోవచ్చు. అంతేకాని వారి తత్త్వంలో, వ్యక్తిత్వంలో అశుభం, అమంగళం అంగీకరిస్తు

1. తైత్తిరీయోపనిషత్తు - భృగువల్లి - షష్ఠానువాకము.
2. "అక్బర్ హైదరీతో మాట్లాడుతూ 'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని' అన్న వాదం ఉపనిషత్తుల్లోంచి పలుకుతూ వచ్చారు. అక్బర్ హైదరీ చాలా హర్షించారు. ఆనందం నుంచి ఉద్భవం ఆనందంలోనే లయం పొందడం చాలా బాగున్నది ఈ తత్త్వం అన్నారు.... అని చెప్పారు రాయప్రోలు."

   **Interview with Sri J. Madhava Rama Sarma, 30-3-81.**
3. 'కష్టకమల', 'స్నేహలత' అటువంటి రచనలు.

ప్రసీదతు సతాం స్వాంతే
ష్వేకమ్ త్రిపురుషీమయమ్'[1]

అన్న శ్లోకం త్రిమూర్త్యాత్మకమైన ఓంకారంపై రాయప్రోలువారి భక్తి ప్రపత్తులను సూచిస్తుంది. రూప నవనీతంలో కూడా శబ్దబ్రహ్మపావిత్ర్యాన్ని ప్రకటించారు.[2]

నర జన్మ దుర్లభం. మానవునిగా జన్మించడమే పుణ్యఫలం కాగా, అందు లోనూ సంస్కారవంతునిగా జ్ఞానిగా జన్మించడానికి మరింత పుణ్యం చేసుకుని ఉండాలి, జీవి పుట్టుకకు, జీవితకాలంలోని మంచి అనుభవానికి పూర్వపుణ్యమే కారణం అంటుంది వైదికసాహిత్యం.

'జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వంతతో విప్రతా
తస్మాద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తిర్నో శతకోటి జన్మ సుకృతైః పుణ్యైర్వినాలభ్యతే.'[3]

'యేషా మస్తి పరిజ్ఞానం వినైవ జ్ఞాన సాధనం కల్ప్యం
తత్సాధనం తేషాం పూర్వజన్మసు సూరిభిః.'[4]

ఇదేవిధంగా రాయప్రోలువారు కూడా అభిప్రాయపడ్డారు. నర జన్మ దుర్లభమని, అందులోనూ విద్వాంసునిగా జన్మించడం మరింత పుణ్య ఫలమని,

---

1. మాధురీ దర్శనము.
2. రూపనవనీతం p. 131.
3. వివేకచూడామణి - శ్రీ శంకరాచార్యులు - శంకరగ్రంథరత్నావళి, Vol. 6 - p. 3.
4. శ్రీ స్కాంద మహాపురాణము - సూతసంహిత 'వైదికమత చరిత్రము'- గోపరాజు వెంకటరావు. p. 117లో ఉల్లేఖింపబడింది.

వినబడియె నొక్కసూక్తి హృద్వివరమందు
స్మృతులు మూసి ముక్కోటి దేవతల వదలి
బ్రహ్మ విష్ణు రుద్రుల పరంపర త్యజించి
అగ్నిముఖమందె అమృతమ్ము నందు మనుచు[1]

అని రాయప్రోలువారు అగ్నిని స్మరించారు.

హిందువుల దృష్టిలో ఓంకారానికి పవిత్రస్థానం ఉంది. వేదవిహిత శుభ కర్మలకు, భగవదారాధనకు, వేదాధ్యయనానికి ఓంకారోచ్చారణే ప్రారంభం. ఓంకారం భగవత్స్వరూపంగా పూజలందుకోవడం, ఓంకారోపాసనా కూడా సనాతన సంప్రదాయంలో ఉన్నాయి.

'ఓమితి బ్రహ్మ ఓమితీదం సర్వమ్'[2] అంటుంది తైత్తిరీయోపనిషత్తు; సంప్రదాయజ్ఞులచే 'ఓం' అన్న ప్రణవం శివశక్తి సమ్మేళనంగా త్రిమూర్త్యాత్మకంగా భావింపబడింది.[3] ప్రణవనాదం పవిత్రతను ఉద్ఘాటిస్తూ 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్[4]......అంటుంది భగవద్గీత. మాధురీ దర్శన ప్రారంభంలో దర్శనమిచ్చే—

'ఓమిత్యేకాక్షరమ్ బ్రహ్మ
శ్రుతీనాం ముఖమక్షరమ్

---

1. 'ధ్యానగీతము' - జడకుచ్చులు - p. 119.
2. తైత్తిరీయోపనిషత్తు — శిక్షావల్లి - అష్టమానువాకం.
3. 'శక్తి అ+ల; శివుడు ఉ+మ్. ఈ రెండును జేరినపుడే ప్రణవమనెడి ఓంకార మేర్పడుచున్నది. ఆ నాదము నుండియే పరాపశ్యంత్యాదుల యుత్పత్తి. దాని నుండియే స్వరవర్ణపద వాక్యాదుల ప్రపంచము. అ,ఉ,మ్ అను వాని సంయోగమే ప్రణవము....అవియే హరిహర విరించులు.' 'శంకరగ్రంథరత్నావళి' - పంచమ సంపుటము - శ్రీ సౌందర్యలహరి - వివృతికర్త - శ్రీ శ్రియానందనాథుఁడు. ఈశ్వర సత్యనారాయణ శర్మ. p. 7.
4. భగవద్గీత - అష్టమాధ్యాయం - అక్షరపరబ్రహ్మయోగం - శ్లోకం - 13.

దీనికి ప్రతిబింబంలాగా కనబడుతుంది రాయప్రోలువారు ఒక సందర్భంలో వెలిబుచ్చిన అభిప్రాయం:

'పాత గుడ్డలు పారవేతుము
క్రొత్త మడతలు కట్టుకొందుము
చావు బ్రతుకుల సత్యమింతే....'[1]

అంటూ పునర్జన్మ సిద్ధాంతం పట్ల తమ నమ్మకాన్ని వ్యక్తం చేశారు.

ఆత్మలో ఛాయా వాసనాదికంగా గతజన్మ రాగరసాలు నిలిచి ఉంటాయని తైత్తిరీయం చెబుతుంది.

'యథా వృక్షస్య సంపుష్పి తస్య దూరాద్గంధో వాత్యేవం పుణ్యస్య కర్మణో దూరాద్గంధోవాతి....'[2]

ఇటువంటి భావాన్నే భగవద్గీత కూడా వ్యక్తం చేస్తుంది.

"శరీరం యద వాప్నోతి
యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి
వాయుర్గంధానివాశయాత్.'[3]

సంప్రదాయ సిద్ధమయిన ఇటువంటి భావాన్నే రాయప్రోలువారు సహితం తమ రచనలో కనబరచారు.

............'ఆ కన్నెకే నోములిచ్చె
రాలుగరగించు గాంధర్వలాలనమ్ము?
జన్మవాసనలెంత నైజములో జగతి.'[4]

---

1. భద్ర యాత్ర - మిశ్ర మంజరి - p. 23.
2. తైత్తిరీయారణ్యకం.
3. భగవద్గీత - పురుషోత్తమ ప్రాప్తియోగము - 8 వ శ్లోకం.
4. 'ఎవరు' - జడకుచ్చులు. p. 137.

మానవుని సంస్కృతికి బహుల జన్మల పుణ్యం దోహదం చేస్తుందనే నమ్మకం వీరి సాహిత్యంలో కనబడుతుంది.[1]

"ప్రారబ్ధ కర్మణామ్ లోకే భోగాదేవ పరిక్షయః
ఆగామి న స్త్వనారంభాత్ సంచితస్యతు ధర్మతః ।"
"హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి
లలాట లిఖితారేఖా పరిమార్ష్టుం నశక్యతే."

అని ఆర్యోక్తి. పాప పుణ్య కర్మల ఫలం ఏదయినా అనుభవించడం అనివార్యం. ప్రారబ్ధం, సంచితం, ఆగామి అని మూడు విధాలుగా చెప్పబడ్డ కర్మలు జీవిని వెంటనంటే ఉంటాయి. వాటి ఫలం ఎటువంటిదయినా దాన్ని అనుభవించాల్సినదే కాని దానిని మార్చడం బ్రహ్మరుద్రాదులకయినా సాధ్యం కానిది. సాంప్రదాయికమైన ఈ నమ్మకాలు, భావాలు రాయప్రోలువారి సాహిత్యంలోనూ కనబడతాయి. ఈ విధమైన వారి ఆలోచనావిధానం వైదిక సాంప్రదాయిక మార్గంలోనిదనే చెప్పవచ్చు.[2]

జీవి కర్మ ఫలాన్ని అనుభవించిన తరువాత తిరిగి వేరే జన్మ ఎత్తుతుందన్నది వైదిక విశ్వాసం. జీవికి పునర్జన్మ ఉందనే నమ్మకాన్ని చాలా సందర్భాలలోని గీతా వాక్యాలు దృఢపరుస్తాయి. జీవి ఒక శరీరాన్ని వదలి వేరే శరీరంలో ప్రవేశిస్తుందని చెబుతూ, జీర్ణ వస్త్రాన్ని వదలి నూతన వస్త్రాన్ని మానవులు ధరించినట్లే జీవి వేరొక శరీరాన్ని ఆశ్రయిస్తుందని అంటుంది భగవద్గీత.

'వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణీ విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.'[3]

---

1, 2 రాయప్రోలు వారి "తత్త్వచింతన" విభాగంలో 'జన్మకర్మ సిద్ధాంతాలు'- (రాయప్రోలు వారి దృష్టి) అన్న శీర్షికలో ఈ భావాలు సోదాహరణంగా వివరింపబడ్డాయి. కనుక వారి రచనల నుంచి ఉదాహరణలు ఇక్కడ చూపలేదు.

3. భగవద్గీత - సాంఖ్య యోగము - 22 వ శ్లోకం.

అవసరం. కనుకనేనేమో క్షణికాలయిన ఈ బంధాలకోసం శాంతిని వీడవద్దని అన్నారు. చిత్తశాంతి కలిగినపుడే మానవుడాశించిన పరమార్థాన్ని పొందడానికి ప్రయత్నించి కృతకృత్యుడు కాగలడు అని సూచించారు.

వైదిక సంప్రదాయంలో గోవుకు ప్రత్యేకస్థానం ఉంది.

'గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినో భవంతు'

అని సమస్తలోకాల సౌఖ్యాన్ని ఆశిస్తో మంగళవచనం పలుకుతారు సంప్రదాయజ్ఞులు. లోకకల్యాణంతోపాటు గోవులకు సహితం శుభం కలగాలని, సుఖంగా వర్ధిల్లాలని ఆకాంక్షించడం వాటికిచ్చే ప్రాధాన్యాన్ని చూపుతుంది. హిందువుల దృష్టిలో గోవు పొందిన ఔన్నత్యాన్ని వైదిక వాఙ్మయం చూపుతుంది.

'నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయచ
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః'[1]

అని గోవులకు హితమొనర్చేవానిగా భగవత్స్వరూపుడైన శ్రీకృష్ణుడు ప్రణామాలందుకుంటున్నాడు. ఉపనిషత్తులతోపాటుగా గోవుకు ఉన్న పవిత్రతను సూచిస్తూ సర్వోపనిషత్తులు ధేనువుతో పోల్చబడ్డాయి.

'సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్సః సుధీర్ భోక్తా దుగ్ధం గీతామృతం మహత్'[2]

అని ఉపనిషత్తులు ధేనువులుగా, వానిని పితికే గోపాలనందనుడు శ్రీకృష్ణునిగా, అర్జునుడు లేగదూడగా, ఆ ధేనువు లిచ్చిన పాలు గీతామృతంగా భావన చేయబడింది.

---

1. మహాభారతము - శాంతిపర్వము, రెండవ అధ్యాయం, 19 వ శ్లోకం.
2. గీతాధ్యాన శ్లోకం.

అని జన్మాంతరాలలో ఆత్మగతమైన కొన్ని భావాలు స్థిరంగా ఉంటాయన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

మాయా మోహితుడయిన మానవుడు క్షణభంగురం అయిన జీవితంలో యదార్థజ్ఞానాన్ని పొందలేక అసత్యాలను సత్యాలుగా భ్రమిస్తాడు. ఈ బంధాల వ్యామోహం మానవుని భగవత్‌జ్ఞానానికి దూరం చేస్తోంది. కనుకనే వేదాంతులు—

"కిం యానేన ధనేన వాజికరిభిః ప్రాప్తేన రాజ్యేన కిం
కిం వా పుత్రకళత్ర మిత్ర పశుభిర్దేహేన గేహేన కిం
జ్ఞాత్వైతత్ క్షణభంగురం సపదిరే త్యాజ్యం మనోదూరతః
స్వాత్మార్థం గురువాక్యతో భజభజ శ్రీపార్వతీ వల్లభం."[1]

అంటూ ప్రాపంచిక విషయాలు అశాశ్వతాలని గుర్తుచేస్తుంటారు. అశాశ్వతాలయిన ఈ బంధాల వ్యామోహం వదలి జ్ఞానాభివృద్ధితో పరమాత్మధ్యానతత్పరత పెంచుకోవాలంటుంది వైదికవాఙ్మయం. రాయప్రోలువారుకూడా ఈ బంధాలు అశాశ్వతాలని అంటూ వాటికోసం శాంతిని వీడి అశాంతి పాలు కావద్దని ప్రబోధించారు.

........"బుద్బుద చంచలంబులయి మాయుంగాదె ప్రాపంచికా
ధేయ స్నేహ విరోధ భావములు; శాంతిన్ వీడగా నేలొకో!"[2]

'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అని ఆర్యులన్నట్లుగా మనస్సే బంధాలు పెంచుకోవడానికిగాని, ఆ బంధాలనుండి విముక్తిపొందడానికిగాని కారణం. మనస్సుననుసరించే వాక్కు, కర్మ ఉంటాయి. త్రికరణశుద్ధిగాచేసే ప్రతి పనికి ఆధారం మనస్సే కనుక మనసుకు ఈ బంధాలు అశాశ్వతాలన్న భావాన్ని అలవరచినపుడు దానిని అనుసరించి కర్మ దానంతట అదే సాధ్యం అవుతుంది. ఆ స్థితికి ముందుగా మనసుకు స్థైర్యం. ధైర్యం చిక్కి శాంతి పొందడం

1. 'శివాపరాధ క్షమాపణ స్తోత్రం' - శ్రీ శంకరాచార్యులు.
శంకర గ్రంథ రత్నావళి - vol. 8 - p. 86.
2. 'లలిత' - అభినవ కవిత - p. 210.

అపూర్వంగా ఆవుతోపోల్చి తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు.[1] "సందెకడల పల్లె ప్రవేశించు ధేను దేవతల దర్శించి ఆనందిస్తుంటే దినాలు నిమిషాలుగా గడిచి పోయినవి"[2] అని అంటూ గోవు దేవత అన్న భావాన్ని వ్యక్తం చేశారు.

'న శివేన వినాదేవీ దేవ్యాచ నవినా శివః
నైతయో రంతరం నాస్తి చంద్ర చంద్రిక యోరివ'

అని చంద్ర చంద్రికలవలె శివశక్తుల అభేదం ప్రాచీనులతో భావింప బడింది

"శివః శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవందేవో నఖలు కుశలః స్పందితు మపి
అతస్త్వామారాధ్యాం హరిహర విరించాది భిరపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృత పుణ్యః ప్రభవతి"[3]

అని శక్తియుక్తుడయినపుడే భగవంతుడయినా శక్తివంతుడు, అభివ్యక్తుడు కాగలడని, లేకుంటే స్పందన కూడా సాధ్యం కాదన్న భావం శక్తిప్రాధాన్యాన్ని సూచిస్తుంది.

రాయప్రోలువారు స్త్రీకి ప్రముఖ స్థానం ఇచ్చి గౌరవించడానికి శివశక్తుల లోని ఈ శక్తిప్రాశస్త్య దృష్టి పూర్వరంగంగా భాసించిందనవచ్చు. 'పూర్వజా త్రిపురాంబికా' అని భావించిన సుబ్బారావుగారు స్త్రీని ప్రథమురాలిగా పరిగ ణించారు. 'స్త్రీ పురుషులకు పరంపరాగతముగానే ప్రధాన, ద్వితీయ స్థానము

---

1. 'పచ్చి పాడి యావు వంటిది కావ్యంబు
లేగ గుడిపి చేపురాగ దువ్వి
పిదుక నమృతమిచ్చు పొదుగు గ్రుద్దుతివేని
కాలువిసరు జున్నుపాలురావు'
'తెలుగుబంతి' - వనమాల p. 23.
2. 'రూపనవనీతమ్' - మొదటి రంగము - p. 15.
3. సౌందర్యలహరి - శ్రీ శంకరాచార్యులు శ్లోకం-1.

"దేవాన్ భావయ తానేన తేదేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ."[1]

యజ్ఞం చేత దేవతలను తృప్తిపరచి సంతుష్టులయిన ఆ దేవతలవల్ల సర్వోత్తమమైన సంతోషాలు పొందడం వేదోక్త కర్మలలో ఒకటి. యాగంలో ప్రధానమయినవి మంత్రం - దేవత - హవిస్సు. బ్రాహ్మణుడు మంత్రం చదవగా, యాగానికి తృప్తిపొంది యాగఫలాన్నిచ్చేది యాగదేవత. హోమానికి కావలసింది గోఘృతం. యాగానికి ముఖ్యమయిన హోమద్రవ్యాన్ని ఇచ్చేది గనుక బ్రాహ్మణులతో పాటు ప్రత్యేకంగా గోవును పేర్కొనడం జరిగి ఉంటుంది. ఆ విధంగా పవిత్రమైన గోవును పూజించడం అనాదిగా వస్తున్న హైందవ ఆచారం.

రాయప్రోలువారు గోవును ప్రత్యేకంగా గౌరవ దృష్టితో వీక్షించడానికి, అభిమానించడానికి ఈ సంప్రదాయాన్ని పూర్వరంగంగా చెప్పుకోవచ్చు.

"నిర్మల కుటుంబ సుపయస్వినీమ తల్లి
కోనల తనంత పెరిగిన కసపు మెసవి
ప్రేమ దుగ్ధమ్ము ముప్పూట పిదుకదేల ?
పాలుద్రావ పూజించెడి బ్రాహ్మణులును
మాంసము భుజింప ఖండించు హింసకులును
ఒక్కటయి యేల గోవుల నుండనీరు
పుట్టిపెరిగిన ఇష్టభూముల సుఖాన!"[2]

అంటూ గోవుల పట్ల వారికున్న అభిమానాన్ని వ్యక్తం చేశారు. వారి రచనలో గోవు పదే పదే పేర్కొనబడుతూ ఉంటుంది. ఆవూ దూడల అనురాగాన్ని అధికంగా ప్రస్తావిస్తుంటారు. మాతృవాత్సల్య ప్రస్తావం వచ్చినపుడు ఆవూ దూడల వాత్సల్య క్రీడలను అతి రమ్యంగా చెప్తుంటారు. కావ్యాన్నికూడా

---

1. భగవద్గీత - కర్మయోగము - 11వ శ్లోకం.
2. తెనుగుతోట - అభినవకవిత - p. 330.

సీతారాముల అనురాగాన్ని, స్త్రీ పురుష సంబంధాన్ని ప్రకృతి పురుష యోగాన్ని గూర్చి వారు వెలిబుచ్చిన అభిప్రాయాలు వారు దాంపత్య ధర్మంలో ప్రకృతి పురుష యోగాన్ని, శివశక్తి సమ్మేళనాన్ని దర్శించారనడానికి బలాన్నిస్తాయి.

ప్రకృతి పురుషుల దివ్య ప్రభావ రుచుల
సృష్టియందు దర్శించ హర్షింపనయ్యె
ఏతదమలిన చ్ఛాయలన్ గృహ ముఖాన
ఆదరించి ఆరాధింపరాదదేల ?[1]

ఈ భావన వీరిలో ఉంది కాబట్టే వీరి 'మాధురీదర్శనమ్' రచనలో శివశక్తి సమ్మేళనాత్మకమైన యోగస్పర్శ లీలగా గోచరిస్తుంది. ఇదే అభిప్రాయాన్ని 'రూపనవనీతమ్'లో ఒక సందర్భంలో ఇలా అన్నారు : 'రామాయణములో సీతారాముల మిధునకామము విపాకమును పొందింది.... దంపతీ ధౌతమయిన ఆ కామం త్రివర్గ పరిణద్ధమైన శుద్ధకామం.... ప్రకృతి పురుషుల బ్రహ్మాండ లీలయే కామం. ఏ తన్మహా మధుర యోగస్థాయియే రతి. సామాన్యజంతు సంతానమునందు రతి అంతటను ఋజు ఋతూద్దీపన లక్షితంగా ఉంది. పుష్పిత బుద్ధీంద్రియులైన మానవులలో అది స్త్రీ పుంసయోగమై అలౌకిక సుఖానుభూతి నందింపగల సత్యాంశగా సిద్ధి పొందింది.... ప్రాణిపాయకమైన పాశవిక నైజం ఇరువురిలోనూ అపరిహార్యంగా ఉన్నది. ఆ పశుప్రసక్తి ప్రసారములను మానుషంగా మార్దవించి సుమానుషంగా సౌష్ఠవించి సురభూయ సుందరం కావించడమే స్త్రీ పుం సంయోగం.... మానవ స్వరూపంలోనే ఈ వ్యవస్థ రెండు సగసగాలుగా ఉన్నది. ఈ రెండు సగాలూ ప్రకృతి పురుష ప్రతిపత్తిలోనే ఉన్నవని కొందరు పురాణ బ్రహ్మవాదు లనకపోలేదు. అకామంగా సృష్టి జరిగింది. నాడు మొదలు నేటి వరకును ప్రకృతి పురుషులు ఏకం కావలెననే అవ్యక్త సూత్రం ఇద్దరినీ సమంగానే లాగుతున్నది. అందువల్ల స్త్రీ పుంసయోగంలో కూడా ఈ ద్వంద్వ స్థితి విరుద్ధం

1. 'అర్థమాలలు' - వనమాల - p. 44.

లభ్బినవి'.... స్త్రీ లేకపోతే శ్రేయస్సు లేదు. ప్రపంచం అరిష్టదష్టమై నష్టమవు తుంది..... స్త్రీలోకమందు అదృష్టంగా ఉన్న దివ్యస్వరూపం నేడు నాకు దర్శన మయింది."[1] అంటూ స్త్రీలో వారు భావనచేసిన శక్తిని, దివ్యత్వాన్ని అభివ్యక్తం చేశారు. "....స్త్రీ గర్భంలో పురుషుడు సర్వసాధారణం. అందుకే లలితా సహస్రనామాల్లో 'పూర్వజా త్రిపురాంబికా' అని నామం. అంటే ఈశ్వరుడికన్నా లలిత ముందు పుట్టిందీ అని నేను తీసుకున్నా. క్షేత్రానికే ప్రాముఖ్యం.....బలం అంతా స్త్రీది అని ఒక సిద్ధాంతం ఉంది. బిడ్డను మోసేది స్త్రీ కనుక మాతృ గర్భానికి, మాతృమూర్తికి గౌరవం ఎక్కువ ఉంచాలి"[2] అంటూ స్త్రీని గూర్చిన వారి తాత్త్విక దర్శనాన్ని వెల్లడి చేశారు సుబ్బారావుగారు. ఈ విధమైన వీరి తత్త్వచింతనకు ఆదిశక్తి ప్రాధాన్యం కొంత దోహదం చేసినట్లు కనబడుతుంది. ఈ సృష్టి సమస్తం శివశక్తుల విన్యాసం అనే భావం వీరి ఊహలో కనబడుతుంది.

శివశక్తి సమ్మేళనం వంటిదే ప్రకృతి పురుషతత్త్వం. నిర్గుణమయిన పర బ్రహ్మ అవ్యక్తుడు. ఆ వ్యక్తం చిల్లిలా విలాసంగా ప్రకృతి పురుషులుగా వ్యక్త మయి, తిరిగి ఆ ప్రకృతి పురుషుల కలయిక వల్లనే జగత్తులో సృష్టిరూపంగా వ్యక్తమవుతున్నది. ఈ చరాచర ప్రపంచమంతా ప్రకృతే. ఆ ప్రకృతి జడం. అటువంటి ప్రకృతికి ప్రాణమూ, చైతన్యమూ కలిగించింది పురుషుడు. అనాదీ, అనంతమూ అయిన సృష్టికి ప్రకృతి పురుషులు కారకులు. ప్రకృతి దేహంకాగా పురుషుడు చైతన్యం అయ్యాడు. సర్వభూతాలూ ఆ సంయోగంవల్లనే కలిగాయి. వారి సంబంధం అవినాభావమూ, పరస్పరాశ్రయమూ. రాధాకృష్ణ తత్త్వాన్ని ఈ విధమైన ప్రకృతి పురుష యోగంగా భావనచేసే సంప్రదాయం ఉంది.

రాయప్రోలువారు స్త్రీ పురుష దాంపత్య ధర్మాన్ని దర్శించిన పద్ధతి వెనుక ఈ తాత్త్విక దర్శన ప్రభావం కొంత ఉన్నట్లు తోస్తుంది. దాంపత్య ప్రసక్తి వచ్చినప్పుడు 'స్త్రీ పుంసయోగం' అన్న పదబంధాన్ని ఎక్కువగా ప్రయోగి స్తుంటారు. 'స్త్రీ పుంసయోగోద్భవా అన్నట్లు వాడతాను. ఎక్కడా సంభోగం అన్న పదం వాడను.'[3]

---

1. 'రూపనవనీతమ్' - ఆరవ రంగము, అయిదవ రంగము - p. 86, 56.
2. Interview with Sri Rayaprolu on 8-7-81.
3. Interveiw with Sri Rayaprolu on 11-6-81.

'....కాలేనావరణా త్యయా త్పరిణతే యత్స్నేహసారే స్థితం....'[1] అన్న భవభూతి వాక్కు సుబ్బారావుగారు స్నేహానికి ప్రముఖస్థానం ఇవ్వడానికి ఆలంబనం అనవచ్చు, ఈ సుమానుష ప్రేమ వీరి ధ్యేయం. ఇటువంటి అభిప్రాయాన్నే ఒక సందర్భంలో వెలిబుచ్చారు. 'మిథునానురాగమునందు కూడ సంభోగ శృంగారమును గాక ఉపనాగరక సాహచర్యమునే యుత్పాదించును. భవభూతి ఆదేశించిన 'సుమానుషప్రేమ'ను భావకవి ప్రాప్యముగా నారాధించు చున్నాడు. అతని రసోపాసనకు అధిష్ఠాన దేవత కూడా ఆ ప్రేమయే.'[2] ఈ విధంగా దాంపత్యంలో ఇంద్రియాతీతమైన అనురాగబంధాన్ని స్నేహంగా గుర్తించడంలో భవభూతి ప్రభావముద్ర రాయప్రోలువారి మీద బలంగా కనబడుతుంది.

"ఇయగ్గేహే లక్ష్మీ రియ మమృతవర్తిర్నయనయో
రసావస్యాస్స్పర్శో వపుషి బహుళశ్చందనరసః"[3]....

వంటి వర్ణన రాయప్రోలువారు వర్ణించిన స్త్రీ సౌందర్యవర్ణనకు తోడ్పడి ఉంటుంది. ప్రబంధకవుల శృంగారవర్ణనలు నచ్చని సుబ్బారావుగారి వంటి నవ్యకవికి స్నిగ్ధ సుకుమారమయిన ఇటువంటి వర్ణన ఆదర్శప్రాయం అయింది. ఉత్తరరామచరితలో సీతాదేవి వర్ణన తమకు నచ్చినట్లు మాటలలో కూడా అప్పుడప్పుడు చెప్తుంటారు.

'బక్క పలచని నెమ్మేను పచ్చిపసుపు
కొమ్మువలె మంగళచ్ఛాయ క్రుమ్మరింప
ఇంతలేసి కాటుక కండ్ల యింపుతోడ
మగువ ఆకలిదప్పులు మాయచేయు.'[4]

---

1. ఉత్తరరామచరిత్ర - ప్రథమాంకం.
2. అభినవాంధ్రకవి పండిత సమ్మేళనము - ద్వితీయ సమావేశం. భారతి - ఫిబ్ర. 1934.
3. 'ఉత్తర రామచరిత' - ప్రథమాంకం.
4. 'పెండ్లి లగ్నం' - మిశ్రమంజరి - p. 59.

కానక్కరలేదు'[1]. ఈ విధంగా వీరు భావించిన నరనారీ సంబంధం అయిన దాంపత్య ధర్మంలో ప్రకృతి పురుష లీలాత్మకమైన యోగ పవిత్రత తొంగి చూస్తుంది.

## ప్రాచీన సాహిత్య ప్రభావం

సీతారాముల అనురాగాన్ని అద్వైత మిథున యోగంగా 'చాక్షుష క్రతువు'గా 'శ్రవణ సవనం'గా భావించిన రాయప్రోలువారికి రామాయణం అభిమాన గ్రంథం. కనుకనే "రామాయణం మీద **'faith'** పెట్టు....అది **first poetry work**" అని అంటారు[2].

'కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలం'[3]

అన్న శ్లోకచ్ఛాయలో 'మామిడికొమ్మమీద కలమంత పరాయణుడైన కోకిలస్వామికి మ్రొక్కి....అంటూ వాల్మీకిపట్లగల గౌరవం చూపారు. 'ఉత్తర రామచరిత్ర'పై అభిమానానికి రామాయణం మీద ఉన్న గౌరవం దోహదంచేసి ఉంటుంది.

రాయప్రోలువారి తాత్త్వికచింతనపై అమిత ప్రభావాన్ని చూపినవాడు భవభూతి. భవభూతి అభివ్యక్తం చేసిన సుమానుష ప్రేమను ఆదర్శంగా గ్రహించారు రాయప్రోలువారు. దీనిని దృష్టిలో ఉంచుకుని అమలిన శృంగార సిద్ధాంతానికి రూపకల్పన చేశారు. దాంపత్య శృంగారంలో కాలక్రమంగా స్థిరంగా నిలిచి ఉండేది స్నేహమేనని వీరు అభిప్రాయపడడానికి భవభూతి గురుతుల్యుడు.

---

1. 'రూపనవనీతమ్' - ఏడవ రంగము - p. 112, 113, ఆరవ రంగము 73, 74.
2. **Interview with Sri Rayaprolu on 11-6-81.**
3. 'శ్రీ సుందరకాండ' - రాయప్రోలు - p. 1 లో ఉల్లేఖింపబడింది.

ఆ ఘట్టాన్ని తెలుగుచేసి కావ్యంలో ఇమిడ్చారు. కేవలం ఒక్క అజవిలాపమే కాదన్నట్లుగా 'కాళిదాసకవీంద్రుని నాటకత్రయము బహుపర్యాయములు సాకల్యముగా సమాలోచనచేసి, ఆ మీద తృణకంకణము కూర్చినారు.' నాటకత్రయప్రభావాన్ని ప్రస్తావించారు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు.[1] తృణకంకణంలో నాయకుడు నాయికకై చింతిస్తున్న ఘట్టంలో అజవిలాపముద్ర కొంత కనబడుతుంది.

పాత్రల స్వభావానికి అనుగుణంగా అనుభూతులకు అధికప్రాధాన్యం ఇవ్వాలని రాయప్రోలువారి అభిప్రాయం. అప్పుడు రచనకు జీవం వస్తుందని వీరి ఉద్దేశం. ఈ విధమైన వీరి దృష్టికి కూడా కొంతవరకు కాళిదాసు కారణం అని అనుకోవచ్చు. కాళిదాసు శకుంతలలోని పాత్రల అనుభూతుల వర్ణన వీరిని ఆకట్టుకుంది. దీనిని దృష్టిలో పెట్టుకుని 'శకుంతల'అనువాదం చేసినట్టు కనబడుతుంది.[2]

"పురాణమిత్యేవ నసాధు సర్వం నచాపికావ్యం
నవ మిత్యవద్యమ్[3]........ .."

అన్న కాళిదాసు భావానికి ప్రతిబింబంలాగా—

---

1. 'తృణకంకణ నీరాజనము' - తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి.
2. "పాత్రలకు ఇంటిమసీని, పాత్రల ఫీలింగ్స్‌లో ఇంటెన్సిటీని కాళిదాసు నిరూపణ చేశాడు. అదీ ఆ నాటకంలో కీలకం. ఇంటిమసీవల్లనే కణ్వుడు, శకుంతల నాటకంలో పాత్రలయినారు. శకుంతలా దుష్యంతుల సంగతి కణ్వునికి తెలిసింది. శకుంతలను ఏమీ అనలేదు. ఆమెను భర్త దగ్గరకు పంపటానికి అన్నీ సిద్ధం చేశాడు. ఆ నాల్గవ అంకం అంతా పాత్రల ఫీలింగ్స్‌ను ఒలకబోయటమే. పొయిట్రీయే అలా ఉండాలి. ముఖ్యంగా డ్రామా అలా ఉంటేనే డ్రామా. నా శాకుంతలానువాదం చూడండి...." 'ముఖాముఖి' I రాయప్రోలు వాఙ్మయ జీవిత సూచిక. p. 32.
3. 'మాళవికాగ్నిమిత్రము' - కాళిదాసు - ప్రస్తావన - 2 వ శ్లోకం.

రాయప్రోలువారి రచనలో కనబడే ఇటువంటి సుకుమారమైన వర్ణనకు భవభూతి వర్ణనా విధానం ప్రాతిపదికగా తోడ్పడి ఉంటుంది. 'ఉత్తరామచరిత'పై అభిమానంతో తెలుగులోకి అనువదించారు.

రాయప్రోలువారు అభిమానించే మరొక మహాకవి కాళిదాసు.[1] కాళిదాసును గూర్చిన ప్రసక్తి లేకుండా వారు ప్రసంగించే సందర్భాలు చాలా తక్కువని చెప్పవచ్చు. పెంచిన ప్రేమకు ఉదాహరణగా శకుంతలమైన కణ్వుని అనురాగాన్ని వీరు తరచు ప్రస్తావిస్తుంటారు. తొలకరి మేఘాన్ని చూడగానే అప్రయత్నంగా 'ఆషాఢస్య ప్రథమ దివసే' అని కాళిదాసును స్మరిస్తారు.[2] 'శకుంతల', 'దూత మత్తేభము' వంటి వీరి రచనలకు కాళిదాసుపైగల అభిమానం కారణం కావచ్చు. ఇంతగా వీరభిమానించే కాళిదాసు ప్రభావం వీరి రచనపై ఉండడం సహజం. "'మేఘదూతం' నన్ను inspire చేసింది"[3] అంటూ మేఘసందేశం తనకు ప్రేరణ కలిగించిన రచనగా చెప్తారు. రాయప్రోలువారి రచనల్లో ముఖ్యంగా పేర్కొనబడే తృణకంకణ రచనకు కాళిదాసు రఘువంశం దోహదం చేసిందని ఒక సందర్భంలో పేర్కొన్నారు. 'రఘువంశంలో అజవిలాప ఘట్టం నన్ను బాగా ఆకట్టుకుంది. అజమహారాజు అనుభవించిన వియోగ దుఃఖాన్ని కాళిదాసు వర్ణించిన విధం నా హృదయంలో ముద్రపడింది. తృణకంకణం వ్రాయటానికి అదొక కారణమైంది.'[4] అని రఘువంశం ఆకర్షించినట్లు స్పష్టం చేశారు. అజవిలాప ఘట్టం మీద ఉన్న ఈ అభిమానం వల్లనేమో "రమ్యకమల"లో సందర్భోచితంగా

---

1. 'నాకు మొదటి నుంచీ భవభూతి, కాళిదాసు అంటే చాలా ప్రీతి'. ముఖాముఖి I, విమర్శిని 4. అనుబంధం - p. 32.
2. 1910 ప్రాంతంలో బందరు ప్రయాణం గూర్చిచెప్తూ 'గ్రీష్మం బాగా భీష్మంగా మండింది. రోళ్ళు పగిలినవి. అయితే ఆషాఢ ప్రథమ దివసం. దానితో ప్రథమ పయోధరం. తొలకరి కన్నె పరికిణీ పయ్యెద లాగ ఆకాశ వీధిలో కన్పించినవి'.
   మధురస్మృతులు - ముట్నూరి కృష్ణారావు (వ్యాసము)
   రాయప్రోలు సుబ్బారావు. కృష్ణా పత్రిక వజ్రోత్సవ సంచిక 14-2-64.
3. 15-6-79 రేడియో ప్రసంగము.
4. 'ముఖాముఖి' III రాయప్రోలు వాఙ్మయ సూచిక. p. 35.

విగళిత సుఖమై శబ్దము
తగిలెడి అర్థము వధుపు ధవుని విధమునన్'[1]

అని శబ్దార్థాల సంబంధాన్ని పేర్కొన్నారు. ఈ అర్థాన్నే ధ్వనింపచేస్తూ 'వాగర్థ' శబ్దాన్ని అక్కడక్కడ ప్రయోగించారు.[2] కాళిదాసుని స్తుతించడం కూడా వాగర్థప్రణయ పరంగానే కీర్తించారు.[3]

'యావద్ధర్మాచరణకు తావలము శరీరమనిరి'[4] అని సుబ్బారావుగారనడం 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్'[5] అన్న కాళిదాసు వాక్కును గుర్తుకు తెస్తుంది.

స్వప్నకుమారములో తెల్లసురపొన్నపూల సంకెళ్ళను త్రెంచనని ప్రమాణం చేస్తూ నాయకుడు.

"........త్రెంచలేనెట్టులో సహియించువాడ
సన్నగిల్లు హస్తము నుండి జాఱుదాక'[6]

అని అనడం 'కనకవలయ భ్రంశరిక్త ప్రకోష్ఠః'[7] అన్న కాళిదాసు వర్ణనను తలపిస్తుంది.

---

1. మాధురీ దర్శనము - p. 24.
2. (a) విహిత వాగర్థ శోభన వికృతి కల్పన
శబ్దకాండ మనంతమై శాఖసాగె - (రమ్యాలోకం p. 11)
(b) వాగర్థ విశ్వముఖమున
భోగింపసగు అనంత భూతంబులలో
రాగిలు మధు హవి
ర్భాగము ..........
(c) సుకవి వాగర్థ బాంధవస్ఫోటరక్తి....శబ్దమునించు
(d) 'వాగర్థంబుల బాంధవంబు చివిరింపన్'........ 'నివేదన'- వనమాల p. 73.
3. 'వాగర్థ ప్రణయము గీర్తించెదు మృదుగుణులను భావింతుము' తృణ కంకణము p. 9.
4. 'నందా' - మిశ్రమంజరి - p 119.
5. 'కుమార సంభవము' - పంచమ సర్గము - 33 వ శ్లోకం.
6. స్వప్న కుమారము - p 23.
7. మేఘసందేశము - 2 వ శ్లోకం.

'ప్రాతగిలిన మాత్రాన భవ్యములు కావు
నవ్యమైన మాత్రన నింద్యములు కావు'[1]

అని అన్నారు రాయప్రోలువారు.

తృణకంకణనాయిక వర్ణనలో 'కన్నెగేదంగి చెండునా కనుపు లొలయు. నా వెలంది యొడల్ నగలేవి లేక'[2]. ...... సహజ సౌందర్యాన్ని వెదజల్లుతున్న దనే సందర్భం-

....'ఇయమధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్'[3]

అని వర్ణించిన కాళిదాసును తలపింప చేస్తుంది. ఈ స్నిగ్ధ సౌందర్యవర్ణనే కాదు, పెంపుడు లేడిని ఒక దానిని కల్పించడం, ఆ పెంపుడు లేడితో నాయిక జరిపిన ముద్దు ముచ్చట్లు శకుంతలను జ్ఞప్తికి తెస్తాయి.

'శ్యామా శ్యామల తామలమ్మగు ప్రవాసస్నాన పుణ్యోదక
శ్రీమద్వాటికలన్'[4]........

అనే విధమయిన ఎత్తుగడలో కాళిదాసు ప్రభావముద్ర అతి స్పష్టంగా కనబడుతుంది.

'వాగర్థావివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ'[5]

కాళిదాసు ఆదిదంపతుల స్తుతిలోని ఈ వాగర్థ బాంధవ్యాన్ని అనుసరిస్తూ రాయప్రోలువారు -

---

1. రమ్యాలోకము - p. 28.
2. తృణకంకణము - p. 1.
3. అభిజ్ఞాన శాకుంతలము - ప్రథమాంకం - 18 వ శ్లోకం.
4. స్వప్నకుమారము - p. 22.
5. రఘువంశము - 1 వ శ్లోకం.

# రాయప్రోలువారి మీద ప్రభావం చూపిన వ్యక్తులు

**పినతల్లి :** రాయప్రోలువారి మీద అధిక ప్రభావం చూపిన వ్యక్తులలో ప్రథమురాలు వారి పినతల్లి శ్రీమతి రామడుగు నరసమ్మగారు. వారి మనసులో స్త్రీ వర్ణనలపట్ల ఆలోచన సాగి, స్త్రీని గూర్చి కొన్ని స్థిరభావాలను ఏర్పరచుకోవడానికి ఆవిడే ముఖ్యకారణం అని చెప్పవచ్చు. రాయప్రోలు వారు స్త్రీ పట్ల చూపే గౌరవానికి, వారి రచనల్లో స్త్రీ గుణాలకు ప్రాధాన్యం లభించడానికి, స్త్రీలో వారు మాతృమూర్తిని దర్శించడానికి మూలాధారంగా వారి పినతల్లి నిలబడుతుంది. సుబ్బారావుగారు కవిగా రూపుదిద్దుకుంటున్న కాలంలో ఆవిడ మాటలు వారి మనసులో చెరగని ముద్ర వేశాయి. వారి ఆలోచనలకు ఆవిడ ఏవిధంగా ప్రేరేపణ నిచ్చిందో స్పష్టంగా చూపుతాయి వారు చెప్పిన ఈ మాటలు:

"అయితే నా అంతః కరణ తంత్రులను శ్రుతి చేసిన ఛాయా సంధ్యా మాత్రం గుర్తున్నది; అది నివేదిస్తాను. వండి అన్నం ఆరకుండా పాలూ మీగడా కలిపి తినిపించి నన్ను పెంచింది మా పిన్ని. ప్రతి దినమూ ఏ రామాయణమో, పురాణమో చదివి ఆవిడకు వినిపించే వాడుక ఉండేది.

ఒకనాడు అనసూయ చరిత్ర చదివి ముగించితిని. అది అంతా సాంతంగా విన్నది. చిట్టచివరకు 'నాన్నా ! చూచావురా ! త్రిమూర్తులు కూడా ఎలా తల్లి కంటితో చూస్తే చంటి పిల్లలైనారో ? ఈలాంటి భావం మన కథా కలాపాలలో ఇంకా అధికంగా ఉంటే ప్రేమ భాండం తొణికేదా ? ఏ గ్రంథంలో విన్నా ఆడ వాళ్ళను గురించి ఏమేమో వ్రాస్తారు మగవాళ్ళు' అని అన్నది. కథ కంచికి పోయింది. ఆ పలుకూ, ఆ స్వరమూ, ఆ శ్రుతీ కూడా నాలో ఏ పచ్చని పడక మీదనో శయనించి నిదరపోయినవి. కాని అనంతరం ముక్తకంఠమైన నా రాగాని కంతా అదే అమృత బీజమని విధేయ విజ్ఞాపన. అది మొదలుకొని 'క్షీరసాగర శయనా' అనే గీతం వినబడితే ప్రేమరూపిణియైన తల్లి ఆమె వక్షస్థలం మీద

ప్రాచీన ఆంధ్ర కవులలో నన్నయ ఛాయ కొంత రాయప్రోలువారిపై కన బడుతుంది. "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు, యే లోకానాం స్థిత మావహన్త్య విహతాం స్త్రీపుంస యోగోద్భవాం" అనే స్తుత్యాత్మక పద్యంతో నన్నయ గ్రంథారంభం చేశాడు. దీనికి సన్నిహితమైనది రాయప్రోలువారు భావన చేసిన నరనారీయోగం. కనుకనే స్త్రీపుంసయోగద్భవా అన్న నన్నయ దృష్టి వీరిని ఆకర్షించిఉండవచ్చు. దీనితోపాటు నన్నయలో వీరిని ఆకర్షించిన లక్షణం అక్షరరమ్యత.

'సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తిలో
నారసి మేలు నానితరు లక్షర రమ్యత నాదరింప'[1]....

అని నన్నయ పాఠకాదరణ పొందుతుందని భావించిన అక్షర రమ్యతపై సుబ్బారావుగారికి అభిమానం ఉన్నట్లు తోస్తుంది.

........'ఈ వేగాతివేగోక్తిదు
ర్వ్యసనం బేటికి త్రిప్పుమింక జననీ! రమ్యాక్షరక్షోణికిన్'[2]

అని వీరు ప్రార్థనచేయడంలో నన్నయ ఉద్దేశించిన అక్షర రమ్యత ధ్వనిస్తుంది. అక్షరరమ్యత శ్రవణసుఖాన్ని ఇస్తుందని వీరు భావించారు. సత్యకవులు దానికి ప్రాధాన్యం ఇస్తారంటూ-

'మృదుల సరళాక్షరముల సమ్మేళనమున
ఆర్ద్రి నవనీత మార్దవమందు నుడులు'[3]

అని అన్నారు. నన్నయ ప్రసక్తి వచ్చినపుడు అక్షర రమ్యతనుగూర్చి ప్రస్తావించడం కనబడుతుంది.[4]

కొన్ని వర్ణనలమీదఁ పద్యపు ఎత్తుగడమీద, పదబంధాలలో, క్రియారూపా లలో వీరిమీద తిక్కన, పోతన, శ్రీనాథుడు, పెద్దనవంటి ప్రాచీనాంధ్ర కవుల ప్రభావం కొంత కనబడుతుంది. కాని వీరి తాత్త్విక చింతనపై విశేషంగా వారి ప్రభావం కనబడదు. అయితే వీరికి పరిచితులు సన్నిహితులు అయిన కొందరు వ్యక్తులు వీరి ఆలోచనా విధానాన్ని ప్రభావితం చేశారు. ఆ ప్రభావం వీరి తాత్త్విక దర్శనానికి కొంత దోహదం చేసింది.

---

1. శ్రీమదాంధ్ర మహాభారతము - అవతారిక - 26 వ పద్యం.
2. 'సతమున్ ధేనువకొండవారి' - వనమాల - p. 39.
3. రమ్యాలోకము - p. 20.
4. 'నన్నయాక్షర రమ్య ప్రసన్న ఫణితి....' రమ్యాలోకము - p. 1.
'అక్షర రమ్యతనెరిగిన దక్షుడు....' మాధురీ దర్శనమ్ - p. 9.

ధృతిః క్షమాదయాశౌచం
కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహః....

అనే ఏడు గుణాలకు ప్రాధాన్యాన్నిస్తూ రాయప్రోలువారి కావ్యనాయికలు సృష్టించబడ్డారు. రూపనవనీతంలో ఒక పాత్రముఖంగా ఆ గుణాలు 'పినతల్లి చెప్తుండేదని' చెప్పించారు.[1] కష్టకమల కావ్యానికి ఆధారం అనదగిన సంఘటన వారి పినతల్లి చెప్పగా విన్నట్లు పీఠికలో వ్రాశారు.[2] పినతల్లి కోరికమీద భజగోవింద శ్లోకాలను అనువదించారు. వారి పినతల్లిని సూచిస్తూ రచనలలో అక్కడక్కడా పినతల్లి పాత్ర సృష్టించడం కనబడుతుంది. రచనలో అసంకల్పితంగా 'పిన్ని'ని గూర్చిన ప్రస్తావన వీరికి పినతల్లిపైగల అభిమానాన్ని సూచిస్తుంది.[3] "కొడుకా! చెప్పిన మాటలన్ వినవు, నీకుం దోచదు...." అని వారి పినతల్లి అంటుండేదని ఆవిడ మాటలనే పెట్టి వ్రాశానని ఒక సందర్భంలో రాయప్రోలువారు అన్నారు.[4]

---

1. రూపనవనీతమ్ - p. 86.
2. 'ఇది జరిగిన ఆగంతుకమని మా పిన్ని చెప్పగా ఎప్పుడో విన్నాను. ....మనసులో మసలుతున్న ఆ భావన కొంతకాలానికి ఈ కృతిగా రూపొందినది'. 'కష్టకమల' - ప్రకరిక.
3. 'వకుళ = ఆహా. స్మృతికి వస్తున్నది. ఆభరణాలు ధరించేటప్పుడు పాడవలసిందని మా పిన్ని ఎప్పుడూ చెప్పేది.
....చెంపలు దువ్వి, తిలకము దిద్ది, చీరా రెవికా సవరించి కన్నెను తీర్చే పిన్ని ప్రేమనూ....విప్పారేటట్లు రచించాలె'. రూపనవనీతమ్-p.86,65.
'నన్నుగని పాలపైచి ప్రాణములు విడిచె
అనటి చందాన మా యమ్మ అది మొదలుగ
పెంచి రలచేతులంబెట్టి పిన్నితోడ
సకల బాంధవులు వాత్సల్యదృష్టి' - 'ఎవరు' - జడకుచ్చులు, p. 135.
'....నిద్దురలు వాయక యుండి రసుంగు చెల్లెలున్
జ్ఞానవతీ శిరోమణి ప్రసన్నగుణోదయ నాదు పిన్నియున్'
'కనకము' - జడకుచ్చులు - p. 151.
'పిన్నితో పక్కపచ్చుచు పంటి నేను'- స్నేహలత-అభినవకపిత p.293.
4. 'కనకము' - జడకుచ్చులు p. 150.

స్వప్నకుమారంలో నాయకుడు కామ మోహితుడయి నప్పటికీ స్వప్న సుందరిగూర్చి 'ఆ దయావతి సహవాస మాసగొంటి' అని అంటాడు. లలిత తన ప్రేమ వృత్తాంతం చెప్తూ 'ఎట్టకేలకున్ ముడివడె నా సరాగమొక ముగ్ధుని స్నేహ విదగ్ధ తంతులన్' అని తన ప్రేమ స్నేహంతో ముడిపడ్డట్లు చెప్పింది. 'బ్రహ్మ ముడి' (మిశ్ర మంజరి) అన్న ఖండికలో స్త్రీ పురుషుల కలయికను గూర్చి చెప్పి నపుడు రాయప్రోలువారు-

"పట్టజాలని పలుకరాని అవశ్య హృదయ రహస్యలాలస
అడిగె నరుడా పడుచు స్నేహము....
సహచరీ సహచరులుగా స్త్రీ పురుషులాదట కలిసి మెలసిరి"[1]

అని వారి సావాసాన్ని ప్రధానంగా చెప్పారు. వీరు ఒక సందర్భంలో నూతన దంపతులను ఆశీర్వదిస్తూ-

".... ఈ నవపీతాంబర సూత్రధారుల కఖండ స్నేహ ధర్మాధికో
త్సవముల్ కూర్తురు గాత...."[2]

అని అఖండమయిన స్నేహం వారికి కలగాలని కోరుకున్నారు. ఈ విధంగా దంపతులను స్నేహితులుగా, వారి మధ్య అనుబంధంలో చెలిమిని ప్రధానంగా వర్ణిస్తారు రాయప్రోలువారు.

రాయప్రోలువారి దృష్టిలో దాంపత్యానికి సముచితస్థానం ఉంది. 'కళత్రము అర్ధాంగి. ఆమె సాహచర్యము లేకపోతే జీవితము సాంగోపాంగ వికాసమును పొందదు దక్షిణములేని ఉత్తరమవుతుంది. మానసకాసారంలో విహరించే హంసకు రెండు రెక్కలు కావాలె. అటిగాక, నిస్సంగత్వము ప్రాణిలోకమునకు నిసర్గలక్ష ణము కాదు' అని అంటారు సుబ్బారావుగారు.[3] ప్రేమ సరస్సు మిథునపద్మాలతో ప్రకాశిస్తోందని అంటారు.[4]

---

1. 'బ్రహ్మముడి' - మిశ్రమంజరి-p. 129, 130.
2. 'దీపన' - వనమాల-p. 78,
3. తృణకంకణము - నివేదన-p. 5.
4. 'అడివోరి చిన్నాడు' - వనమాల-p. 60.

ఈ విధంగా దాంపత్యం ఉభయ త్యాగ భాగ ధేయమనే అభిప్రాయాన్ని రూపనవనీతంలో వ్యక్తపరిచారు. ప్రకృతి పురుషుల లీలగా దాంపత్యాన్ని వీరు స్వీకరించినట్లు కనబడుతుంది. కనుకనే దాంపత్యాన్ని చెప్పేటప్పుడు నరనారీ సంబంధం అనీ స్త్రీ పుంస యోగమనీ వ్యవహరిస్తుంటారు. సంభోగం అన్న శబ్దాన్ని ప్రయోగించడం వీరికంత ఇష్టమైనది కాదు.[1] అటువంటి సందర్భాలలో భోగార్చన, ప్రణయార్చన అని వర్ణిస్తుంటారు.

"పచ్చి ముత్యాల తమ్మిపూబచ్చెరమున
తళుకు లరమోడ్పు గొను బంటి కలువబమర
జాజి లతికల విశద మంజరుల తోడ
చెలియ తోచె భోగార్చన సలిపినట్లు."[2]

వీరి రచనల్లో 'లలిత' కావ్యంలో కథ వివాహాంతంగా ఉంది. పరస్పరం ప్రేమించుకున్న నాయికా నాయకులు విధివశాత్తు వివాహానికి దూరమై బాధపడతారు. నాయిక ధైర్యసాహసాలవల్ల వారు తిరిగి కలుసుకుని దంపతులయ్యారు. దీనికి మూలం ఇంగ్లీషు సాహిత్యంలోని[3] దయినా రాయప్రోలువారు ప్రతిపాదించదలచుకున్న ప్రేమతత్త్వ ప్రణాళికలో దీనికి స్థానం లభించింది.

కాయిక భోగానికి అతీతంగా దంపతుల ఆత్మలను ముడివేసి కలిపి ఉంచేది స్నేహం అని రాయప్రోలు వారి విశ్వాసం. వసంతఋతువులో ప్రకృతికి వచ్చే శోభలన్నీ హిమవదాగమనంతో కళా విహీనమవుతాయి. అదే విధంగా యౌవనావిర్భావంతో వచ్చే కోరికలు, వలపులు కాలక్రమంగా వార్ధక్యంలో వన్నెచెడి నశిస్తాయి. కాని స్థిరంగా దంపతుల మధ్య నిలిచేది స్నేహం అని వీరి ఉద్దేశం. దాంపత్య ప్రసక్తిలో చెలిమి, స్నేహం, సహవాసం అన్న శబ్దాలను ఎక్కువగా ప్రయోగించారు.

---

1. "'సంభోగ' శబ్దం వాడటం నాకిష్టంలేక 'భోగార్చన చేసినట్లు' అని అన్నాను" - Interview on 11-8-81.
2. రమ్యాలోకము-p. 34.
3. రాయప్రోలువారి 'లలిత' గోల్డ్‌స్మిత్ ఇంగ్లీషు రచన 'హెర్మిట్'కు అనుసరణ.

కమ్మని వాసనయా ప్రేమరస ధౌత సుగంధాన్ని' వెదజల్లుతాయి. నిశ్శబ్ద నిశీథంలో అరణ్య మధ్యంలో పికి కూత ప్రేమావేశంతో పలికినట్లుంటుంది. గువ్వ జంట, ఆపూ మాప, స్నేహితులు కాలుష్యరహితమైన ప్రణయంతో మెలగడం జరుగుతుంది. లతాసుమాలు కామం లేని మోహనసుఖంతో పరస్పరం విడనాడ లేకుండా ఉన్నాయి. ఈవిధంగా సృష్టి సమస్తం వాత్సల్యం, స్నేహం, దాంపత్యాలతో కూడిన ప్రేమమయంగా సుబ్బారావుగారు భావించారు.

'శ్రీ రవీంద్ర కవి' గూర్చి రాయప్రోలువారు-

"పకపక నవ్వేటి పసిబాల పెదవులన్
పొడుపు వన్నెల పూచు పడతి క్రాల్గన్నులన్
చనుబాలు జడిగొను జనని నిండు మొగాన
ప్రేమ కళాంశలే వీక్షించెనావు...."[1]

అని అన్నారు. కాని ఆ పలుకులు రాయప్రోలువారి పట్ల పూర్తి సత్యాలుగా అన్వయిస్తాయి. ఈ విధంగా పరమ పవిత్రమయిన ప్రేమను అందరు గుర్తించాలని ఆశించారు. కనుకనే-

"పరమ పద సోపాన ప్రేమ ప్రపంచమునకు
నడుచు మార్గము మరల నేర్పడునె సఖియ?"[2]

అని స్నేహలతలో ప్రశ్నిస్తారు.

ఈ విధంగా వీరు భావించిన స్నేహ, వాత్సల్య, దాంపత్య ప్రేమలతో కూడిన అమలిన శృంగార ప్రణాళిక ననుసరించి ఇతివృత్తాలను గ్రహించారనుకోవచ్చు.

---

1. 'శ్రీ రవీంద్ర కవి' - ఆంధ్రావళి - p. 44.
2. 'స్నేహలత' - అభినవ కవిత - p. 200.

ఈవిధంగా వాత్సల్యం, స్నేహం, దాంపత్యం సందర్భోచితంగా వర్ణన చేయడమేకాకుండా ప్రేమతత్త్వాన్ని చెప్పేటప్పుడు సాధారణంగా ఆ మూడింటిని కలిపి చెబుతుంటారు.

"తల్లిం బిడ్డలతో విలీనమగు వాత్సల్యంబు, మైత్రీ సము
త్ఫుల్లాంతఃకరణాప్తులౌ సఖుల సాధుస్నేహమున్, ధర్మసం
పల్లగ్నాధ్యవసాయ కంకణుల దాంపత్యంబు, వాలారి వ
ర్తిల్లున్ ప్రేమరసాతిరేక పరిపూర్ణీభూత జీవంబులై."[1]

"వలపుల పూలసంకెలలు బందములేయగ గువ్వజంట, ని
ర్మలమగు వత్సలత్వమెద రాగిల నావుల తల్లిబిడ్డ, లే
కలుషములేని సత్ప్రణయ కాంక్షలు మేళనజేయ మిత్రముల్,
మెలగుదురీ రహస్యమె సుమీ! కనిపించెడు సృష్టియందునన్."[2]

సృష్టిలో అంతటా దాంపత్యశృంగారం, స్నేహం, వాత్సల్యం కనబడుతున్నట్లు వీరు భావించారు. తల్లిపాలుత్రాగే లేగచిన్నెలు తల్లిబిడ్డల వత్సలతా సౌందర్యాన్ని వ్యక్తం చేస్తాయి. పవనతరంగపు ఉయ్యాలలో పవళించడం నేర్చిన విహంగం ప్రేమ వైభవ పరిణామ గీతాలు పాడుతుంటుంది. పువ్వుల్లో, తీగలలో, పక్షికూతల్లో అన్నిటా ప్రేమరసమే చిందుతున్నది. ఆకాశంలో తారకలుసహితం మోహంవల్ల ఆకాశాన్ని వదల లేకుండా ఉన్నాయి. గువ్వజంట స్నేహకాంక్షతో వియోగాన్ని భరింపలేకుండా ఉంది. స్తన్యమోహంవల్ల పుత్రుని ముద్దాడే సౌఖ్యాన్ని తల్లి విడలేదు. రాత్రింబగళ్ళు వెన్నెల, వేడి అందించే చంద్రుడు, సూర్యుడు, ప్రాణాన్నిచ్చే పవనము, జలసమృద్ధినిచ్చే మేఘాలు - ఇటి వ్యాప్తి అంతా ప్రేమ చోదితమే. నిర్మలమయిన కంఠంతో 'అంబా'లంటూ అరిచే ఆవుదూడ అరుపులో, కొమ్మమీద కలవరించే చిన్ని చిలుక పలుకులో సుప్రభాత జనయిత్రి వాత్సల్యం, సృష్టిలోని సజీవప్రేమ మాహాత్మ్యం ప్రకటింపబడుతున్నాయి. పాలుత్రాగిన పారవశ్యంతో కేకిసలాడే లేగదూడల చెంగనాలు, తల్లిపాల సారాన్ని గ్రోలిన బిడ్డ ముఖం, తొలకరి వానలకు పులకించిన పంటచేలలో గుప్పున నలుమూలలా వ్యాపించే

---

1. 'లలిత' - అభినవకవిత-p. 212.
2. తృణకంకణము - అభినవకవిత-p. 245.

సమస్య ఏ రకంగా ఉంటుందో 'కష్టకమల'లో కనబడుతుంది. నాయికా నాయకులు ఇద్దరూ వివాహితులై స్నేహంతో సంచరిస్తూ, నాయకుని యాచ్నా చేసతకు నాయిక దాక్షిణ్యం చూపి శీలదానం చేస్తే వచ్చే సమస్య ఎటువంటిదో 'రూపనవనీతమ్' ప్రదర్శిస్తుంది. ఇక నాయికా నాయకులకు పరిచయం లేకపోయినా ఆర్థిక సమస్య వారి వివాహానికి అడ్డు నిలిస్తే పర్యవసానం ఏ విధంగా ఉంటుందో స్నేహలత చూపుతుంది.

'లలిత'లో నాయకుడు ప్రేమించిన పడతితో వివాహం జరగదని నిరాశ చెంది అడవులు పట్టిపోయాడు. 'తృణకంకణం'లో నాయకుడు నాయికకు వేరొకరితో వివాహం జరిగిందని తెలిసి ఆమెనే ధ్యానిస్తూ వైరాగ్యంతో వివాహానికి విముఖత చూపాడు. 'అనుమతి'లో వేరొకరిని వివాహం చేసుకున్నా విధివశాత్తు అల్పాయుష్కుడయ్యాడు. 'కష్టకమల'లో నాయకుడు అమాయిక అయిన నాయిక హృదయం తెలుసుకోక ప్రణయ లేఖ వ్రాసి ఆమె మానసిక వ్యధకు కారణ మయ్యాడు. 'స్వప్నకుమారం'లో నాయిక మృదువుగా తిరస్కరించినా కామాతురుడై ఆమెను కోరాడు. కాని వివేకంతో నాయిక వాత్సల్యాన్ని అర్థంచేసుకున్నాడు. 'రూపనవనీతమ్'లో నాయిక దాక్షిణ్యాన్ని ఆసరాగా తీసుకుని ఆమె సంసార సుఖాలను త్యజించి విరాగిణిగా మారేటట్లు ప్రవర్తించాడు. 'స్నేహలత'లో నాయకుడు కావ్యంలో ప్రత్యక్షంగా కనబడకపోయినా సాంఘిక దురాచారానికి, అర్థ లోభానికి కట్టుబడి నాయిక శరీర త్యాగానికి కారణమయ్యాడు. ఈ విధంగా వివిధ ప్రేమ సమస్యలలో చిక్కుకున్న యువకుల మానసిక ప్రవృత్తులను పరిణామాలను ఈ నాయకులలో రాయప్రోలువారు చిత్రించారు.[1] ఈ రకంగా ప్రేమలో వివాహంలో ఎదురవుతున్న సమస్యలను వారి రచనలలో చిత్రించి సహృదయ పాఠకుల ముందుంచారు. స్త్రీ పురుషుల మధ్య కేవలం వివాహ బంధం ఒక్కటే

---

1. 'లలిత', 'అనుమతి' కావ్యాలకు ఆంగ్ల మాతృకలు ఉన్నా, 'స్నేహలత' యథార్థ సంఘటన అయినా, వాటిని వారు ఎన్నుకోవడంలో వాటిలోని సమస్యలు వారి నాకర్షించి ఉండవచ్చును.

## స్వీకరించిన ఇతివృత్తాలలో ప్రేమ సమస్యలు

ఆధునిక సమాజంలో స్త్రీ పురుషుల పరిచయ సాన్నిహిత్యాలవల్ల వారిలో కొందరు వివాహం చేసుకోవాలని కోరుకోవచ్చు. అయితే కొందరి విషయంలో వివాహం సానుకూలపడటం, మరికొందరి విషయంలో విఫలం కావడం సహజం. అటువంటి సందర్భాలలో ఉత్పన్నమయ్యే సమస్యలు ఏ విధంగా ఉండే అవకాశం ఉందో ఊహించి రాయప్రోలువారు ఇతివృత్తాలను గ్రహించినట్లు తోస్తుంది. కనుకనే వారి కావ్యాలలో అధిక భాగం ప్రేమే ప్రధాన పాత్ర వహించింది.[1]

వివాహం వాంఛించిన స్త్రీ పురుషులకు పరిస్థితులు మధ్యలో కొంత విముఖంగా ఉన్నా వారి ప్రయత్నం సానుకూల పడితే సమస్యే లేదు. కథలో ఈ విధమైన ముగింపు 'లలిత' లో కనబడుతుంది. నాయిక వివాహం ఇతరులతో జరిగి నాయకుడు అవివాహితుడుగా మిగిలితే సమస్య ఏ విధంగా ఉంటుందో తృణకంకణం చూపుతుంది. నాయకునికి వేరే వ్యక్తితో వివాహం జరిగి నాయిక అవివాహితగా ఉండడం 'అనుమతి'లో కనబడుతుంది. నాయకుడు నాయిక సాహచర్యాన్ని వాంఛించినా నాయిక వివాహానికి విముఖంగా ఉండి కేవలం వాత్సల్య దృష్టితో నాయకుని దర్శిస్తే ఏ విధంగా ఉంటుందో 'స్వప్నకుమారం' చూపుతుంది. నాయిక ముగ్ధ అయి, ఒకచోట పుట్టిపెరిగిన సాహసంవల్ల అభిమానమే గాని, వివాహం గూర్చి ఆలోచించే వయసు కూడా లేని అమాయిక అయినప్పుడు

---

1. "రాయప్రోలు ఉపదేశించదలంచినది ప్రేమ భగవద్గీతలను. ఈయన కావ్యాల కథలు స్నేహలతాదేవి తప్ప అన్నీ కల్పితాలు. లలిత, అనుమతి ప్రాయ దముతో ఈయన ప్రారంభించిన ప్రేమ శాఖలు తృణకంకణంలో అప్రాప్త ప్రేమ, కష్టకమలంలో వికసించని ప్రేమ, స్నేహలతలో కుటుంబ ప్రేమగా విస్తరించాయి."
   'అర్ధ శతాబ్దపు ఆంధ్ర కవిత్వము' (వ్యాసము) శ్రీ కొండ గోపాలకృష్ణ మూర్తి - భారతి - నవంబరు 1962.

వాళ్ళని ప్రేమాభిమానాలతో దగ్గరగా కలిపి ఉంచుతుందని అనుకోవడంవల్ల ఇన్ని సమస్యలు వస్తున్నాయని రాయప్రోలువారి అభిప్రాయంగా కనబడుతుంది. నాయికా నాయకుల మధ్య వివాహ బంధానికి అతీతంగా స్నేహ వాత్సల్యాదులు వర్ధిల్లే అవకాశం ఉందని, శారీరక సుఖానికి అతీతమయిన ఆ ప్రేమలు శాశ్వత మయినవనీ, నిర్మలమయినవనీ, అటువంటి అమలిన శృంగార భావన కలగడం నేటి యువతీ యువకులకు అవసరం అనీ ఈ రచనా ప్రణాళిక ఉద్దేశంగా భావించవచ్చు.

# సింహావలోకనం

రాయప్రోలువారు తమ కవితా దీపికతో నవ్యాంధ్ర సాహిత్య వీధులను తేజోవంతం చేశారు. నవకవుల కెందరికో మార్గదర్శకమై నిలిచారు. ప్రబంధ క్షీణప్రబంధ యుగాలలోని శృంగారప్రాముఖ్యం, పాండిత్య ప్రకర్షల ఔద్ధత్యం వల్ల సంధియుగంలోని (19 వ శతాబ్ది) కవిత్వం ఒక మార్గం అంటూ లేక అస్థిరంగా అన్నిపైపులా పయనించింది. వివిధ మార్గాలలో సంచరిస్తున్న కవిత్వానికి ఒక పంథాను చూపినవారు రాయప్రోలువారు. తమ కవిత్వ విధానంతో భావ కవిత్వానికి ఒక రూపాన్నిచ్చారు. వైదిక సంస్కృతీ సంప్రదాయాలలోని ఔన్నత్యాన్ని తాము గుర్తించడమేకాక తరువాత వారికి కూడా అందించారు. తమ తాత్త్విక దర్శనంతో, ఆలోచనా విధానంతో కొందరికి ఆలోచించే అవకాశాన్నిచ్చారు. అమలిన శృంగార సిద్ధాంత ప్రతిపాదనతో శృంగారాన్ని గూర్చిన ఆలోచనలకు ప్రేరణ నందించారు.

కవిత్వంపట్ల కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలతో సాహిత్య సృష్టి చేశారు. కనుకనే లక్ష్య, లక్షణ కావ్యాలను రెంటినీ వ్రాశారు. నిరాశతో నిరుత్సాహాన్ని పెంచుకోకూడదనే ఆశావాదిగా దర్శనమిస్తారు. కవిత్వం అమంగళం పలుకకూడదనీ, అశుభం వాంఛించకూడదనీ, హ్లాదైక ప్రధానంగా ఉండాలనీ వీరి విశ్వాసం. భావాన్ని స్పష్టంగా చెప్పడం కంటే ధ్వని ప్రధానంగా చెప్పడంలో రమణీయత ఉన్నట్లు వీరు భావిస్తారు. కనుక వీరి రచనలలో శ్లేష, ధ్వని అధికంగా కనబడతాయి. అక్షర రమ్యత, భాషా సారళ్యం, శ్రవణ సుభగత్వం కవిత్వానికి అవసరమని వీరు నమ్ముతారు. కనుకనే చెవికి ఇంపు చేకూర్చేటప్పుడు వ్యాకరణదోషాలున్నా లెక్కచేయనక్కరలేదని అంటారు. భాషావిషయంలో వీరు స్వేచ్ఛ అనుభవించారు. శృంగార, కరుణ రసాలు రెండు ప్రధాన రసాలని వీరి అభిప్రాయం. శృంగారంలో కూడా విప్రలంభ శృంగారాన్ని నవ్యులు ఆదరిస్తారని వీరి ఉద్దేశం. సంభోగపరమైన రతికాక వాత్సల్యపూరితమైన స్నేహం వీరి లక్ష్యం.

భావోద్వేగం, బుద్ధితీక్ష్ణత చేదోడు వాదోడుగా నడిచిన కవిత్వం రాయప్రోలు వారిది. యావద్దేశాన్ని కదిలించిన సంఘటనలు వీరినీ కదిలించాయి. వాటి స్పందనగా వీరి కవితావాహినిలో సమకాలీన సమస్యలు ప్రతిఫలించాయి. ఆ కాలంలో అందరినీ కదిలించిన వార్తలు, సంఘటనలు, సన్నివేశాలు వీరికి ప్రేరణ నిచ్చి కవితా వస్తువులయ్యాయి. స్వాతంత్ర్యోద్యమం, ఆంధ్ర రాష్ట్రోద్యమం, విదేశ

మంత్ర, తంత్ర శాస్త్ర పరిచయం వల్ల ఆ సంప్రదాయాలకు సంబంధించిన పదాలు కనబడతాయి. ఈ పదాలు ప్రయత్న పూర్వకంగా వాడాలని వాడినట్లు కాక వాటితో వారికి ఉన్న పరిచయాధిక్యం వల్ల అప్రయత్నంగా వెలువడినట్లు తోస్తుంది. ఇటువంటి పదాలకు ప్రయత్నిస్తే తాత్త్వికార్థాలు స్ఫురించే అవకాశం ఉంది. అవి కావాలని వాడినవి కావు కనుక వాటికి వాచ్యార్థం కంటె దేవీ పరంగా, ఉపాసనా విధానంలో, మంత్ర తంత్ర శాస్త్రాలలో ఏ అర్థంలో వాడబడ్డాయో అటువంటి అర్థం చెప్పుకోవడం సమంజసంగా ఉంటుంది.

రాయప్రోలువారు సంప్రదాయాభిమాని, వైదికసంస్కృతీ సంప్రదాయాల పట్ల విశేషమైన అభిమానంకల వ్యక్తి - వీరి కావ్యాలలో చిత్రింపబడిన వైదిక వాతావరణం ఈ అభిమానాన్ని కొంత చూపుతుంది. వీరి మీద వేదోపనిషత్ ప్రభావం ఉంది. వీరి సంస్కారం సంస్కృత కవులది. వీరిలోని ఈ సంస్కారానికి రవీంద్రుని వంటి వారి పరిచయాలు మెరుగులు పెట్టాయి. భారతీయమైన ఈ సంస్కారం మీద లలితలలితంగా ఇంగ్లీషు కాల్పనిక కవుల ప్రభావం పడింది.

సాంప్రదాయికమైన విశ్వాసాలు వీరిలో కనబడతాయి. వీరి దృష్టిలో విధి బలీయం. పునర్జన్మను, పురాకృత కర్మఫలాన్ని వీరు విశ్వసిస్తారు. ఆత్మలో ఛాయావాసనాదికంగా గతజన్మరాగరసాలు నిలిచి ఉంటాయని నమ్ముతారు. అయితే స్మృతుల విషయంలో వీరికంత పట్టింపు లేదు. కొన్ని ఆచార వ్యవహారాల విషయంలో కూడా ఎక్కువ పట్టుదల కనబడదు.

వీరి దేశభక్తి దేవీభక్తి. భగవత్తత్త్వాన్ని గూర్చి, భగవద్భక్తిని గూర్చి వీరికి నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. వీరికి పరబ్రహ్మ తత్త్వమీమాంస అప్రధానం. భక్తి జ్ఞానాదులలో ప్రకృత్యుపాసకులైన సుబ్బారావుగారు భక్తిపైపు కొంత ప్రీతిని కనబరిచారనడానికి అవకాశం ఉంది. ప్రకృతి ముఖంగా వీరి సగుణారాధన సాగింది. ప్రకృతిలో జగన్మాత మాతృరూపాన్ని దర్శించి ఆరాధించడం వీరి లక్ష్యం. కనుకనే మాతృమూర్తిగా ఉపాసించిన దేవదేవిని ప్రకృతి ముఖంగా పృథివీ రూపంగా ఆరాధించారు. ఆ జగన్మాత దేశమాతగా వీరికి ఆరాధ్య. వీరి దేశభక్తికి ఈ ఆధ్యాత్మిక చింతన మూలాధారం అయింది. ఆ పవిత్రతే వీరి దేశభక్తి గేయాలలో ప్రాణభూతమైన అంశంగా నిలిచింది.

దార్శనిక కవి రాయప్రోలు స్త్రీ గౌరవం. మూర్తీభవించిన వ్యక్తి స్త్రీ పట్ల విశేషమైన గౌరవాభిమానాలుండడం వల్ల స్త్రీ స్థానాన్ని గూర్చి ఆలోచించి

వస్తు బహిష్కారం, వరకట్న దురాచార నిరసనం వంటివి కొన్ని రచనలకు ఆలంబనమయ్యాయి. ఇటువంటి సమస్యల ఉద్ధృతం అంతగా లేనపుడు తమదైన తాత్త్విక దర్శనంతో రచనలు సాగించారు. స్మృతి కావ్యాలు, ప్రబోధ గేయాలు, 'స్నేహలత' వంటి రచనలు ఈ విధంగా కొంత పరిస్థితుల ప్రభావంవల్ల యాదృచ్ఛికంగా వచ్చినవే ననుకోవచ్చు. తృణకంకణం, మాధురీ దర్శనం, రూపనవనీతం మొదలైన రచనలు ఉద్దేశపూర్వకంగా తమ తాత్త్విక దర్శనంతో వ్రాసినవి. దేశభక్తి గేయాలలో కవిత్వ మాధుర్యంతోపాటుగా, కవితావేశం స్ఫురించే వస్తువు కూడా ఉండడంవల్ల వాటికి అధిక ప్రచారం వచ్చి ఉండవచ్చు. ఇతర రచనలలో ఆ ఆవేశం అంతగా వచ్చే అవకాశం తక్కువ. అంతేకాక, అవి వారి తాత్త్వికదర్శనాన్ని ఆధారం చేసుకున్నవి కావడంవల్ల వాటిలోని తత్త్వాన్ని సామాన్యులు అవగాహన చేసుకోవడంలో కొంత కష్టం ఉండవచ్చు. ఈ కారణాలవల్లనేనేమో వీరికి సామాన్యుల దృష్టిలో దేశభక్తి ప్రబోధ గేయాల కవిగా ఎక్కువ పేరు వచ్చినట్లు కనబడుతుంది.

పరిస్థితుల ప్రేరణతో దేశభక్తి గేయాలు వ్రాసినా వీరి ఆధ్యాత్మిక భావన వాటిలో జీవదంశగా భాసించింది. దేశాభిమానం, భాషాభిమానం మనసు నిండా నింపుకున్న అమృత హృదయులు సుబ్బారావుగారు. తెలుగుదేశం, తెలుగుభాష, తెలుగువారి సంప్రదాయాలు వీరికందించిన పులకింతలతో కావ్యాలన్నిటిలో తెలుగుదనాన్ని మూర్తీభవింపచేశారు. తెలుగు భాషామాధుర్యాన్ని వీరి కావ్య భాషతో చవి చూపారు.

రాయప్రోలువారు సంప్రదాయవాది అయినా నవీనత కనబరిచారు. కావ్య వస్తుగ్రహణంలో, రచనా విధానంలో, భావాభివ్యక్తిలో అన్నిటా ప్రత్యేకత కనబరిచారు. అభినవ కవితగా పేరు పెట్టబడిన వీరి కావ్యాలు అడుగడుగునా కొత్తదనాన్ని నింపుకున్నాయి. తమ ఉక్తి వైచిత్రితో నవ్యతా స్ఫూర్తిని కలిగించారు.

నూతన పదబంధాలు, వైదిక పదాలు, వ్యావహారిక పదాల సమ్మేళనంతో వీరి కావ్య భాష త్రివేణీ సంగమమయింది. నూతన పద బంధాల సృష్టిలో స్వేచ్ఛను అనుభవించారు. ఇంతేకాక నిత్య వ్యవహారంలోని అతి సామాన్య పదాలను లోకోక్తులను ప్రయోగిస్తూ తెలుగు నుడికారాన్ని పోషించారు. అటు వైదిక సంస్కృతీ సంప్రదాయాలకు సంబంధించిన పదజాలాన్నీ విశేషంగా ప్రయోగించారు. వీరి కవిత్వ మార్గంలో వాడుక భాషా, వైదిక భాషా చెట్టాపట్టా లేసుకుని నడిచాయి.

దేవీ ఉపాసనా, లలితా సహస్రనామ పారాయణ వంటివి ఉండడం వల్ల, సౌందర్యలహరి, శివానందలహరి, శ్రీ సూక్తం వంటివి అభిమానాలు కావడంవల్ల,

నట్లు కనబడుతుంది. ప్రబంధాలలోని అతివేల వర్ణనకు వ్యతిరేకిగాని ప్రేమకు వ్యతిరేకి కారు. ప్రేమ స్వరూపిణి అయిన స్త్రీలోని వాత్సల్యాది అమృత గుణాలకు తమ రచనలలో ప్రాధాన్యమిచ్చారు. పురుషుల కారణంగా స్త్రీ ఎదుర్కొంటున్న సమస్యలను వివిధ కోణాల నుంచి దర్శించారు. స్త్రీ స్వభావం లోని అన్ని కోణాలు వీరి కవిత్వంలో ప్రతిఫలించాయి. పరిపూర్ణమైన స్త్రీ వీరి కావ్యాలలో దర్శనమిస్తుంది. స్త్రీని కేంద్ర బిందువుగా గ్రహించి ఆమె ఎదుర్కొనే సమస్యలను పరిశీలించి తమ అమలిన శృంగార సిద్ధాంతాన్ని రూపొందించారు.

విశిష్టమైన వీరి అమలిన శృంగార సిద్ధాంతానికి, వైష్ణవ భక్తి సిద్ధాంతంతో కొంత సామ్యం కనబడుతుంది. ప్లేటో ప్రతిపాదించిన ప్రేమ తత్త్వానికి దగ్గరి పోలికలు అమలిన శృంగార సిద్ధాంతంలో అంతగా కనబడవు.

స్నేహ వాత్సల్యాదులు రసాలుగా అంగీకరిస్తే తప్ప అవి విడిగా ఉండే అవకాశం లేదు. ఆ అవకాశం లేనప్పుడు వాటిని చేర్చడానికి వీలయినది శృంగార రసం. లోకంలో శృంగారం అన్న భావానికి ఉన్న అర్థంపై భావాలకు భిన్నమయింది. రూఢ్యర్థాన్ని పరిహరించడానికి స్నేహ వాత్సల్యాలను అంతర్భూతం చేసుకున్న శృంగారాన్ని చెప్పడానికి తగిన విశేషణంగా 'అమలిన' శబ్దాన్ని ప్రయోగించారు. జీవిత తత్త్వ దర్శనం నుంచి వెలువడ్డ అమలిన శృంగారం సాహిత్య దర్శనంగా వెలసింది. ఒక సాహిత్య సిద్ధాంతానికి పేరు పెట్టడం అన్నది అంతకు ముందున్న సాహిత్య స్థితిని బట్టి ఉంటుంది. భావ కవిత్వం అంటే పూర్వం ఉన్న కవిత్వంలో భావం లేదని కాదు. వచన కవిత్వం అంటే పూర్వం వచనం లేదనికాదు. భావానికి ప్రాధాన్యం అధికమనీ, వచనానికి ప్రాముఖ్యం ఎక్కువ అనే గుర్తింపు ఈ పేర్ల లక్ష్యం. అదే విధంగా శృంగారం అన్నపుడు దాంపత్య శృంగారం మలినమయిందని కాదు. ప్రబంధ సాహిత్యం అతివేల వర్ణనలకిచ్చిన ప్రాధాన్యం వల్ల శృంగార భావానికి ఒక విధమైన అర్థం రూఢి అయింది. దానికి భిన్నంగా శృంగారంలోని స్నేహవాత్సల్యాల వంటి వాటిలోని పవిత్రత స్పష్టం చేయడానికి 'అమలిన' విశేషణాన్ని ప్రయోగించారు.

సృష్టిలాస్యం అయిన ప్రేమ అందరి మధ్య వర్ధిల్లాలన్నది వీరి ఆకాంక్ష. స్త్రీ పురుషులు స్నేహంతో సమాజ శ్రేయస్సు నాకాంక్షిస్తూ ఉత్సాహంతో ముందుకు నడవాలన్నది వీరి ఆశంస. ఆనందమూలం, కల్యాణమయం అయిన జగత్తులో ద్వేష వైషమ్యాలను వీడి ప్రేమనుపెంచి పోషించాలన్నది వీరి ఆదర్శం.

# విశిష్ట ప్రయోగాలు*

**పదబంధ వైశిష్ట్యం :**

పచ్చిపండుగ, కన్నెపౌలాలు, స్నేహదీపము, పచ్చిరాగాలు, వన్నెలాడే నెల, క్షేత్రమాతృక, వేడివేడిపదాలు, ఆకలికాక, నాదకాసారము, పచ్చిపొట్టలు, స్నేహభాండము, పచ్చిముత్తెములు, కన్నెగిలుట, పచ్చిపాకాణి, తలపుదీపము, నడిగుండె, పచ్చిప్రాయము, నోరెడు, కన్నెతొలకరి, గండుగుణ్ణము, కన్నెనవ్వు, నవ్వుంగొమ్మ, పుస్తకశ్రీకుమారి, ఆనంద దుర్భిక్షం, గొడ్డుబోతు తీవెలు, అనుతాపమాలలు, వాక్పుష్పములు, ధర్మమకుటము, ప్రేమదీపము, మృత్యుకరము, అహింసాపయస్సు, నునుకైత, పడచు మావికుదుళ్ళు, పచ్చిరసికులు, పచ్చిపలపు, అనురాగ కళికలు, ఊర్పుతెమ్మెర, భావాంబరము, మొలకగీతి, భావశుకములు, ఆనంద బిక్షాటనము, ముత్తెపు టశ్రువులు, భావోత్తరీయము, పచ్చనిపాట, మనసు పాదులు, ప్రేమరస ధౌత సుగంధము, అనురాగ విహాయసము, పండుచివురులు, పచ్చి ఫణితి, పచ్చియెదద, కుమార రసాల తరులు, లతాకుమార బృందములు, శోకారాగాంకురములు, పచ్చి విరహులు, చింతాపుష్పము, సంకల్పలతలు, కాంక్షాతరంగములు, కరుకు టెడబాటు, పిచ్చిపగలు, అభిమాన చేలము, హృదయ పుస్తకము, నవనవలాడెడి నుడువులు.

## భావవైశిష్ట్యం

**లలిత**

........................................................................;పో

వాయెనె యింతకైన మొదలాటి మదీయ విపత్తులంచనున్. (p. 200)

పుడమి పడంతి కోడెతనపుం జిగినా మొలకెత్తు పచ్చికన్ ....(p. 201)

---

* రాయప్రోలువారి రచనలలో విశిష్టంగా కనబడే పదబంధాలు, భావాలు, భావాభివ్యక్తి, ఉపమానాలు వంటి వాటిలోని కొన్ని ప్రయోగాలు ఈ అనుబంధంలో చేర్చబడ్డాయి.

స్వప్నకుమారము

చదలు వెన్నెలు అల్లుచున్నది, కుమార
చాపలము లేదు పవన సంచాలనమున ...(p 4)
కావ్య కుసుమముల్ పూచు సంకల్పలతలు
ఉడు బలాత్కారముగ త్రెంపబడియె విధిని ....(p. 9)
కన్నెవిరులు సమర్తాడు కాలమందు ....(p. 9)
మౌక్తికముల కానుపు పోయు శుక్తి యకట
గర్భ విచ్ఛేద మే పాపకారణంబు ....(p. 25)
ఎండలో మాడిపోవు లేయిగురు లరసి
యేడ్చు నదుల ప్రేమోదంత మెవ్వడెఱుగు? ....(p. 27)

ఆంధ్రావళి

(ధాత) ....మావి పిందియలు మురియ....
....పూలు పసుపాడ, కుంకుమన్ బూయకొమ్మ ....(p. 16)
....మామిడి చూలు మోయ ...

(ఆంధ్రమాత) ....ఆశల్ కౌతుకపూర్ణ చంద్రికలు పూయన్ ....(p. 25)
....భాషాకుమారి కన్యపు పెండ్లి యిల్లైన.... (p. 26)

(తమ్ముడా) ....చీకిపోవని చేవ పదముల చేర్చి.... (p. 28)

(ఆంధ్ర) సాహిత్యకలశంబు శాశించి పండిత
రాజు క్రౌంజవుల క్షీరములు నించె,.... (p. 30)

(ఆచారము) అన్నకాటకమటులుండ నావహించె
భూమి నాసంద దుర్భిక్షమును సఖుండ.... (p. 37)

(తెనుగుమాన్యము) ....పిల్లవేణువు ముఖంబున గుల్కుసుఖస్వరాళి ...(p. 41)

(శ్రీ శివశంకర శాస్త్రి)....నిండురెక్కల కింద నిమరించు నెలకూన
లను లేప పాడేటి నును పుల్గు బాలెంత
తూర్పు వాకిలి ముందు తొగరు వన్నెల నూలు
బలవోక వడికేటి అరుణాంశుక కుమారి ....(p. 46)

(కృష్ణరాయ నాగేశ్వరులు) ఆంధ్రమున లక్ష్మ గుణశైలి నభఘరించి ....(p. 53)

బొటబొటం జాఱిపడె పచ్చి ముత్తియములు ………………(p. 209)
……………………………; తొల్కరించె లే
బడుచుతనంబు నా మనసుపొదుల వాంఛల మొల్కరింపగన్. (p 216)
……కోర్కెలు లోలోన నానసాగె…………………(p. 219)

తెనుగు తోట

నవనవ కుతూహల ప్రసూనములు పూచె …. (p. 319)
వెన్నెలలు నిద్రవోయెడు వేళలయ్యె …. (p. 336)

తృణకంకణము

శశి వికసించిన శ్రావణ
నిశీథమున కానబడిన నీరదసుతకున్ …. . …….. (Introduction)
……………………………… ?
తన గుణలతలు పూచిన శోభలో యన
చిఱునవ్వు వెన్నెల చెండ్లు విసర,
……………………………
పలుకు కొమ్మలు పూలపాలు పిదుక …. (p. 255)

కష్టకమల

నిగనిగ లెగయు కన్నె చిగుళ్ళ గుత్తుల
నీడ లారెడు చిఱు నిమ్మచెట్లు, …. (p. 256)
………… . కెవ్వన నొయారపుకూజితము ల్వెలార్చు చా
కొదమ శుకంబు వోయె నదిగో! ………… (p. 262)
……నీ నగు మొగం బొకతీరయి తోచు, నందముల్
నలగని యిన్నినాళ్ళ కమలంబిది కాదు గదమ్మ తల్లి!…. (p. 270)
…… … ! వచింపుము నా ప్రణయంపు టొప్పగిం
తలను ………… ……… . ………… ……. (p. 275)

స్నేహలత

హిమగిరి నితంబములు కన్నయిండ్లు గాగ
కదలి నీళ్ళాడు ప్రౌఢలు గడపసచ్చు
వసద సుత, ……. …. (p. 291)

(తారణ) కొమ్మల పట్టెను కుంకుమ బరిణల
కోయిల పాడెను కుశల గీతముల ...(p. 12)

(ఉగాది నివేదన) ముదిరిన చెట్లు కన్నెగిలి మొక్కలుగా, పతి శీర్ణ ....(p. 16)
శాంతి భిక్షానికై చాచేవు కొంగు
చిత్తోపశాంతికై ఎత్తేవు గళము ! ....(p. 27)
గాలిలో ధూళిలో కటికి నట్టెండలో ....(p. 26)
....నా తోట కాషాయ పీతాంబరము తాల్చె ....(p. 28)
తెలివాకల తెర్లి పొర్లుచున్
చెఱలాడెడు చిన్ని పిచికల్ ....(p. 32)

(పుష్పలావిక) పడకటింటికి రవిదారె యడుగుచుండ ...(p. 33)
....పలుకుతో పల్కు పెనబడి పట్టు పట్ట ....(p. 34)

(మాంచాల) మైల విడిచిన నల్లకోకను
మటల మెటిసెను పూలచుక్కలు
నాది నాదని దిక్కుతంబిసు
లూది లాగగ నలుకొనల్ ...(p. 46)

(అడివోరి చిన్నాడు) పలుకులే పూచేను పచ్చిపువ్వులు వోలె....
కథల జడలల్లితే కండ్ల గట్టినయట్లు
వళగట్టు మనలోక గాథా రహస్యాలు,
నుడువులో అవి తేనె మడువులో, రతనాల
కడవలో, రాగాల పడవలో కనరావు ....(p. 58)
మీ యమ్మ యే తార చాయలో నినుగాంచె
ఏ యోషధుల పాలపాయసంబిడి పెంచె ....(p. 59)

(జన్మాష్టమి) ..................గృహ పీథులొప్పె, భూ
దేవి సుఖప్రసూత పగిదిన్ జలమాడి ధరించె పచ్చపూ
పావడ, చిక్కనీచికురపాశములట్టుల వ్రేలె కృష్ణమే
ఘావలి, (p. 71)

(బుద్ధ దీక్ష) ధర్మధేనువు చేపగా దాయగట్టి
జగతి పిదికె నెవండ హింసాపయస్సు ....(p. 63)
మునిగి పోలేదు నీ ముత్యాల భవనంబు
పారిపోలేదు నీ పాడి గొఱ్ఱెల మంద ....(p. 75)

(ప్రభాతము) వెండి గొలుసులు లంకె వేసి ప్ర
చండమగు నీ నీలి తెరలను
తూర్పు వాకిలి తలుపు రెక్కల
తొలగ లాగెద రెవ్వరో ? ....(p. 76)

**జడకుచ్చులు**

(శక్తి) నీరదములు నృత్యములాడు దారులందు ....(p. 91)
(పిలుపు) నా విరహ గంధి గీతికన్వయము చెప్ప
శిరసు లెత్తుచున్నవి చిగురు పొదలు
నవ్వుచున్నది కడల నందాల సందె
కావి రంగుల రంగైన మోవి విరిచి ....(p. 97)
(ఒక మాట) పలుకుము నీవైన చెఱుకు పాలొలుకంగన్ ....(p. 107)
(ధ్యానగీతము) వ్రాయదొడగితి భావాంబరమును కడిగి ....(p. 116)
(మేఘమాల) ప్రాకెన్ చీకటి చెట్లు సోయగపు పూరంగుల్
దిశాంతమ్ములన్ ....(p.127)
(ఎవరు) చీకటి జడల్ ముడుల్ విచ్చి చిందులాడె ....(p. 132)
(ధ్వన్యాలోకము) వ్రాయ దొడగితి భావాంబరమును కడిగి (p. 116)
(రాధ పిలుపు) పొదలలో పూవువై పోయినావేమొ ?
తమ్మిలో తేనెవై దాగి నావేమొ ? ....(p. 162)

**వనమాల**

(ఉగాది) శూన్యము లయ్యె సుందరవనములు
రక్తాంబరముల రభసించెన్ ... (p. 10)

(ఫాల్గుణి) ప్రాతపడియును పూసి మాయని
వంగితెర పయి విభ్రమించెను–
స్మృతి కలాపము చిత్రరూపకమట్లు– ....(p. 92)

(ప్రాంజలి) వాల్మీకి శోకంబు ప్రవహించె శ్లోకమై
నన్నయ్య కంఠాన నటియించె భారతము ....(p. 98)

(కోయిల) వచ్చావె కోయిలా పన్నెలాడే సెలకు
పచ్చి పడుచు పదాల వాకిండ్లు తీయగా ....(p. 102)

(రామలింగారెడ్డి) తొడిమెయు పూవు నమకుపొందికలు సూపు
పదభావములం గొప్ప పొసప్పుముచ్చె, ....(p. 115)

(నందా!) పూవును కోసిరి పూర్ణము
గా విచ్చి పూసి నపనీయకయె నా నందా! ....(p 119)

(బ్రహ్మముడి) కొమ్మలకు చిగురాకు కాసులు దండవిచ్చి
వసంతుడేగెను; ....(p. 126)

సృష్టికింకను బాల్య మెడలదు– ....(p. 127)

........సిరి పూసి-యించె విమలాంబరములై ....(p 128)

(పల్లెపడుచు) ....జనములన్ పట్టివేయును కనులతో . (p. 142)

## ఉపమావైశిష్ట్యం

మిత్రమంజరి :

(ఆషాఢి) పరము వెనుకై ఇహము పైకొన
తన్నుకొనె సంశయ ఘనాఘన
ఘటనమున మనుష్య వృత్తము
బురదబడ్డ గజంబుటుల్ (p. 77)

.... .... .... .... ........

మానవుని వ్యక్తి స్వతంత్రము
అల్ల అల్లన కారిపోయెను
చిల్లికుండ జలాలంటుల్. (p. 77)

చెఱలో చిందులు మానె చీకటి....
..........నవ్వుచు పండు వెదుళ్ళు పాడసా
గెం, దమసా తరంగవతికిన్ పొడకట్టె సమర్త చిన్నెలు (p. 71)

మిశ్రమంజరి :

(నమోవాకమ్) కాళిదాసుని ఫణితి కళలు సమర్తాడె (p. 1)
(ఆంధ్రనవమి) తెలుగు కన్నెకు పసుపు తలంబ్రాలు పోయాలె (p. 12)
(క్షేత్రయాత్ర) ఆకలికాకల కల్లాడగ ప్ర,.... (p. 22)
(గురుదేవ రవీంద్ర) సంగీత సాహిత్య సాధనల పడకిల్లు- (p. 26)
(మంగళమాఘమ్) పువ్వులను మురిపింప తుమ్మెద
కన్నెలతలు సమర్తలాడక ....(p. 45)
రావి బంగారాకు లొత్తగ
పగలబడి నవ్వంగ మాగధి ....(p. 45)
పాలువోసిన పైరు పొట్టల
చేలు శ్యామల మాంసలములై
ఈడు వచ్చిన పడుచు లాయెను ....(p. 48)
(మన్మథావాహన) సరస్తరంగములు చలువ పాన్పులుగ
ఉయాలలూగే ఒయారి తమ్ముల
మిళింద కన్యలు మేలు కొల్పెదరు ....(p. 53)
శిరీష శాఖల చెంపసరులుగా
అలంకరించెను అలరు జొంపములు ....(p. 53)
(పెండ్లి లగ్నం) పెండి లాంతరు వెలిగించి వెడలె రజని ....(p. 57)
చెట్లునున్ కదలపు సొమ్మసిలిన యట్లు (p. 57)
(సంక్రాంతి సంబరము) సస్యకేసర కపిశ శోభల
చేలు పసుపాడిన విధంబున
చూడ కన్నుల వేడుకాయెను ....(p. 65)
(ఆషాఢి) గొడ్డు నేలలు వగిరి కన్నె పొ
లాలనాటురె యంటులన్ ....(p. 88)

(పల్లెపడుచు) కూతురొక్కతె అతనికిన్ చూతపల్లవ మనదగున్
మంచి గంధపుమొలకెయో మించు ముద్దుల గిలకయో. (p. 140)
మొగ్గలోపలి మధువటుల్ సిగ్గుచిన్నెలు చెదరప్రా
దోసపిందియ నునుపులన్ భాసిలున్ చెలిప్రాయమున్ (p. 141)
పూవుపైబడు తుహినమో - ఆవు పిండిన అమృతమో
అనగ ఆ చెలి చెలువముల్ (p. 142)

వ న మా ల

(తెలుగు బంతి) పచ్చిపాడియావు వంటిది కావ్యంబు (p. 23)

(పుష్ప లాలిక) ....... .......ఆ టక్కులాడు (p. 35)
సందె వలె మెల్లగా జాజె మందగతిని

(పులియాకు) చివురున్ గుత్తులబోని పాదముల....
పూగుత్తుల్ విదిలించినట్లు చిరునవ్వుల్ చిందు (p. 38)

(అర్థమాలలు) యజ్ఞ యాగాది కర్మ పర్యాయ పదము
వదిలినా రహింసాధర్మ పక్వపథికి
దక్షిణాయన ర క్తి ను త్తరము విడుచు
కర్మసాక్షి సహస్రాంశు కాండమట్లు (p. 44)

(మాంచాల) ధీర భృంగము తొంగిచూడని
తీయ సంపగి మొగ్గ తీరున
పగలు రేలునే నెట్టుచుండెను
పడతి మాంచాల (p. 45)

(రవీంద్రుని ఆరిపోయినది దివ్య స్నేహ శృంగార
అస్తమయము) దీపంబు నివ్వాళి తీసినట్లు.
.... .... .... .... .... ....
నిష్క్రమించినది నాందీ ముఖోజ్జ్వల తార
చిత్రాంక యవనిక చినిగినట్లు (p. 56)

(జన్మాష్టమి) ....రుచి మన్మృదుశాద్వల పత్రశయ్యలన్
బృందయు వెల్గె ముత్తయిదులెత్తిన పచ్చలపళ్లెరంబనన్ (p. 71)

(ఫాల్గుణి) ....... .................

........................................పగ
దాలివలె, సుడిగాలి కెపుడో
మండి గృహమును కాల్చదే : (p. 94)

పగులు వాఱిన ప్రహరి గోడలు -
గడియలూడిన తలుపు తెక్కలు -
ధర్మసత్రము పగిది నీ బం
గారు గడ్డ నిలంబడెన్. (p. 94)
కుల విభేదము మతవిరోధము
పొట మరించెను స్ఫోటకము వలె (p. 96)

(రామలింగారెడ్డి) లతిక నికుంజ వలయము నల్లినరీతి
కథకు తెంపులు లేని గమకమిచ్చి (p. 115)

(ఫాల్గుణి) గర్భవతులను బిడ్డతల్లుల
నరటి తోటల యట్లు నఱికిరి—
పాడియావుల పగులగోసిరి (p. 94)
పనసపండ్ల విధంబునన్.

(నందా!) పుట్టితివి ప్రొద్దుపొడుపుల
నట్టింటను మొలిచినట్టి నలిపము పగిదిన్ ....(p. 117)
అపుడపుడె కడిగి తుడిచిన
అపరంజి కలశముపోల్కి నగపడె నీమో
మపగత.... .... .... .... .... (p. 120)

(విన్నపలుకు) చదివితి కర్ణుని చరితము
వెదచే కడుబిత్తరిలిన పెయ్యవిధానన్
బెదరిన కనుచూపులతో
మదియును చెదరెను అగమ్యమానంబగుచున్ (p. 124)

(బ్రహ్మముడి) మధువుత్రాగిన తుమ్మెదలవలె - రేగిమబ్బులు తూగి
తొలగెను; (p. 126)
ఎగసె నెత్తురు ముద్దవలెనపు-డరుణబింబముతిన్నగా. (p. 127)

(ఒక మాట) అమృత రసవతులై నవ్వు అఖిల వికసి
తార్ద్ర సుమములు బాలెంత రాండ్ర పోల్కి
పసుపు బూసిన ముత్తైదువుల మొగాల
ననుకరించి గుమ్మడి పువ్వులందమయ్యె. (p. 106)

(ధ్యానగీతము) సృష్టి పసిబాల పగిది నిద్రించుచుండె
తల్లి రెక్కల క్రింద మెత్తని సువర్ణ
తూలికల మైమలచి నిద్దురలు వోవు
కన్నె పారావతము భాతి కదలదాయె
నా యహంకార మేమి బంధంబొ కాని (p. 114)

(వసంత వికాసము) చక్కని నభంబు రంగులన్ పిక్కటిల్లె
నిండు జవ్వని యరుణంపు గండమట్లు (p. 121)

(శేష చైత్రము) నవనవ లాడేటి చివురాకులెల్ల
కలకెక్కె నెండ కాకలు బోలె ముదిరి (p. 124)

(కవిత) సందెలను పచ్చిపారాణి సవదరించి
నింగి బాలెంత నడికట్టు కొంగులనగ
జారు నతసీ పయోద ప్రసన్న రేఖ
లందికొని లాగి చీరెగా నందగింతు (p. 129)

(ఎవరు) ఆరుచున్న కలంకారి చీర చెఱగు
లనగ ఆశాముఖంబుల నందగించె....నీరదపంక్తులపుడు (p. 131)
పొదలయందెందొ కసరాక పూర్ణ పరిమ
ళమున త్రోపరుబసు లాగు సుమములట్లు
నటిని చీకటి లోపల కానరాక
పాడుచుండిరి గాంధర్వ భామలెవరొ. (p. 132)
...............యూ సొగసు రూపు
తెల్పుచుననో యున్న యనుమాన మెత్తె నాకు
తదభిముఖుడగా మారించె నదియు నన్ను
సంప్రదాయమైన కవి కావ్యశైలి వోలె. (p. 133)
ఓర్వలేని వారెవ్వరో యొకరి నొకరు
పోల్చుకొనకుండ క్రిందకు వాల్చినారు
నీకు నాకును నడుమ నీ నీలితెరలు
సెజ్జపయి ప్రణయుల మధ్య లజ్జలాగు. (p. 134)

**ఆంధ్రావళి**

(తెలుగు మాన్యము) ఈనిన ఆలమందగతి ఇంపు లిగిర్చి ఫలించి నట్టియు
ధ్యానము పోల్కి సస్యరమ యాడెడి వేదికబోలు నీ తెలం
గాణము......... ......... (p. 39)

(బుద్ధ దీక్ష) కొన్ను లుడిగిన ఈ గోపు కదలలేక
వణకుచున్నది నా వచః ఫణితి పగిది (p. 65)

(ప్రభాతము) నిదుర విడి ఆశా నితంబిని
నీలవేణి విదల్ప రాలెడి
మల్లెపువ్వల పగిది జాటెను
అల్లనల్లన తారకల్
పండు కుంకుమ కలిపి తీర్చిన
పచ్చి ముగ్గుల ఆల్లికల వలె
ఉపరిగత వాతాయనమ్ముల
నుండి అరుణిమ లగపడెన్.
ప్రథమ పుత్రోదయము వేళను
భాసిలెడి సంపన్న గృహమటు
లతి వికాస సుఖాభిముఖమయి
అలరెబో జగమంతయున్. (p. 76)

(యాత్ర) ఏటి సందిట ఆడుచున్నది
ఆటబొమ్మ విధాన నావయు (p. 79)

**జడకుచ్చులు**

(శుక్తి) అగాధ పాతాళ తిమిర మొక్క
మారపార నభం బొక్కమారు చూతు
పగలు రేలుపలక్షించు ప్రాణి పోల్కి (p. 91)
లసదుషః కంఠధవళ మాలలు గనబడె
నెలల బాలెంత స్తన్యధారల విధాన
భావరేఖయు కుటిల కంపనము మానె
సుప్త విరహిణీ భ్రూలతాక్షోభ బోలి (p. 92)

వెన్నెలల స్వస్థపడు కల్వపిల్ల పగిది
గీతి వడదేరు పాపరాకూతు భాతి
స్వాతి వాకట్లు విడు శుక్తిబాల లీల
గాలిచే శోషబాసె నాకన్నెయపుడు. (p. 272)
(తృణకంకణము) స్నిగ్ధ సికతాతలమ్ములు చెమ్మతేరు
ఎండకన్నెరుగక వాననీడిగిలక
పెరిగిన కలకాపురముల బిడ్డలట్లు. (p 4)
లిఖియించు కొంటివే రమణి రూపు
అదియె ముదమీక యలత కాస్పదమ యయ్యె
గ్రహణగతమైన చంద్రుని కలవిధాన. (p. 7)
పాలురాని ఆవుల మొదుగుల్ వలెన్ మొగులు
పూసి కొనెన్ దివి. (p. 8)
బాధలేక వ్యసనరుచి బోధపడదు
చీకటులు లేక దీపిక చెలగనట్లు. (p. 16)
(రమ్యాలోకము) ధేనువులు తిను బహువిధ తృణచయమ్ము
త్రావు నానానదీ కూప జీవనమును
కలిసి పరిణమింపవె పాలుగా ధరిత్రి
శబ్దమేళన తంత్ర నైజమ్ము నిదియె. (p. 9)
కలవు రసరామణీయకములు కృతులను
మాధురీ సౌరభమ్ములు మధువున బలె. (p. 13)
ఈ పలుకుబడి ఇంపు ఘటిల్లె తెనుగు
భాషకు నిసర్గ కోమల భూషణముగ
మధుకణ ధురీణమైన సుమమ్మునకును
అందముగ రంగు రేకులు నమరినట్లు (p. 23)
పాలలో వెన్న లీనమై గ్రాలు లీల
శబ్దమందును అర్థంబు చక్కనెసగు; (p. 25)
ద్యుమణి తన చిత్రరుచు లదృశ్యముగ
పుష్ప పత్ర ఫలాళిలో పోయురీతి
సుకవి వాగర్థ బాంధవ స్ఫురిత రక్తి
స్వర లతాంతములైన శబ్దముల నించు (p. 29)
తెల్ల చుక్కల కరియాల నెల్ల పిదికి
పయినిడిన క్షీర భాండంబు పగిలినట్లు
వరద గట్టెను బ్రహ్మాండ భాగమపుడు
పచ్చి వెన్నెల పాలచే ప్రాణు లలర (p. 32)

అందమయిన పద్మంబుల నల్లినతడు
నునుపు పోగుల పట్టునేసిన విధాన (p 136)
వీథుల బొరలె నాబిడ.............
రాగ........గాన తరంగభరము
తెలి తమలపాకు తోట పాదులకు పారు
ధవళ జలకుల్య ఖాతి నార్ద్రింపు గతుల (p. 138)
వేరువేరైతి మంతట చారు జలద
గర్భమును వదలిన జలకణములట్లు
ప్రియ సమాగమ సుకృత మర్థించె నతడు
భీష్మతపన రోహిణి బొందు గ్రీష్మనట్లు (p. 141)

(కనకము) వదలదగు నీ పులుంగును....పం
పెదగాకల యత్తవారి పిల్లను బోలెన్. (p. 151)

(ధ్వన్యాలోకము) శశి ప్రకాశింపడయ్యె, నిశ్వాసమలిన
పవన బహులాంధమయిన దర్పణము పగిది. (p. 157)

(లలిత) పక్షిలేని కొమ్మయిన నావంటి వనిత
ఏమి ఫలముండి....
మించు విధాన కోర్కి విరమించె. (p 220)

(తెనుగుతోట) తెలియరాని చక్కిలిగింతలలకు నొడల
మేలుకొలిపెడు. పవనుడు బాలుడట్లు (p. 318)
ప్రాచీ కుమారికా కంఠమందు
మలయు కుంకుమ పూవుల మాలలనగ
సొంపొలుకుచున్నయవి యుదయంపు రుచులు (p. 336)

(స్నేహలత) ....విచ్చిన పుష్పము వోలె బుట్టె వం
గడమునకెల్ల సౌరభముగా నయగారి కుమారి. (p 285)
శ్రీ భరతమాత కంఠాన సిరులు విసరు
ఆణి ముత్యాల కళ్యాణ హారమనగ
తేజరిల్లు....గంగామ తల్లి (p 287)

(కష్టకమల) అలల కోనేట నరుగు రాయంచలీల
ఆ మృదూద్యానమున మందయాన యగుచు
పోయె నా కన్నె.... (p. 255)

సరస కావ్యార్థము లభిధా వరణ మెడలి
లక్షణా వ్యంజనా విధులన్ భ్రమించు
పూవు విడిచి వాయు తరంగముల సపార
దూర మేగెడి పరిమళ సారమట్లు (p. 38)
కళలు రమ్యార్థ సౌభాగ్య కల్పనములు
సంవృతమ్ములు శాస్త్ర బీజమ్ములందు
మధుర కందరసార మాంసలములయిన
పండ్ల లోపల విత్తుల భంగి నంతె (p. 38)

కన్నె పాటలు

(తొలి మబ్బులు) తడిసిన కొమ్మలు తలలు వంచుకొనె
పెండ్లి కుమార్తెల బిడియము తోపగ....
(స్నప్నకుమారము) నింగి విసరిన యొడిసెల రంగు బెడ్డ
బోలె వ్రాలెడు చక్కదనాల చుక్క.
గగన నికేతనమ్ముపయి కప్పిన తెల్లని పాలపెంకుల
వ్లగపడు ధౌతమేఘకలావళి........ (p. 19)
వనకుమారిక లుంచిన పసుపుముద్ద
లో యనగ ఆకుమఱుగుల సోయగించు
పండ్లుకనబడె.... నారింజపాదుల చాయలందు (p. 20)
పరిచయ కులాయ మెడలిన పావురమ్ము
పగిది నాయదియును వచ్చెవనికి మరల (p. 21)
అలలు రేగిన తామరకొలను మాద్రి
నెడద త్రెక్కొని నుత్కంఠ వెడలె నిట్లు. (p. 22)
........ ........దెసలరయ లేక
తిరుగు అసపత్య హరిణంబు కరణి నేను,
చూచుచుంటిని ఆమెకై; ........... (p. 25)
(మాధురీదర్శనమ్) తెరలి మసలిన పయస్సులు
మెరుగారుచు నురుగులారి మీగడ యగు మా
దిరి స్థాయి భావ మందెడి
తరుణాంతఃకరణ నైజధర్మములు.... (p. 22)
రమణీయార్థ తరంగిత
కమనీయంబయిన కావ్యకంఠ ధ్వనిలో
సుమమున మకరందము వలె
భ్రమించు రసము.... .... .... (p. 30)

# ప్రముఖులతో ముఖాముఖి

కొందరు ప్రముఖులను కలిసి రాయప్రోలువారి తత్త్వచింతనను గూర్చి ప్రశ్నించి సేకరించిన విషయాలు సంగ్రహంగా ఈ అనుబంధంలో ఇవ్వబడ్డాయి. ముందుగా రూపొందించుకున్న ప్రశ్నావళి కూడా దీనిలో చేర్చబడ్డది. కలిసిన వ్యక్తులు అన్ని ప్రశ్నలకు సమాధానాలు చెప్పకపోవడం, చెప్పినవి ప్రశ్నావళి వరుసలో లేకపోవడంవల్ల వారి సమాధానాలకు ప్రశ్నల క్రమసంఖ్యలను చేర్చ లేదు. ఆయా వ్యక్తుల అభిప్రాయాలలో కొన్ని ప్రత్యక్షంగా ప్రశ్నావళికి సంబంధించినవి కాకపోయినా రాయప్రోలువారి వ్యక్తిత్వాన్ని ప్రకటించే విషయాలు కూడా కొన్ని ఈ సారాంశాలలో ఉంచడం జరిగింది. కొందరికి ప్రశ్నావళిని అందించడం సాధ్యపడలేదు.

రాయప్రోలు సుబ్బారావుగారు ముఖాముఖి చెప్పిన విశేషాలను, విషయాలను మూడవ అనుబంధంలో ఇవ్వడం జరిగింది.

## ప్ర శ్నా వ ళి

1. సగుణ నిర్గుణ బ్రహ్మలలో రాయప్రోలువారు ఎక్కువ అభిమానించేది ఏదని మీరనుకుంటున్నారు? అది వారి కావ్యాల్లో కనిపిస్తుందా ?

2. రాయప్రోలు వారు భగవంతుని ఏ రూపంలో ఆరాధిస్తారని మీరు భావిస్తున్నారు?

3. తాంత్రిక విధానాన్ని గూర్చి రాయప్రోలు వారి ఉద్దేశ్యం ఏమయి ఉంటుంది ? వారు లలితోపాసకులని అంటారు. ఆ ప్రభావం ఏదయినా వారి సాహిత్యం మీద ఉందని మీరనుకుంటున్నారా? అంటే ఏ రకంగా ఉంది?

4. ప్రకృతిని వారు వర్ణించడంలో ఆధ్యాత్మికభావన ఏదయినా ఉందా? ఉంటే ఆ ఆధ్యాత్మికచింతన వారి కావ్యాల్లో ఏ రూపంగా కనిపిస్తోందని మీరను కుంటున్నారు?

## డా॥ అమరేంద్రగారు

30-3-81.

3 p.m.

ప్రకృతిలో ఒక చైతన్యం సర్వత్రా వ్యాపించి ఉన్నది. అదే సత్య సౌందర్యం అనే భావం.... "సచ్చిదానంద కల్యాణ సదనమయిన ఈ మనోహర జగతికి నేగుదెంచి ప్రేమంత్మ్మ నారాధింపవేమి చెపుమ" అన్నపుడు Wordsworth ప్రకృతిని చూసిన విధానమే కనబడుతుంది.

"Lines written on Tintern Abbey"లో దృశ్యమానమయిన ఈ ప్రకృతి అంతటి వెనకాల మహత్తరమయినటువంటి చైతనం ఉంది.

ఈ ప్రకృతి అంతా కేవలం పైకి కనబడేది కాదు, దీని వెనకాల చైతన్యం ఉంది అనేటువంటి దృష్టి సుబ్బారావుగారి వర్ణనల్లో కూడా నకబడుతుంది. అందు వల్లనే ఆ వర్ణనల్లో ప్రత్యేకత....

ప్రకృతినొక ఉపాస్య దేవతగా వర్ణించిన మొదటి కవి Words worth. అది రవీంద్రుని ద్వారా సుబ్బారావు గారికి ...

భారతజాతిని భారతీయ జాతిగా నిలబెట్టినటువంటి సంస్కృతి నంతనీ కూడా పునరుద్ధరించాలి, ఆ చరిత్ర చావలేదు, దాన్ని మళ్ళి హృదయాలు చీల్చి చదువుకోండి అని ప్రబోధం చేయటంలో సుబ్బారావుగారు ఆధ్యాత్మిక మ యి న టు వ ం టి సాంస్కృతికమయినటువంటి ప్రభావాన్ని కూడా చూపించారు .... రవీంద్రునితో పరిచయం కాకముందే వారు వ్రాసి ఉండొచ్చు. భావసామ్యం ఉండి ఉండొచ్చు...... బంకిం గేయం బాగా ప్రచారం పొందింది. ఆ ప్రభావం వల్ల వారు దేశాన్ని మాతృమూర్తిగా దర్శించారు. దేశాన్ని కేవలం ఒక రూపంగానే కాకుండా ఒక మాతృమూర్తిగా ఇంతమంది సంతానాన్ని కన్నటువంటి మాతృమూర్తిగా (భావించిన) మొట్టమొదటి కవిఋషి బంకిం.... ........ఆ భావానికి కవితాస్ఫూర్తి నిచ్చింది బంకిం.... మామూలుగా ఉండే సంకుచితమైనటువంటి రాష్ట్రాభిమానం కాకుండా సమగ్రమైనటువంటి జాతీయాభిమానం సుబ్బారావుగారిలో కనిపిస్తుంది. ....Narrow imperialism కాకుండా

5. ద్వైతం విశిష్టా ద్వైతాల్లో రాయప్రోలు వారికేది అభిమానమనుకుంటున్నారు? ఆ భావాలేవయినా వారి రచనలో కనిపిస్తయ్యా?

6. వారి దేశభక్తికి, వారి సమకాలికుల దేశభక్తికి ఏదయినా భేదం ఉందా? అంటే వీరి దేశభక్తి కేవలం ఆనాటి రాజకీయ పరిస్థితుల కారణంగా వెలికి వచ్చిందేనా? లేక అందులో కూడా ఏదయినా ఆధ్యాత్మికత కనిపిస్తుందా ?

7. వారి అమలిన శృంగార సిద్ధాంతం గూర్చి మీ అభిప్రాయం ఏమిటి ? ఈ సిద్ధాంతం ఎందుకు ప్రచారానికి రాలేదని మీరనుకుంటున్నారు ? దానిమీద ప్రభావం చూపిన సిద్ధాంతాలుకాని సాహిత్యాలుగాని ఏవయినా ఉన్నాయా ?

8. మధుకలశ రచన చేయడానికి వారిని ఆకర్షించిందేమిటి ? ఉమరు తాత్త్వికతా ? లేక ఉమరు కవిత్వ రమ్యతా ? చార్వాక సిద్ధాంతానికి ఉమరు తత్వానికి భేదం ఏమిటి ?

9. స్త్రీ సమారాధనకు పెట్టింది పేరుగా చెప్పదగ్గ రాయప్రోలువారు "రూప నవనీతం"లో 'వకుళమాల' శీలదానం చేసినట్లు చిత్రించడం గురించి మీ అభిప్రాయం ఏమిటి ?

10. సుబ్బారావుగారు జ్ఞాన, కర్మభక్తి మార్గాలలో దేనివైపు మొగ్గు చూపుతారు ? ఆ ప్రభావం వారి రచనలలో కనిపిస్తుందా ?

11. రాయప్రోలువారి రచనల్లో వేదాల, ఉపనిషత్తుల ప్రభావం ఏ రకంగా కనిపిస్తున్నది ?

12. సంస్కృత సాహిత్య ప్రభావం, సంస్కృత కవుల ప్రభావం వారిపై ఎంతవరకు ఉంది ?

13. ప్రాచీన ఆంధ్ర సాహిత్య ప్రభావం, కవుల ప్రభావం వారిపై ఏ రకంగా కనిపిస్తున్నది ?

14. ఆంగ్ల కవులలో ఎవరి గూర్చి అయినా సుబ్బారావుగారు ఎప్పుడయినా ఎక్కడయినా ఎక్కువగా చెప్తుంటారా ? వాళ్ళ ప్రభావం రాయప్రోలువారి సాహిత్యం మీద ఉందా ?

15. రాయప్రోలువారి రచనలలోని తాత్త్వికత గూర్చి మీరేమయినా చెప్తారా ?

వ్రాసిన ఆంధ్ర సాహిత్య ప్రభావం కవుల ప్రభావం సుబ్బారావుగారిలో పద్యరచనలో సమాస కల్పనలో తొలి రచనల్లో కనబడుతుంది. పోతన వారికి చాలా అభిమాన కవి........ప్రత్యేకమైన ఆ పద బంధాలూ ప్రత్యేకమైనటువంటి ఒక లాలిత్యం చెప్పటంలో ఒక పేశలం ఒక ప్రసాదగుణం ఇవన్నీ కూడా సుబ్బారావుగారితోనే ప్రారంభమయినయి. భావ కవిత్వం అంటూ ఒకటి రాకపోతే ఇవన్నీ వచ్చి ఉండేవి కావని నా ఉద్దేశం. ఆ స్వాతంత్ర్యం కనుక వాళ్ళు అప్పుడు సాధించి ఉండకపోతే, సంప్రదాయం మీద కనుక అప్పుడు వాళ్ళు అటువంటి తిరుగుబాటు చేసి ఉండకపోతే ఈ కొత్త ఉద్యమాల మార్గాల్లో సాహిత్యం నడవడానికి అవకాశం ఉండేది కాదు.

సుబ్బారావుగారు చెప్పదలచుకున్నది తమ కావ్యాల్లోనే చెప్పేశారు - సూటిగా చెప్పకుండా. మానవులను ఒక సూత్రంతో ముడి వేయగలది మైత్రి సూత్రం. దాన్ని ప్రతిపాదన చేయడం, ఆ ప్రతిపాదన సుందరంగా ఉండడం, సృష్టి కంతటికీ కూడా ఆధారభూతమయినది ప్రణయతత్త్వం ఉన్నది అనేటువంటి ప్రభావం- ఇవన్నీ కూడా వారి తాత్త్విక చింతనలోని భాగాలే.

ముఖ్యంగా నాకు వారిలో కనబడేది ఆ సత్య సౌందర్య సమన్వయం. ఇప్పుడు సాహిత్యం చెప్పదలచుకున్న సత్యాన్ని సుందరంగా చెప్పటం, ఈ రెంటి సమన్వయం చాలా అపూర్వంగా మొట్టమొదటిసారిగా తెలుగు సాహిత్యంలో రాయప్రోలు రచనల్లోనే ప్రవేశించిందని నేననుకుంటాను.

## శ్రీమతి కొత్తపల్లి లలితగారు

27-2-82

4 p.m.

భగవదారాధనం........ మాతృరూపంగా ఆరాధిస్తారు. దేవిని కూడా అదే రకంగా ఆరాధించారు. 'లలిత' అన్న పేరు నాకు పెట్టడంలో ఆ పేరే పెట్టారు. మా ఇంట్లో వాళ్ళకి ఆయన పెట్టిన పేర్లే ఆయన అభిరుచిని తెలుపుతాయి. మా అక్క కల్యాణి; మంగళశబ్దం కోసం పెట్టుంటారు. మా అన్నయ్య అసలు పేరు చింతామణి. తరువాత 'రాజశేఖర్' చేరింది. శ్రీనివాస మార్తాండ్....morning

ఒక **Broad nationalism.** అది చాలా విచిత్రమైనటువంటి విషయంగా నాకనిపిస్తుంది. అందువల్లనే వారి గేయాలు ఈనాడు కూడా ఆంధ్ర రాష్ట్రం వచ్చినా ఇప్పటికి పాడుతుంటే ఒళ్ళు జలదరిస్తుంది. వాటిల్లో ఉన్న జాతీయ ప్రబోధ ప్రభావం అటువంటిది.

సుబ్బారావుగారిది సగుణోపాసనే అని నా ఉద్దేశం. మామూలుగా నా ఉద్దేశంలో కవులందరూ కూడా ఒక విధంగా ద్వైతవాదాన్నే ఎక్కువగా అభిమానించినట్లు కనబడుతుంది.

........ అసంతృప్తి సంప్రదాయ కవిత్వం మీద ప్రకటించిన వారిలో మొట్టమొదటివారు సుబ్బారావుగారు. .... . అమలిన శృంగారం నిజంగా ఆయన మనకు చేసిన గొప్ప **Contribution** అని అనుకుంటాను. **decadence** నుంచి మళ్ళీ శృంగారాన్ని ఉదాత్తమయిన స్థాయికి ఉద్ధరించినది సుబ్బారావుగారే అని చెప్పాలి. భావకవులకు మార్గదర్శకులయ్యారు అందులో వారు. అంటే కేవలం శరీరగతవర్ణనలు చేయకుండా ఒక పవిత్రమైనటువంటి ఆదర్శాన్ని ప్రేమలో చిత్రించడం అది సుబ్బారావుగారి దగ్గర నేర్చుకున్నారు భావకవులు.... అసలు ఆ ఉదాత్తమయిన భావన సుబ్బారావుగారి నుంచే - ఈ అమలిన శృంగారం ద్వారానే.........లాక్షణికమైన పద్ధతిలో కాకపోవచ్చును గాని శృంగారాన్ని ఒక ఉదాత్త స్థాయిలో **treat** చెయ్యటం ఉన్నదే - అది సుబ్బారావు గారి దగ్గర నేర్చుకున్నదే.

ప్రబంధ కవుల అశ్లీల శృంగారాన్ని.........దాన్ని సుబ్బారావుగారు **Positive side** నుంచి.... కేవలం **Negative** గా ఎదుర్కొన్నారు రామలింగారెడ్డిగారు. **Positive side** నుంచి శృంగారం అంటే ఇది, ఇట్లా ఉండాలి అని నిర్దిష్టతను వ్రాసి చూపారు.

....ఉమర్ తత్త్వం వారికి నచ్చకాదు, కవిత్వంలో ఉన్నటువంటి రమ్యత్వం వల్లనే ఆకర్షితులై - ఫిట్జెరాల్డు అనువాదంలో ఉన్నటువంటి ఆ విశిష్టత వలన ప్రభావితులయి అనువాదం చేశారేమో అని అనుకుంటాను.

....కవిగా ఎక్కువ సుబ్బారావుగారు భక్తి మార్గాన్నే అనుసరిస్తుంటారు.

స్త్రీకి ప్రాముఖ్యం........mother గా deal చెయ్యడం పీఠల్లో Bengal వారి పద్ధతి ఆయనకు నచ్చింది. వాళ్ళు ఎట్లా స్త్రీని గౌరవిస్తారో, అధిష్ఠిస్తారో ...ఆ atmosphere నచ్చింది. పిల్లల్ని Bengal పంపించి చదివిస్తాననేవారు.

## శ్రీ కోగంటి సీతారామాచార్యులుగారు

30-3-81

5-30 P.M.

అసలు కవి అయినవాళ్లా నిర్గుణబ్రహ్మనే చెబుదామని ప్రయత్నించినా సగుణబ్రహ్మద్వారాగాని చెప్పడం కుదరదు. కవి అయినవాడు సగుణస్వరూపం బాగా ఉపాసించేవాడు కావాలి. సుబ్బారావుగారు భగవంతుణ్ణి సర్వప్రకృతిగా ఆరాధిస్తాడు. ఎందుకనంటే, ఒకప్పుడు అయన ఉపన్యాసంకూడా నేను విన్నాను బెజవాడలో. "సర్వం ఖల్విదం బ్రహ్మ. జగదిదంబ్రహ్మ" అని. ఈ రెండూ నా చిన్నతనంలో మొట్టమొదటిసారి వారి నోట్లోంచి విన్నవే. ప్రకృతి మొత్తం బ్రహ్మ వస్తువుగా ప్రకృతివర్ణనలవల్ల కలిగే ఆనందమే బ్రహ్మానందముగా భావించిన మహాకవులు చాలామంది ఉన్నారు. సుబ్బారావుగారుకూడా ఒకడు. సంస్కృతాంధ్ర పరిజ్ఞానం, వీనికి తోడు ఆంగ్ల విజ్ఞానం - ఈ మూడు ఉండడంవల్ల నేనప్పు డప్పుడూ అనుకుంటూ ఉంటా ఆయన త్రివేణీసంగమం వంటివాడు అని.

తాంత్రికములంటే రెండున్నయ్యి - క్షుద్రములు, మహావిద్యలు. మహావిద్యలను సుబ్బారావుగారెప్పుడూ వ్యతిరేకించేవాడు కాడు. హింసాత్మక కాండను ఆయన ఎప్పుడూ అంగీకరించినవాడు కాడు. ఆయన మనస్సు సహజకోమల మయిన మనస్సు. ఉత్తమమైన మార్గంలో శుద్ధంగా పూజించేవ-రేకాని హింసాత్మక మైన తాంత్రిక పద్ధతికి సంబంధించినవారు కాదని నా సిద్ధాంతం. సుబ్బారావుగారి మనస్సు ఆయన వాక్కువలె ఉదాత్తమైనది. ఆయన వాక్కు మనస్సువలె ఉదాత్తమయినది.

ప్రకృతి వర్ణించడంలో ఆధ్యాత్మిక చింతన ఉంది. ఆయన ఒక తీగెను వర్ణించినా, ఒక ఆకును వర్ణించినా, ఎడుగడ్డి సోపును వర్ణించినా అహంకార మమకారములకు దూరమయిన సత్యాన్వేషణ చేశాడాయన. ఆ సత్యాన్వేషణ

**birth** వల్ల ఆ పేరు పెట్టి ఉంటారు. తరువాత నేను. నాకు కూడా లలితాంబ అని దేవి పేరు పెట్టుకోవాలని పెట్టారు. అయితే **register** లో నా ఇష్టం మీద లలితగా వ్రాయించారు. తరువాతవాడు శివప్రసాద్. ఆ తరువాత తమ్ముడు చిదానందం. వాళ్ళిద్దరి పేర్లూ కలిపి శివానంద అని అనేవారు. ఇద్దరినీ కవలల లాగా చూసేవారు. మా చెల్లెలు పద్మావతి. మా తమ్ముడు ప్రభాకర్.

ఇంట్లో ఏ కార్యం చేసినా పిండితో, దానితో వేంకటేశ్వర దీపారాధన చేయడం అదీ ఉంది. విగ్రహారాధన.... అంటే పటం లాంటిది, కాలెండర్ ఫోటోలాటిది.... వాటల్లో దేవతారూపానికి పూజించడమేగాని, పంచలోహం, వెండి లాటి విగ్రహాలూ, బొమ్మలూ పెట్టి పూజ చేయడం ఆయనకు ఇష్టం ఉండదు. లలితా సహస్ర నామాల పుస్తకం ఆయన దగ్గర ఉన్న దేవీ పటం వంటి వాటిని మారవడం కాని,.... ఫ్రేమ్ అయినా సరే, పుస్తకం ఎంత శిథిలం అయినా సరే.... వాటిని మారవ నివ్వరు. ఆయన పూజించే బొమ్మ నందలాల్ వేసినది.

బాల, రాజేశ్వరి లాటివి శక్తి స్వరూపాలు. వాటిని తట్టుకోవడం కష్టం అని ఆయన అంటారు. లలిత పేరులోనే సౌమ్యం ఉంది. ఆ దేవి శాంత స్వరూపిణి అని అంటుంటారు.

**Tender things, feelings** లాంటివి ఆయనకు అభిమానం. వికృతం, వికారం అయినవి నచ్చవు. **Black** లాటి **Colours** ఆయన వద్దనేవారు.

మహా నైవేద్యం పట్ల నమ్మకం తక్కువ. ఆ అలవాటు లేదు. తడి బట్టలతో మడి అదీ ఆయనకు నచ్చదు. అయితే ఇంట్లో పిల్లలు జుట్టు విరబోసుకున్నా, జుట్టు నీళ్ళు కారుతూ ఉంచుకున్నా, బొట్టు లేకుండా తిరిగినా కోప్పడేవారు. గుడికి ఆయన వెళ్ళేవారు కాదు. మేమూ పొయ్యేవాళ్ళం కాదు. కాని పెద్దయ్యాక ఇప్పు డెప్పుడైనా మేము వెళ్ళి గుడి ప్రసాదం అని ఇస్తే మాత్రం తీసుకుంటారు. కళ్ళ కద్దుకుంటారు. శుక్రవారం మాత్రం మడిగా నైవేద్యం పెట్టేవారు. తాంత్రిక విధానం గురించి దృష్టి ఎక్కువ లేదు. ఉపాసనే బలంగా ఆయన అభిమానిస్తారు.

దేశభక్తిలో **Cosmic image....** కాని **regional** ది లేదు.

మలిన శృంగారం. అందరూ ప్రేమను ఎక్కువగా కామ మోహార్థంలో వాడు తున్నారు. కామ మోహములు ఉపాధి అయిన శరీరానికి సంబంధించినవి. అవి క్షణములుంటయ్యి. కాబట్టి మలిన శృంగారం అంటే దైహిక వాంఛా విశేషాలు తీర్చుకొనుట. అమలిన శృంగారం అంటే మనస్సుచే, ఇంద్రియములచే, స్థిరమై ఎంతసేపు భావన చేసినా వెగటు కలగని ఒకానొక మహాసిద్ధి. శృంగారం సర్వ ప్రాణిగతం. శృంగారం శరీర ధర్మం కాబట్టి శృంగారం మీద ప్రధానంగా సమన్వయం చేసి మనవాళ్ళు చెప్పారు. అయితే ధర్మమయిన శృంగారాన్ని శృంగారం అనటం కంటే అధర్మమయిన దాన్నే శృగారం అనే వాడుక ఎక్కువగా కనిపిస్తోంది. అందువల్ల అమలిన శృంగారం అన్నారు.

అసలు....సాహితీ సమితి కవులందరూ అమలిన శృంగార సిద్ధాంతాన్ని కొనసాగించారు. అమలిన శృంగారానికి ఎందుకు బాగా ప్రచారం రాలేదంటే సంస్కారం లోపలికి మందిచ్చినట్లుగా పంపడానికి వీల్లేనిది.

ఎఱ్ఱాప్రగడ పోలికలు బాగా ఉన్నయ్యి. ప్రకృతిని అత్యద్భుతంగా వర్ణించి ప్రకృతితో తాండవం చేయించి తాను తాండవం చేసినవాడు ఎఱ్ఱాప్రగడ. తెలుగు కవులలో మళ్ళ అట్లాంటివారు సుబ్బారావుగారు. పద్యం యొక్క ఉపక్రమణ, ఉపసంహారాలూ అట్లాగే ఉంటాయి .... ఉపనిషత్ప్రభావం ఉన్నంతగా వేద ప్రభావం లేదు. ఈ ప్రభావం మామిడిపండులో రుచిలా ఒకచోట అని చెప్పడానికి వీల్లేదు. సంస్కృత, ఆంధ్ర కవుల ప్రభావం లేని ఖండకావ్యం లేదు. కాళిదాసు లేదని కాదు. భవభూతి ముద్రే ఎక్కువ.

తన కవిత్వం మీద తాను మాట్లాడటం సుబ్బారావుగారిలో తక్కువ.

## శ్రీ గరికపాటి లక్ష్మీకాంతయ్యగారు

12-6-81
4-00 P.M.

రాయప్రోలు స్వతంత్రమైన భావాలున్న వ్యక్తి. Original way of **thinking** ఉన్నవాడు. Wordsworth లాటి westner's ideas ఉన్న వ్యక్తి సుబ్బారావుగారు. సుబ్బారావుగారిలో ప్రతిభ వ్యుత్పత్తులు ఒకదానితో ఒకటి

ఎప్పుడయితే చేస్తారో అప్పుడు వారికి ప్రకృతి - ప్రకృతి గతములయిన సర్వ వస్తువులు ఆనందమయమయిన బ్రహ్మపదార్థం వంటివి.

రాయప్రోలు కోరింది పొందదలుచుకున్నది నిర్గుణమైన బ్రహ్మవస్తువు అయినప్పటికీ అది సగుణస్వరూపం లేనిదే కనబడదు కాబట్టి వినపడదు కాబట్టి, కవిత్వం శబ్దం లేనిదే ప్రకాశించదు కాబట్టి, ద్వైత సిద్ధాంతంలోనే చెప్పాడు. కాని ఆయన ఒళ్ళుమరచి చెప్పినప్పుడు మాత్రం అద్వైతం కనిపిస్తూనే ఉంది. ప్రకృతిని ఒప్పుకున్నంత మాత్రాన విశిష్టాద్వైతి కాడు. ఆయనకు మూడింటిలో ఏదిష్టమూ అంటే అద్వైతమునందే ఆయనకు పర్యవసానం. కాని దాన్ని చెప్పేటప్పుడుండే ద్వైతంలోనూ చెప్పాలి విశిష్టాద్వైతంలోనూ చెప్పాలి.

దేశభక్తిలో ఆధ్యాత్మిక చింతన లేకుండా ఎట్లా పోతుంది ? దేశభక్తి అక్కరలేదూ అంటే మన సంధ్యావందనాదుల్లో దేశనామ కీర్తనం చేయడం ఎందుకసలు?

సుబ్బారావుగారి మనస్సు భవభూతికి చెందిన మనస్సు, సుబ్బారావుగారి కవిత్వం తెలియడానికి మన భగవద్గీత భారత భాగవత రామాయణాదులు ఉపకారాలు.

ఈ ప్రపంచం అంతా సత్యం కాదు. ఈ ఆనందం నిజమైందికాదు. ఉమరు లేపటిమాటకేమిలే ఆనటానికి మళ్ళీ మనకు జన్మమక్కర లేదు అన్న భారతీయ తత్త్వాన్ని స్పష్టంగా ప్రతిపాదించుకున్నవాడు నమ్మినవాడు కాబట్టే ఆ తత్త్వం నచ్చి వీరనువదించారు.

జ్ఞాన, కర్మ, భక్తి మార్గాలు మూడూ వారికి అభిమాన పాత్రములే. ఆయన కర్మ సిద్ధాంతాన్ని చెప్పాడు. భక్తి సిద్ధాంతాన్ని చెప్పి భక్తుడై కంఠమెత్తి భగవంతుణ్ణి ప్రకృతి స్వరూపంలో సంకీర్తనం చేశాడు. ఆనంద తన్మయుడై ఆనందమయ గీతాలు పాడాడు.

ఏ కావ్యము నందలి వర్ణనచేత హేయమైనటువంటి స్త్రీ, పురుష సమ్మేళనాత్మకమైన వాంఛా విశేషం కలగకుండా ఉంటుందో, రసాత్మకంగా ఉంటుందో అది అపలిసం. ఏదైతే ఈ రూపమైన వాంఛలు కలిగిస్తుందో అది

28-12-81
6-30 p.m.

కవి సగుణ బ్రహ్మోపాసకుడు. నానా రూపాలతో ఉండే సృష్టితో తాదాత్మ్యాన్ని పొందుతాడు కవి. అంచేత కవి ఎప్పుడూ సగుణబ్రహ్మోపాసకుడు. జగత్తు సగుణబ్రహ్మ. జగత్తుతో సంబంధం లేకుండా కవి పుట్టడు....కవికీ; భక్తుడికి భేదంలేదు. భక్తు డేపని చేస్తాడో దేవుడి విషయంలో కవి జగత్తు విషయంలో అదే చేస్తున్నాడు అన్నమాట.

భక్తుడు లేక ఉపాసకుడు....ఉపాస్యదైవతం వీడూ ఒకటి కావటం- ఇదే కదా భక్తుడు చేసేది. ద్వైతభావంపోయి అద్వైత స్థితి పొందడం .... సగుణ బ్రహ్మంతో ప్రారంభించి ఎప్పుడు తాదాత్మ్యం చెందుతుందో ఉపాస్యదైవతంతో - అంటే కవి విషయంలో వస్తువుతో జగత్తుతో ఎప్పుడు వాడు తాదాత్మ్యం పొందుతాడో - వాడు లేడు. ద్వైతం లేదు. అద్వైతమే. కనక సగుణ బ్రహ్మోపాసకుడు నిర్గుణ బ్రహ్మోపాసకుడి కంటె ఒక మెట్టు తక్కువ అనుకునే భ్రాంతి రాకూడదు ఇక్కడ .... నిర్గుణ బ్రహ్మోపాసకుడు **Philosopher** సగుణ. బ్రహ్మోపాసకుడు **Poet.** ఉభయులూ చేరే చరమ బిందువు ఏదైతే ఉందో అది మాత్రం ఒక్కటే. మార్గాలు మాత్రమే విభిన్నంగా ఉంటయ్.... ఈ ద్వైతం కూడా అద్వైతానికే **lead** చేస్తుందని ఆలోచించడమేదైతే ఉన్నదో అది **most fashionable method** అన్నమాట .. సర్వసాధారణంగా **sophisticated sections** ఎప్పుడూ ప్రతి దేశంలో ప్రతి కాలంలో అద్వైతంపైపే మొగ్గుతుంటారు. మన రాయప్రోలువారు దానికి **exception** కాదు. ఆయన కూడా ఇలాగా అద్వైతంవైపు మొగ్గిన **thinking** ఉన్నవాడే .... అద్వైత స్థితిని ద్వైతంలోనించి వెళ్ళి కలుసుకోవడం ఏదైతే ఉన్నదో అది ప్రతి కవిలోనూ ఉంటుంది. అదే- ఆ ప్రక్రియ ఇక్కడ రాయప్రోలువారిలోనూ ఉంది అని నా భావన.

రాయప్రోలువారి దేశ భక్తికి ఆ రోజుల్లో ఆయన సమకాలికులుగా ఉన్న కవుల దేశ భక్తికి ఒక విధమైన తేడా ఉంది. ఈయన నఖశిఖ పర్యంతం కవి. భావావేశం, ఈనలో ఉన్నంత దేశంతో పొందే తాదాత్మ్యం మిగ్లతావాళ్ళలో కనిపించదు. కనిపించకపోవటం అంటే వాళ్ళ అక్షరాలలో కనిపించదు అని

పోటీపడి, ఒకదాన్ని మించి ఇంకోటి ఉన్నాయి. స్త్రీని దేవతగా చూడాలని అన్నారు ........ వేదభావాలు ప్రమాణం సుబ్బారావుగారికి.

ఆయన భక్తిలో ఉంటాడు కాని జ్ఞానం కూడా ఉంది ఆయనలో........ ప్రాచీన మహర్షులు, గ్రంథాలు ఆయనకు అభిమానం. వాళ్ళ పావిత్ర్యం, మహత్వం వర్ణిస్తాడు.... ఉన్నత ఆదర్శాలున్న వ్యక్తి.

ఆయన రచనల్లో సంస్కృత పదజాలం ఎక్కువ. వ్యవహార భాష వాడ్తాడు. అంటే సంస్కృత పదాలు ఎక్కువగా ఉన్నా వ్యవహార భాష వాడ్తాడు........ప్రజానీకానికి ఆయన హృదయాన్ని చెప్పడంలో ప్రముఖుడు. అనుకోవచ్చు ప్రబోధం చేశాడు. తరువాత చాలా మంది అనుకరించారు. మేనమామ పేరు ఎప్పుడూ చెప్తుంటారు. ఆయనచే ప్రభావితులయ్యారనుకుంటా.... ఆయన లలితోపాసకులు.

## శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు

19-10-81

5-30 p.m.

నన్నయ నుంచి తిరుపతి వేంకటకవుల వరకు ఒకే మూసలో వస్తున్న సాహిత్యాన్ని, వెయ్యి సంవత్సరాల సంప్రదాయాన్ని పూర్తిగా మార్చేశాడు రాయప్రోలు. అప్పటిదాకా ఉన్న భావ ప్రపంచాన్ని మార్చి నూతన భావ ప్రపంచాన్ని తెచ్చాడు. కవులలో రొమాంటిక్ వాతావరణాన్ని శిల్పించిన ప్రధాన పురుషుడు. శబ్దాలు ఏరుకోవడంలోనే ఎవరూ తీసికోనివి తీసుకుంటాడు రాయప్రోలు.... అంతకుముందు ఈ లక్షణావృత్తిని అనుసరించినవారు లేరా అంటే లేరని కాదు. అస్సలు లేరని కాదు. ఒకళ్ళిద్దరున్నారు. కాని దానికే ప్రాధాన్యం ఇచ్చినవారు లేరు. రాయప్రోలు కవిత్వం అంతా లక్షణావృత్తే.... తెలుగు కవిత్వం రాయప్రోలుతోనే ప్రారంభం. లక్షణావృత్తిని అనుసరించే కవిత్వం. అలంకారం పుడుతుందంటున్నాను. జీవభూతమయిన కవిత్వ లక్షణం ఇదే.

స్ఫురణ కనిపిస్తుంది. ఏడు కోరింది.... వాడికి దొరకలేదు అనుకోండి, అలాంటి స్థితిలో దాన్ని **Platonic love** అనొచ్చు కూడా. కాని దొరికినప్పుడు కూడా ఒక ఉదాత్తతని, ఒక నాగరికతను నిర్వహించడం మనం అమలిన శృంగారం అనాలె. శృంగారానికి కావలసినంత అవకాశం పుష్కలంగా ఉన్నపుడు కూడా దాన్ని పాశవిక స్వభావం చేత మలినం చెయ్యకుండా తనని తాను నిగ్రహించు కోవడం ఏదైతే ఉన్నదో అది అమలిన శృంగారం. అన్ని నాగరిక సంపన్న మైన సాహిత్యాల్లోనూ మనకు దొరుకుతుంది.

అందరు **contemporary poets** లో రాయప్రోలు వారి అమలిన శృంగారమే ప్రభావం.... నిర్వహించింది. దేవులపల్లి శృంగారం అంతా ఈయన దగ్గర నుంచి **inspire** అయిందే. విశ్వనాథ వారి శృంగారం రాయప్రోలు నుంచి పుట్టుకొచ్చిన స్రవంతే. భావ కవితా యుగపు కవు లెంతమందైతే ఉన్నారో అందరూ రాయప్రోలు భావాలకి లొంగిన వాళ్ళే. మధుకలశ రచనకి ఆయన్ని ఆకర్షించిన కారణం బయట దేశాలనుంచి మన దేశం లోకి వీచిన వాయువుల ప్రభావం. నూతన చైతన్యం, నూతన జీవన అవగాహన, నూతన జీవన శైలి చాలా సున్నితమైన మనస్సుల నన్నిటిని ప్రభావితం చేశాయి. అందులో రాయప్రోలు వారు కూడా ప్రభావితులయ్యారు..... ఇక్కడ తాత్త్వికత ఉండటమే ప్రధానమైన కారణం కాదు ఆకర్షణకి.....చార్వాక సిద్ధాంతానికి ఉమర్ తత్త్వానికి చాలా తేడా ఉంది. **Superficial** గా చూడడానికి ఉమర్ ఖయాం నాస్తి కుడుగా మనకు తోచవచ్చు....ఎంతో దూరంగా ఉన్న తత్త్వం ఏదైతే ఉన్నదో ఆ తత్త్వ సీమల్ని ముట్టుకోడానికి ప్రయత్నిస్తున్న ఉద్యమ కర్త అనుకోవాలి. చార్వాకుడు కేవలం హేతువాద నిష్ఠితుడు........ ఉమర్ కి చార్వాకుడికి **Pacific** సముద్రం అంత తేడా ఉంది.

జ్ఞాన, కర్మ, భక్తి మార్గాలనేవి జీవించే వాడికి నిజంగా అంత స్పష్టమైన విభిన్న మార్గాలుగా ఉండవు. ఈ మూడూ కలిపి ఆచరిస్తాడు మనిషి. ముఖ్యంగా కవి అయినవాడు. భక్తి మార్గంలో జ్ఞానం ఉంది, కర్మ ఉంది. భక్తిచేత భక్తుడు కర్మపరుడవుతున్నాడు. భక్తి చేతనే భక్తుడు జ్ఞాని కూడా అవుతున్నాడు ... .... ప్రధానంగా చెప్పాలంటే కవి ఎప్పుడూ భక్తుడు.

అర్థం. వాళ్ళలోపల ఉండొచ్చు. ఈనలో మొత్తం భావావేశం అంతా అక్షరాలు మోసుకొచ్చి మనముందు పడేస్తాయి. అందుచేత ఈన దేశభక్తికి వాళ్ళ దేశభక్తికి ఏదో అక్షరరూపంలో తేడా ఉన్నట్లు మనకు కనిపిస్తుంది.

...... కవికి ఒకే దేవతతో అవసరం లేదు. ప్రతి స్వల్పమయిన వస్తువుతో కూడా అతడు తాదాత్మ్యం పొందవచ్చు. ........దేశభక్తి విషయంలో ఇతను చాలా ఆవేశపూరితమయిన కవిత్వం మనకు ఇచ్చాడంటే ఈన దాన్ని దేవతగా భావించాడా - ఇలాంటి విచారం చాలా అసాహిత్య విచారం. రాయప్రోలు భావావేశం దేశభక్తికి సంబంధించిన భావావేశం ఆనాటి దేశ కాలపరిస్థితుల్లోంచి పుట్టినదే.........గాంధీగారెలాగ ఒక గొంతో ప్రజలకు రాయప్రోలు వారు కూడా అలాంటి గొంతే.

రాయప్రోలువారి అమలిన శృంగార సిద్ధాంతం మన దేశానికి కొత్తేమీ కాదు. మనదేశపు ఉత్కృష్ట సంస్కృతికి చిహ్నము అది. మన దేశపు ఇతిహాసాల్లో ముఖ్యంగా రామాయణంలో అమలిన శృంగారమే వస్తువు. మేఘసందేశం, శాకుంతలం - ఇవి అమలిన శృంగారమే.........క్షీణదశకు వచ్చిన సాహిత్యాన్ని మొట్టమొదటిసారిగా రసదృష్ట్యా ఉద్ధరించి మళ్ళ ప్రాణప్రతిష్ట చేసింది రాయప్రోలనాలి. అమలిన శృంగారం అనే నాగరిక లక్షణాన్ని పునరుద్ధరించడం చేత ఆయన మీకు మళ్ళి సాహిత్యంలో నాగరికతను ప్రాణప్రతిష్ఠ చేశాడు.

అమలిన శృంగారంలో దాంపత్య శృంగారం తత్పూర్వ శృంగారం అన్ని విధముల శృంగారం కూడా ఉంటుంది. అమలినం అంటే వికృతమైన పాశవిక అభిరుచులకు అభివ్యక్తి లేనటువంటిది. ఇవ్వనటువంటిది. వాటి నణగదొక్కిన control లో పెట్టుకున్న పద్ధతి ఏదైతే ఉందో అది అమలిన శృంగారం. సంస్కృతి నాగరికత ఉన్న దశలో ఏ దేశంలోదయినా సాహిత్యంలో అమలిన శృంగారమే సంప్రదాయంగా ఉంటుంది.

.... Platonic love కాదిది. Platonic love అన్న మాటలో ఒక విధమైన సాధించడానికి వీలుకాని అసహాయ స్థితిలో అవలంబించే పద్ధతి అనే ఒక

